# BHRUKTHA RAHITHA TARAKA RAJA YOGAMU

**SADHAKULA PRASNALU – SAMADHANALU**

**(Yoga Practioners' Questions and Answers)**

**(Based on MTA Lectures – Diaries, Notes and Explanations of Master C.V.V.)**

**By**

**A.V.SRINIVASACHARYULU (See Saw)**

**7-2-1997**

**Master C.V.V. Yoga Centre (Branch)**

**Prabhakara Mitra Mandali**

**No.12 Ramulavari Uttara Mada Veedhi**

**Tirupati - 517507**

మాస్టర్ సి. వి. వి.

# భృక్తరహిత తారక రాజయోగము

## సాధకుల ప్రశ్నలు - సమాధానాలు



ఎమ్. టి. ఎ. ఉపన్యాసాలు - సి. వి. వి. గారి డైరీలు
నోట్సులు - వివరణలు ఆధారంగా

రచన

ఎ. వి. శ్రీనివాసాచార్యులు (సీ.సా.)
మాస్టర్ సి. వి. వి. యోగ సెంటర్ (బ్రాంచ్)
ప్రభాకర మిత్ర మండలి
నెం.12, రాములవారి ఉత్తరమాడ వీధి,
తిరుపతి - 517 507.

7-2-1997

మాస్టర్ సి. వి. వి.

# భృక్తరహిత తారక రాజయోగము

## సాధకుల ప్రశ్నలు - సమాధానాలు



ఎమ్. టి. ఎ. ఉపన్యాసాలు - సి. వి. వి. గారి డైరీలు
నోట్సులు - వివరణలు ఆధారంగా

రచన
**ఎ. వి. శ్రీనివాసాచార్యులు (సీ.సా.)**
మాస్టర్ సి. వి. వి. యోగ సెంటర్ (బ్రాంచ్)
ప్రభాకర మిత్ర మండలి
నెం.12, రాములవారి ఉత్తరమాడ వీధి,
తిరుపతి - 517 507.

7-2-1997

**Original Price Rs.50/- First Edition 7th February 1997**
**Scanning Done at Sonakshi Digital Photo Studio, Vijayapuri Colony, Secunderabad 500017.**
**Ph. No. +918142484801**

ప్రథమ ముద్రణము : 7-2-1997
శ్రీధాత - పుష్య అమావాస్య
శుక్రవారం - ధనిష్ఠ - సా॥ 6-00లకు
ప్రతులు 2000

ప్రకాశకులు:
శ్రీ ప్రభాకర మిత్రమండలి
12, రాములవారి ఉత్తర మాడవీధి
తిరుపతి - 517 507
ఫోన్ : 28814

వెల రూ.

ప్రతులకు
మాస్టర్స్ బుక్ సెంటర్
156, బజారు వీధి,
బి.ఒ-266, ప్రకాశం రోడ్డు,
తిరుపతి - 517 501
ఫోన్ : 27785

పాఠకులకు మనవి - ముందు ఈ తప్పులు పుస్తకములో దిద్దుకొని ఆపై చదువ ప్రార్థన.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | | ఒకమాటలో | |
| vii | 14 | యోగా స్కూలు కట్టడము | యోగా స్కూలు ఫ్రెండ్స్ సొసైటి కట్టడము |
| xxi | 15 | యోగా స్కూలు నిర్మించినారు | ఫ్రెండ్స్ సొసైటి నిర్మించినారు. |
| xxiv | 13 | 10-8-978 | 10-8-1978 |
| | | ప్రశ్నలు - సమాధానాలలో | |
| 10 | 2 | ప్రకటించిన పుట | ప్రకటించిన డైరి పుట |
| 10 | 20 | ఏడవది | ఆరవది |
| 11 | 16 | ఎనిమిదవది | ఏడవది |
| 11 | 23 | తొమ్మిదవది | ఎనిమిదవది |
| 12 | 2 | పదవది | తొమ్మిదవది |
| 18 | 4 | 8 గంటలకు | 8.30 గంటలకు |
| 33 | 5 | 65 | 67 |
| 40 | 2 | నష్టాలు | కష్టాలు, నష్టాలు |
| 43 | 20 | వాళ్లేనా | వాళ్లే |
| 45 | 2 | 422 ఇంకా | 422 ఉపోద్ఘాతం 35-36-37 ఇంకా |
| 47 | 4 | నీకు మహాత్మా | నీకు సశరీరంగా మహాత్మా |
| 55 | 20 | ఆరు వైదిక | ఆరు రకాలు వైదిక |
| 59 | 8 | శరీరానికే | శరీరంతో |
| 62 | 10 | కావలసిన విషయాలు | కావలసిన రహస్య విషయాలు |
| 66 | 12 | 4-8-1864 | 4-8-1868 |
| 68 | 23 | దాటి వెళ్లు | దాటి సైన్యం వెళ్లు |
| 69 | 8 | ఆయన కర్మ | ఆయనకు కర్మ |
| 72 | 5 | పెట్టి | పెట్టినారు. |
| 82 | 4 | సూత్రాలు యోగా స్కూలు లాడ్జీకి | సూత్రాలు లాడ్జీకి |
| 82 | 10-11 | (2) (3) | (2) ఎ ఉచితముగా భోజనాలు పెట్టడానికి నీకు పర్మిషను ఇవ్వలేదు. |
| 100 | 4 | భూమిపై వెలసి | భూమిపై సశరీరంగా వెలసి |
| 106 | 10 | వెళ్లుతుంది వెళ్లుతూ | వెళ్లుతుంది వెళ్లుతూ వెళ్లుతూ |
| 106 | 14 | శరీరంలోనే | శవంలోనే |
| 117 | 1 | తెలిసింది అంత | తెలిసింది అనుకొంటాను అంత |
| 117 | 2 | లేదు | లేదు అన్నమాట |
| 118 | 23 | సంబంధించిన | సంబంధించి |
| 119 | 20 | బృహస్పతి పుత్రుడైన | బృహస్పతి పుత్రుడు, తన శిష్యుడైన |
| 122 | 9 | తనము కష్టాలు | తనము, భయము, కష్టాలు |
| 126 | 13 | పట్టణత్తారుకు | పట్టణ స్వామికి |
| 142 | 14 | (సీ.సీ.) | (సీ.సా.) |

Telegrams:—"MASTER" Kumbakonam.
MASTER C. V. VENCASAMI RAO.

666
29-12-19.

YOGA SCHOOL.
DABIR EAST STREET,
Kumbakonam.

| | | |
|---|---|---|
| பிரார்த்தனை. | PRARTHANA. | ప్రార్థన |
| மாஸ்டர் சி. வி. வி. | **MASTER C. V. V.** | మాస్టరు సి. వి. వి. |
| நமஸ்காரம். | NAMASKARAM | నమస్కారము. |
| என் சரீரத்திலுள்ள குறைகளை சீர்ப்படுத்தி எவ்விதத்திலும் விருத்தி செய்தருள பிரார்த்திக்கிறேன். | Please Rectify and develop my system. | నా శరీర ప్రకృతిని స్వస్థతకు ఉద్ధరింప వేడుచున్నాను. |

**Back side of the card**

*M. Narasimham.*

Telegrams:— "MASTER" Kumbakonam.

MASTER C. V. VENCASAMI RAO.

YOGA SCHOOL,
DABIR EAST STREET,
Kumbakonam.

பிரார்த்தனை.

மாஸ்டர் சி. வி. வி.

நமஸ்காரம்.

என் சரீரத்திலுள்ள
குறைகளை சீர்ப்படுத்தி
எவ்விதத்திலும் விருத்தி
செய்தருள
பிரார்த்திக்கிறேன்.

PRARTHANA.

**MASTER C. V. V.**

NAMASKARAM

Please Rectify
and develop
my system.

ప్రార్థన

మాస్టరు సి. వి. వి.

నమస్కారము.

నా శరీరప్రకృతిని స్వస్థతచేసి
ఉద్ధరింప వేడుచున్నాను.

Date 30-3-20
Time 5-35 P.M.

Back side of the card

Initiation No. 675
Name. V. Rudrapathi Pillai
Date 30-3-20
Time 5-35 P.M.

# భృక్తరహిత తారకరాజయోగము

## ఒకమాట

భృక్తరహిత తారక రాజయోగాన్ని అంటే మాస్టర్ సి.వి.వి.గారి యోగాన్ని ప్రపంచంలో ఏ వూళ్లో చేసేవాళ్లు ఉన్నా ఏనాడో ఒకనాడు తిరుపతిలోని శ్రీ ప్రభాకర మిత్రమండలికి రాక తప్పడము లేదు. ఆ వచ్చినప్పడు విశాఖపట్టణం, రాజమండ్రి, ఏలూరు, విజయవాడ, గుంటూరు, వరంగల్లు, కరీంనగర్, హైదరాబాద్, నిజామాబాద్, కుంభకోణం, మదరాసు, ఒంగోలు, నెల్లూరు వగైరాలలో మా మాస్టర్లు ఇట్లా చేస్తారు. అట్లా చేస్తారు అని చెప్పతుంటారు. అట్లా చేయడం తప్ప. మాస్టరుగారు డైరీలలో వ్రాసింది చూడండి అంటే ససేమిరా వినిపించుకోరు. ఆటవికులులా మూర్ఖంగా ప్రవర్తిస్తారు.

ఇవన్నీ చూచిన తరువాత ఒక సమావేశంలో మిత్రులంతా నోట్సులు డైరీల ఆధారంగా ఏదైనా వ్రాయండి; ఇది సరియైన పద్ధతి కాదు అని ఒత్తిడి చేసినారు. మాస్టరుగారి సాహిత్యాన్నంతా అనేక పర్యాయాలు చదివినాను. కాబట్టి నా బుఱ్ఱలో చాలా విషయాలు డిపాజిట్టు అయి వున్నాయి. వ్రాయడానికి ఆరంభిస్తే అంతా గందర గోళంగా తయారు అవుతుంది. అందుకని మీరంతా కలసి కొన్ని ప్రశ్నలు వ్రాసి యివ్వండి. వాటికి బదుళ్లు వ్రాస్తాను అన్నాను. సుమారు వందమంది ప్రశ్నలు కాగితాలపై వ్రాసి ఇచ్చినారు. రాత్రి అందరము కూర్చుని వాటిని విడమరచి హెచ్చు తక్కువగా ఒకే భావముగల ప్రశ్నలను అన్నింటినీ ఒక్కటిగా చేర్చి కుదించి తక్కువ ప్రశ్నలుగా తయారుచేసి 31-12-94 న 1-1-1995 రికార్డు చేసినాము.

ఆ కాసెట్లు ఒక నెలలోనే దేశంలో ప్రచారానికి వచ్చినాయి.

చాలామంది కొని, విని సంతోషించినారు. చక్కబడ్డవాళ్లు చక్కబడుతున్నారు. ఇంకా ఆటవికులులా వెనుకబడి ఉండేవాళ్లూ ఉన్నారు.

ఎమ్.టి.ఎ. ఒకచోట-

"వాళ్లల్లో పేరుకొని పోయిన పూర్వజన్మకర్మ వాళ్లను బాగపడనీయడము లేదు" అని. అట్లాగే బాగుపడని వాళ్లలో పేరుకొని ఉన్న పూర్వజన్మకర్మ వాళ్లను బాగుపడనీయడం లేదు అని అనుకొందాము.

ఎమ్.టి.ఎ. ఒకచోట ఆనాటి మీడియములను చాలా కటువుగా మందలించింది. అందులో-

"యువసాధకుల మనస్సులు చెడుతున్నాయి. అందుచేత నేను స్వయముగా దిగి వచ్చి మీకు ఈ విషయాలు చెప్పతున్నాను' ' అని.

అట్లాగే ఇప్పటివాళ్ల దుర్మార్గత్వము వల్ల కొత్తగా యోగంలో చేరేవాళ్లు, చేరినవాళ్లు అందరూ ఏది సరియైన మార్గమో తెలియక అయోమయంలో పడుతున్నారు.

ఆనాటినుండి తప్పదారిలో నడిచేవాళ్లు ఉంటూనే ఉన్నారు. ఇప్పడు తెలిసీ తెలియని మూర్ఖుల వల్ల ఇంకా వెఱ్ఱితలలు వేయడము ఎక్కువైంది. అందుకే మేము 1-1-95 వ సంవత్సరం టేపు చేసిన టేపులలోని విషయాలను పుస్తక రూపంలో ప్రకటిస్తున్నాము. దీన్ని చూచి అయినా తప్పదారిలో నడిచే వాళ్లంతా సరియైన మార్గంలో నడిచి మాస్టరుగారికి మాస్టరుగారి యోగానికి న్యాయం చేస్తారేమో చూద్దాం. న్యాయం చేయమని సవినయంగా ప్రార్థిస్తున్నాను.

ఒక ముఖ్య విషయాన్ని ఇక్కడ చెప్పక తప్పడము లేదు. సత్యం కటువుగానే ఉంటుంది. యోగమిత్రులు ఒకరు ఈ మధ్యనే మే 1996 న "మాస్టరు సి.వి.వి. జీవిత కథ" అనే గ్రంథాన్ని ప్రకటించినారు. దానిని దైవికంగా నేను చూడడం జరిగింది. ఇదంతా తప్పుల తడక. అసంబద్ధపు వ్రాతలు గలది. ఎవరూ చదువరానిది, చదివి మోసపోకండి అని సవినయంగా చేతులెత్తి నమస్కరించి ప్రార్థిస్తున్నాను.

ఇంతకు ముందే చెప్పినాను. ఎమ్.టి.ఎ.; మాస్టర్ సి.వి.వి.ల రూల్సు, రెగ్యులేషన్సు ప్రకారం ఈయన ఈ భృక్తరహిత తారక రాజ యోగాన్ని చేయడానికే అనర్హుడు అని. ఇతడు ధనాశతో ఏవేవో వ్రాస్తుంటాడు. యోగమిత్రులను నిలువు దోపిడీ చేస్తుంటాడు.

28-11-1912 వ తేది రాత్రి 7 గంటల 15 నిమిషాలకు ఒన్ పాయింట్ ఎమ్.టి.ఎ. ద్వారా క్రింది విషయాన్ని మాస్టరుగారికి తెలిపి, అందరికి తెలియజేయమంటే మాస్టరుగారు తమ డైరీలో వ్రాసియున్నారు-

"ఈ యోగంలో మాస్టర్ సి.వి.వి. ని అత్యంత భక్తి శ్రద్ధలతో గౌరవించాలి. ఆయన మీకు ఈ యోగమును ఉద్బోధించడానికి జన్మించిన ఫిజికల్ మాస్టరుగానే గౌరవించాలి. అంతేగాని ఈయన ఎలా జన్మించినాడు? ఈయన తల్లి ఎవరు? తండ్రి ఎవరు? ఎందుకు ఈయన జన్మించినాడు? అనే విషయాలు చర్చించరాదు. ఇంకా ఏ విధమైన భావాలను ఈయనకు అంటగట్టరాదు" అని.

పై నిబంధనను ఉల్లంఘించి ఈయన ఈ రచన చేసి మాస్టరుగారికి ద్రోహం చేసినాడు.

గ్రంథచౌర్యం చేసి ఈ గ్రంథాన్ని రచించినాడు. ఆ గ్రంథాల

పేర్లు ఎక్కడా పేర్కొనలేదు. ఈ క్రింది వాటిని సంప్రదించి రచించినాడు-

1. మా టేపులలోని విషయాలు.
2. ప్రజ్ఞా ప్రభాకరంలోని విషయాలు.
3. ప్రవచనాలలోని విషయాలు.
4. మా గురుదేవులలోని విషయాలు.
5. భృక్తరహిత తారక రాజయోగంలోని విషయాలు.
6. మేము ప్రకటించిన సి.వి.వి. గారి డైరిలోని విషయాలు.
7. గురుతుల్యులు శ్రీ పోతరాజు నరసింహంగారి జీవిత చరిత్రలోని విషయాలు.
8. శ్రీ ఎన్.బి.వి. రామమూర్తి (కుంభకోణం) గారి పుస్తకంలోని విషయాలు.

ఇంకా చాలా గ్రంథాలలోని విషయాలు సంగ్రహించి తన స్వంత రచన అని ప్రకటించుకొని లోకాన్ని మోసగించినాడు.

సాహిత్య ప్రపంచంలో నీతి, నిజాయితీపరుడుగా ఉన్న రచయిత ఒక గ్రంథాన్ని రచిస్తే ఏ ఏ గ్రంథాలను సంప్రదించినాడో ఆ గ్రంథాల పేర్లు రచయితల పేర్లు వగైరాలను తెలుపుతాడు. ఈయన పై గ్రంథాల నన్నింటినీ సంప్రదించి ఈ అబద్ధాల పంచాంగాన్ని రచించి యోగమిత్రుల మొహాన పడవేసినాడు. కనీసం మాస్టరుగారిని గూర్చిన పుస్తకాలు సంప్రదించినట్లు కూడా వ్రాయలేదు. సత్యయోగం చేస్తున్నప్పుడు సత్యాన్ని పాటించాలని ఈయనకు తోచినట్లు లేదు పాపం. పోనీ రచించిన రచన అయినా సత్యసమ్మతంగా ఉందా అంటే అదీ లేదు.

ఎమ్.టి.ఎ. చందాలు వసూలు చేయరాదనీ, ట్రీట్‌మెంటుకు

డబ్బులు తీసుకోరాదనీ, యోగాన్ని ఉచితంగా తెలపాల వగైరా నిబంధనలు విధించింది. పై నిబంధనలను అన్నింటినీ కాలతన్ని ఈ క్రింది విధంగా ఫీజులు వసూలు చేస్తున్నాడీయన.

ఎ. సాధకులకు ప్రవేశ రుసుము రూ. 500/-

బి. సంవత్సర చందా రూ. 500/-

సి. ట్రీట్‌మెంట్సు ఫీజు రూ. 2500/-

డి. శాశ్వత సభ్యత్వం రూ. 5000/-

ఇట్లా ఫీజులు వసూలు చేసి ఎమ్.టి.ఎ. కి మాస్టరు సి.వి.వి.కి ఎంత ద్రోహం చేస్తున్నాడో మీరే చూడండి.

ఈయన తెలుగు డైరి ఉపోద్ఘాతం 20 పుటలో ఈ క్రింది విధంగా వ్రాసినాడు-

"ఎవరి ప్రేరణ వారిది. ఒక్కరే అన్ని పనులు చేయాలని, చేయడానికి అర్హులమని, హక్కు భుక్తాలున్నవారము అనుకోవడం అవివేకమే కాదు అజ్ఞానం కూడా. హక్కు భుక్తాలున్నాయని విర్రవీగేవారు భోక్తలు కాగలరుగాని భక్తులు కాలేరు".

మేము ప్రకటించిన ఆంగ్ల డైరీలో ఉపోద్ఘాతం పుట 26లో-

"నేను చాలా అదృష్టవంతుడిని, మాస్టరుగారి డైరీలు, నోట్సులు, ఎక్స్‌ప్లనేషన్లు ప్రకటించడానికే పుట్టినానేమో" అని వ్రాసినాను. దానిని ఎద్దేవా చేస్తూ శార్వరి పై వాక్యము వ్రాసినారు.

యోగమిత్రులవద్ద లక్షల రూపాయలు వసూలుచేసి మందిరాలు తన స్వంత పేరుమీద నిర్మించుకొని తన స్వంత ఆస్తి క్రింద కుటుంబ సభ్యులకు పంచిపెట్టిన ఈయన భోక్త అవుతాడు కాని నేనుకాదు. నేను భోక్తను అని నిరూపించే దమ్ములుంటే నిరూపించమని శార్వరిగారిని ఇందుమూలంగా ఛాలెంజ్

చేస్తున్నాను.

తెలుగు డైరి ఉపోద్ఘాతంలోనే ఇంకొక పేరాలో తనను వదలి వెళ్లినవారు సమావేశాలు వగైరాలు ఏర్పాటు చేస్తున్నారని ఏడుస్తూ వ్రాసుకొన్నాడు. మాస్టరుగారి యోగం ఈయన స్వంత ఆస్తియా? ఇతని రంగు తెలియనంతవరకు చెక్కభజన చేసినారు. విషయము తెలిసిన తరువాత దుష్టునికి దూరంగా ఉండాలని వెళ్లినారు. ఇందులో తప్పు ఏముంది? జాగ్రత్తపడి ఇతనిని విడిచి వెళ్లినవారు అదృష్టవంతులు.

ఇక ఈ "మాస్టరు సి.వి.వి. జీవిత కథ" ను గూర్చి చెప్తాను. ఈ గ్రంథము కల్పితాలు, ఊహలతో కూడినది. ప్రామాణికమైనది కాదు. ఇది చదివి సత్యమని నమ్మి ఎవరూ మోసపోకండి.

1. కన్న తండ్రిగా తన బాధ్యతలు తనకున్నాయి. అమ్మాళ్ సత్రంలోనే అయిదవయేట ఉపనయనము చేసినాడు. చూ.పుట.24.

2. అన్నగారి మనోగతం తెలుసుకున్న సుబ్బమ్మ అన్న వదినలను సాదరంగా ఆహ్వానించింది. యధాతథంగా దత్త స్వీకారము చేసుకొన్నది. చూ. పుట. 24.

ఉపనయనమైన పిల్లవానిని ఎవరూ దత్తత తీసుకోరు. అట్లా చేయుడము శాస్త్ర విరుద్ధము కూడ. అందుచేత కన్న తండ్రి ఉపనయనము చేసినాడు అనడం సరియైనది కాదు తప్పు.

3. అదే వీధి మొగదల ఇల్లు దానికి అవతల జాగా, అవతల రోడ్డు ప్రక్కనే కావేరి నది. అంటే రెండవ నెంబరు ఇల్లు. చూ.పుట.25

4. ఆయన నివాసం తూర్పు డబీరు వీధిలోని ఒకటవ నెంబరు ఇల్లే. చూ. పుట. 86.

ఇరవై అయిదవ పుటలో ఏమో రెండవ నెంబరు ఇల్లు అన్నాడు. ఎనభై ఆరవ పుటలో ఒకటవ నెంబరు ఇల్లు అన్నాడు. పరస్పర విరుద్ధంగా వ్రాస్తున్నామన్న పరిజ్ఞానమే లేదు ఈయనకు.

అసలు కథ చెప్పతాను-

ఇప్పడు శార్వరి రెండవ నెంబరు ఇల్లు అన్నది మాస్టరుగారి కాలంలో మొదటి నెంబరు ఇల్లే. మాస్టరుగారి నిర్యాణానంతరము శ్రీవారి అర్థాంగి గారైన గురుతుల్యురాలు శ్రీమతి వెంకమ్మగారూ, మాస్టరుగారి పెద్ద కోడలు శ్రీమతి సి. సీతమ్మగారూ ఆస్తిని పంచుకొన్నారు. 65 వ నెంబరు ఇల్లు వెంకమ్మగారూ,ఒకటవ నెంబరు ఇల్లూ ఖాళీజాగా యోగాస్కూలుగా ఉన్న జాగా అంతా సీతమ్మగారూ తీసుకొన్నారు. సీతమ్మగారికి ఆస్తి సంక్రమించిన తరునాత ఆమెగారు ఖాళీ స్థలాన్ని అమ్మినారు. అమ్మిన తరువాత ఖాళీ జాగా ఒకటవ నెంబరుగానూ, ఒకటవ నెంబరుగా ఉన్న ప్రస్తుత యోగాస్కూలు కట్టడము రెండవ నెంబరుగానూ మున్సిపాలిటీవారు మార్చినారు. మాస్టరుగారి కాలంలో 64 వ నెంబరుగా ఉన్న ఇల్లు 65 గా మారింది. ఈ విషయాలు ఏవీ తెలియకుండా ఏవేవో అసత్యపు అభూత కల్పనలు కల్పించి వ్రాసినారు. ఇదీ తప్పే.

4. "వెంకట్రావు, వెంకాస్వామిరావు" అన్న దానిలో "రావు" అన్న పదం తండ్రి, పెంపుడు తండ్రి, తాతగారి చిహ్నాలు కలిశాయి. చూ.పు.25.

ఇదీ తప్పే. ఈయన నియోగి. నియోగులంతా "రావు" అనీ వైదికులంతా "శాస్త్రులు" అనీ పేరు కొసన తగిలించుకొంటారు. అభం శుభం తెలియని వ్రాత ఇది.

5. అమ్మణ్ణి రంగారావుగారి అర్థాంగి, అమ్మణ్ణమ్మ అచ్చం భర్తకు

1

తగిన ఇల్లాలు. వెంకట్రావు ఒక్కడే సంతానం కావడం వల్ల. చూ.పు.12.

6. కాకపోతే ఏమిటి చెప్పు ఇన్ని వ్రతాలు చేశావు, ఇన్ని పూజలు చేశావు, ఉత్తమ ఇల్లాలివని స్టాంపు వేయించుకొన్నావు. నీకు మరో నలుసునిచ్చాడా దేవుడు? చూ.పుట.13.

7. వెంకట్రావు చెల్లెలి కూతురు రుక్మిణమ్మ చూ.పు. 26.

5, 6, 7, లు చూడండి, పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. 12వ పుటలో "ఒకడే సంతానం" అన్నాడు. 13వ పుటలో "నీకు ఇంకొక నలుసును ఇచ్చాడా దేవుడు" అన్నాడు, ఇక్కడేమో "వెంకట్రావు చెల్లెలి కూతురు రుక్మిణమ్మ" అంటాడు.

తప్పడు వ్రాతలు వ్రాసేటప్పడు ఇంగిత జ్ఞానం ఉండదు. రచన చక్కగా సాగుతూ వుంది అని లొట్టలు వేసుకోవడం వ్రాయడం, లోకం నవ్వుతుంది అన్న జ్ఞానం లేదు.

8. చదువులో అందరికంటే మిన్న. అతని ధారణా శక్తి అపారం, అపూర్వం, అందరికి వెంకాస్వామి అంటే గౌరవం, పదునాలుగో ఏటనే మెట్రిక్యులేషన్ పరీక్ష వ్రాసి విశ్వవిద్యాలయం మొత్తంలో ప్రథముడుగా వచ్చాడు. తరువాత రెండేండ్లలో ఎఫ్. ఎ. పరీక్ష ఇచ్చాడు. చూ.పు. 28

8(ఎ). పద్ధెనిమిదో సంవత్సరం ఎఫ్. ఎ. పాసైనాడు. చూ.పు. 29.

28వ పుటలో 14వ ఏట మెట్రిక్యులేషన్ పాసయినాడు. రెండేండ్లలో ఎఫ్.ఎ. పరీక్ష ఇచ్చాడు. 29వ పుటలో 18వ ఏట ఎఫ్.ఎ. పాసయినాడు అంటాడు. ఈ వాక్యాలు మతిభ్రంశంతో వ్రాసినాడేమో లేకపోతే ఇతని లెక్కలో 14+2=18 ఏమో! లేదా రెండు సంవత్సరాలు మాస్టరుగారు పరీక్ష తప్పినారని ఈయన ఉద్దేశ్యమేమో! కండ్లు

10. వెంకాస్వామి, వెంకమ్మల వివాహము తిరుమలపైనే జరిగింది. చాలాకొద్ది మంది ఆహూతుల సమక్షంలో, చూ.పుట 54.

ఇది శుద్ధ తెలివి తక్కువ వ్రాత. వెంకాస్వామి, వెంకమ్మల వివాహము తిరుపతిలోని శ్రీకోదండ రామస్వామి దేవాలయానికి వెనుక వైపున ఉండిన "సీతారామవిలాస్" అనే ఇంటిలో జరిగింది. ఆ ఇల్లు ఆరోజులలో ఉపనయనాలకు, వివాహాలకు ఇచ్చేవారు. దానిని కొచ్చివారిమేడ "సీతారామ విలాస్" అని పిలిచేవారు. మాస్టరుగారి వివాహా నంతరము ఆ యింటి ఉత్తరపు గోడమీద ఆంగ్లంలో సి.వి.వి. అనే అక్షరాలు ఉబ్బెత్తుగా సున్నంతో పెట్టించినారు. ఒకరోజు కాలేజి నుండి మాయింటికి వస్తూ గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు ఆ అక్షరాలను చూచినారు. వెంటనే వెళ్లి ఇల్లుగల్లవాళ్లను విచారించినారు. వారు వెంటనే వారి వద్ద గల రిజిస్టర్లన్నీ తిరుగ వేసినారు. అందులో శ్రీవారి వివాహము జరిగినట్లు ఉన్నది. వెంటనే శాస్త్రిగారు కర్నాల వీధి నుండి ఆ యింటికి మకాం మార్చిరి. ఒకప్పడు సత్రంలాగా ఉన్న ఇల్లు శ్రీ శాస్త్రి గారు చేరగానే దేదీప్య మానంగా వచ్చేపోయే వారితో కళకళలాడ సాగింది. తిరుమలలో వివాహం జరిగింది అనడం తప్పు.

11. 1908న వస్తున్న తోకచుక్క అలాంటి అద్భుత ప్రభావం గలదని హిందూపత్రిక ముందుగానే ప్రచురించింది. దివ్యజ్ఞాన సమాజం వారు కూడా ఆ తోకచుక్క విశిష్ఠతను ఎత్తిచూపుతూ కరపత్రాలు సభ్యులకు పంపిణీ చేశారు. చూ.పుట 59-60.

హెలీస్ తోకచుక్క 1910లో వచ్చింది అని ప్రపంచమంతా ఘోషిస్తూ వుంటే ఈయన 1908లోనే కనిపించిందని వ్రాసినాడు

బాగు బాగు. పిచ్చి పిచ్చి వ్రాతలు వ్రాసి అందరినీ మోసగించాలని చూస్తున్నాడు. మాస్టరుగారి డైరీలో 1910లోనే తోకచుక్క వచ్చిందని వ్రాసియున్నారు. కాబట్టి ఇది ప్రామాణికమైన వ్రాత కాదు.

12.. యోగం అంటే రెక్టిఫికేషన్. రాజయోగం అంటే గుహ్యమైనది. రాజయోగం సాధనవల్ల అభివృద్ధి చెందేది. చింతనవల్ల గురుకృప వల్ల మాత్రమే పరిణతి కలిగేది. చూ.పు. 65.

యోగమంటే రెక్టిఫికేషననీ, రాజయోగం అంటే గుహ్యమైనదనీ ఎవరూ చెప్పలేదు. ఇదంతా తప్పడు ఊహాతో వ్రాసింది.

మాస్టరుగారి సాహిత్యంలోగాని నిఘంటువులలోగాని ఎక్కడా ఈ అర్థాన్ని ఎవరూ చెప్పలేదు.

పతంజలి మహర్షి "యోగశ్చిత్త వృత్తి నిరోధః" అన్నాడు. అంటే చిత్తవృత్తులను నిరోధించుట యోగము అని అర్థము. మాస్టరుగారి వాక్యం చూపే వరకు ఇదీ తప్పే.

13. 1910 నుండి 1914 వరకు 44 మీడియములు. అందులో 5 గురు స్త్రీలు. చూపు. 83.

ఇదీ తప్పడు వ్రాతనే. 1910 నుండి 29-12-1913 వరకు చేరిన మీడియముల సంఖ్య 114 గురు. ఇందులో మాస్టరుగారి డైరీలు, నోట్సులు ప్రకటించబడ్డాయి. అవి చూచిన తరువాత కూడ కండ్లు మూసుకొని పచ్చి అసత్యాలు వ్రాసి ప్రకటించి మాస్టరుగారికి మాస్టరుగారి యోగానికి ఎంత ద్రోహం చేస్తున్నాడో మీరే చూడండి.

14. సుబ్బమ్మ శవాన్ని వరండాలో అరుగుపైన పడుకోబెట్టినారు. చూ. పుట. 82.

వాకిట వరండాలో ఆనాటి నుండి ఈనాటి వరకు అరుగులేదు. స్వయముగా వెళ్లి వచ్చి కూడా అసత్యాలు వ్రాసి పాపాన్ని

మూట గట్టుకొంటున్నాడు. ఇదీ తప్పడు వ్రాతనే.

15. మాస్టరుగారు ధర్మపురం వెళ్లినప్పడు. చూ. పుట. 96.

ఇదీ తప్పడు కథే. శ్రీ ఎన్.బి.వి. రామమూర్తి పుస్తకాన్ని చూచి వ్రాసినట్లున్నారు. మాస్టరుగారు కుంభకోణం వదలి ఎక్కడికైనా వెళ్లినట్లయితే డైరీలో ఆ విషయాన్ని వ్రాస్తున్నారు. ధర్మపురి వెళ్లినట్లు వ్రాయలేదు. అందుచేత ఇది ప్రామాణికమైన వ్రాత కాదు.

16. ఎ.కె. శ్రీనివాసాచారి ధర్మపురి వాస్తవ్యుడు. చూ. 96.

ఇదీ తప్పే. శ్రీనివాసాచారి కుంభకోణ వాస్తవ్యుడని మాస్టరు గారి డైరీలో వ్రాసియున్నారు. ఈయన మీడియము నెం. 159 చేరిన తేది 1-6-1914 మాస్టరు గారి వాక్యము ప్రమాణమా? శ్రీ ఎన్.బి.వి. రామమూర్తి వాక్యం ప్రమాణమా? ఇతని వాక్యం ప్రమాణమా? ఇట్లా అసత్యాలు వ్రాసాడు ఈయన.

17. తొలి రోజుల్లోనే మాస్టరుగారికి ఒక కుండలిని యోగితో సత్సంగం ఏర్పడ్డది. ఆయన పేరు సి.ఆర్. శ్రీనివాస అయ్యర్ ట్రావెన్కూరు సంస్థానం దివాన్ సర్.సి.పి. రామస్వామి అయ్యర్ సోదరుడీయన. చూ.పు. 97.

మాస్టరుగారి మీడియము ఈయన నెం. 38 చేరిన తేది 11-1-13. "తొలి రోజుల్లోనే మాస్టరుగారికి ఒక కుండలిని యోగితో సత్సంగం ఏర్పడ్డది" యోగం ఆరంభించింది అందరికి తెలిసిన ప్రకారం. 27-5-1910 అంటే అప్పటికి యోగం ఆరంభము అయి రెండు సంవత్సరాల ఏడు మాసాల పధ్నాలుగు రోజులు గడిచిపోయినాయి. ఇదీ తప్పే.

18. వీణా దండం. చూ. పుట. 99

ఇదీ కట్టు కథే. ఇదంతా రామమూర్తి పుస్తకాన్ని చూచి

వ్రాసిన వ్రాతలు. 15-6-1920వ తేదీన వైణిక విద్వాంసుడు వీణ. శేషన్న వీణ వాయించడము చేత సాయంత్రం 6.30 గంటలకు చేయవలసిన ప్రార్థనను రాత్రి 10-40 నిమిషాలు చేసిరి. ఈ విషయము మాస్టరుగారు డైరీలో వ్రాసియున్నారు. సత్యమైన విషయాన్ని మరుగుపరచి కథలు కల్పించి తప్పుడు వ్రాతలు వ్రాసినాడు. ఇదీ తప్పే.

19. పోతరాజు నరసింహం, చూ. పుట 103-108

గురుతుల్యులు శ్రీ పోతరాజు నరసింహంగారిని గూర్చి వ్రాసినారు. ఇదంతా తప్పుల తడక. ఈయన మాస్టరు గారి తదనంతరం యోగం డెవలప్ చేస్తాననడం తెలివి తక్కువ వాక్యం. మాస్టరుగారు తాను చనిపోతానని ఊహించలేదు, ఊహించి ఉంటే ఈయనకు లిఫ్టు ఇచ్చి వుండేవారు. మాస్టరుగారు ఫస్టు గ్రూపు, సెకండు గ్రూపు, థర్డు గ్రూపు టౌన్‌కు అంటే కుంభకోణానికి ఏర్పాటు చేసినారు. అందులో ఈయన గారి పేరు లేదు. మఫిషిల్ కు పైవిధంగానే ఏర్పాటు చేసినారు. అందులోను లేదు ఈయన పేరు. ఇదంతా అభూత కల్పన.

"యోగ పరిపూర్ణతను సంపూర్ణ శరణాగతి విరుద్ధం అని మాస్టరుగారిని గుర్తించి స్వీయ ప్రజ్ఞతో యోగాభివృద్ధి చేసుకొని సిద్ధి పొందాలనే నిర్ణయానికి వచ్చిన ధీమంతుడాయన". చూ. పు. 103.

శ్రీ గురుతుల్యులు పోతరాజు నరసింహం గారికి (మీ. నెం. 123 చేరిన తేది 30-1-1914) ఈ యోగాన్ని గూర్చిన ప్రాథమిక పరిజ్ఞానమే లేదు అని చెప్పడానికి చింతిస్తున్నాను. ఆ కాలంలో మాస్టరుగారిని చులకనగా చూచిన వాళ్లలో ఈయనా ఒక్కరే.

నేను ఫిలాసఫి లెక్చరర్ని ఈయన చెప్పేది ఏమి? నేను వినేది ఏమి? అనే అహంకారంతో ఉండేవాడు. ఈయనే కాదు, ఆనాడు పెద్ద చదువులు, చదివిన వారంతా అట్లాగే ఉండే వాళ్లము అని మాస్టరుగారి మీడియము గురుతుల్యులు శ్రీ కె. వైద్యనాథయ్యరు గారు (మీ. నెం. 55 చేరిన తేది 29-4-1913) మాథ్ స్కూటిక్కు లెక్చరర్ కుంభకోణం కాలేజి తరువాత తిరుపతి శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటి కాలేజిలో ప్రొఫెసర్‌గా చేరిరి. ఆ సమయములో నాకు తెలిపిరి, నాకే కాదు మే నెల సమావేశానికి వచ్చి అందరికి ఎన్నో విషయాలు తెలిపిరి. ఈయనగారు కూడా మాస్టరుగారిని లెక్క చేయలేదు. ఈ విషయాన్నే పిల్లర్ టెస్టులో 30-8-1917లో-

"సామాన్యమైన చదువు చదివిన వారంతా అత్యంత విశ్వాసంతోను, భక్తి శ్రద్ధలతోను యోగాభ్యాసం చేస్తున్నారు. ఎక్కువగా చదువుకొన్నవాళ్లకు, ఈ యోగం మీద భక్తీ, శ్రద్ధా రెండూ తక్కువగా ఉన్నాయి. సామాన్యంగా చదివినవాళ్లు యోగాభివృద్ధిని పొందుతున్నారు. బాగా చదువుకొన్న వాళ్లు యోగంలో అభివృద్ధిని పొందలేక పోతున్నారు. బాగా చదువుకొన్నవాళ్ల అభివృద్ధి ఇకపై ఆరంభం కావలసి ఉంది" అని అన్నారు.

యోగం ఆరంభించింది 29-5-1910 అని అనుకొంటే పిల్లర్ టెస్టు 20-8-1917లో ప్రకటించినారు అంటే 7 సంవత్సరాల 2 నెలల 21 రోజులకు తరువాత అన్నమాట అప్పటికీ వీళ్లు అభివృద్ధి చెందలేదని ఎమ్.టి.ఎ. తెలిపింది. అప్పడే కాదు నరసింహం గారు జీవించినంత కాలం అభివృద్ధి పొందలేక పోయినారు. ఎందుచేత నంటే సంపూర్ణ శరణాగతి పొందలేదు కాబట్టి. ఇదీ తప్పే.

20. "మాస్టర్ యమ్.టి.ఎ. కి మాస్టర్ సి.వి.వి.కి తేడా ఏమిటి?

రెండూ ఒక్కటే నీవు ఎదురుగా చూస్తున్న వ్యక్తి సి.వి.వి. నీవు చూడని వ్యక్తిత్వం యమ్.టి.ఎ. భౌతిక స్థితిలో లేని సి.వి.వి.యే ఆత్మస్థితిలోని యమ్.టి.ఎ. మాస్టర్ సి.వి.వి.ని ఫిజికల్ మాస్టర్ అనవచ్చు, రెండూ ఒక్కటే. అయినా కార్యనిర్వహణలో రెండూ వేరు" చూ. 106.

యమ్.టి.ఎ. ఇచ్చిన ఎస్. ఎస్. లెక్చర్లలో 11-12-1910వ తేదీన ఇలా చెప్పింది-

"యమ్.టి.ఎ. అయిన నేను బ్రాహ్మణుడను. ఒన్ పాయింటు ఈ లైన్ను డెవలప్ చేయడానికి నన్ను పంపింది" అని అన్నారు కాబట్టి ఈయన వ్రాత తప్ప.

21. "1914లో యోగంలో ప్రవేశించి యాభై సంవత్సరాలు నిరాటకంగా యోగసాధన చేసిన ఆదర్శయోగి ఆయన" చూ. పు. 103.

అని వ్రాసినారు. ఇదీ తప్పే. నరసింహంగారు ఎంత ఆదర్శయోగో చూడండి. ఈయన మా గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారికి 12-7-1949 క్రింది విధంగా ఉత్తరము వ్రాసినారు.

మైడియర్ ఫ్రెండ్:

*మీరు దయతో వ్రాసిన జాబు అందినది. మీ ఉద్యమము సానుకూలముగా నెరవేరగలదని నమ్ముచున్నాను, నా ద్వారా మీకు ఏమి తెలియవలెనో మనము ఇక్కడ కలుసుకున్నప్పడు మాట్లాడు కొందాము. మీరు ఎప్పడు వచ్చేది వ్రాస్తే నేనే మీ బసకు వచ్చెదను. నాకు మన యోగము వలన యిది వరకు ఏవిధమైన అనుభూతి కలుగలేదు. సరికదా నాకు మా ఆవిడకు అనేక శరీర కష్టములు ప్రాప్తమయియున్నవి. ఏవో [illegible]చికిత్సలు చేసుకుంటున్నాము. భవిష్యత్తు*

ఎలాగుండునో తెలియదు. ఇప్పటి స్థితి గతులు చూస్తే మనము బయటపడుటకుచిత కాలముగా అగపడదు. ఈ సమాచారమే శ్రీ వెంకమ్మగారితో చెప్పితిని. మనలో ఎవరైనను మన యోగమునకు నిదర్శన ప్రాయముగా నిలిస్తే అప్పడు మనము బహిరంగము కాగలము. మీరు అనుకొన్నట్లు నాల్గవ పది సంవత్సరములు గడిచిన పిదప ఏదైన త్రోవ ఏర్పడుతేనేమో. మీ రాకకు ఎదురుచూచు చున్నాను.

ఇట్లు

మీ మిత్రుడు

పో. నరసింహం.

యీ మధ్య ఒకరు గాలి బాల సుందరరావు అనువారు మీ సలహాపైని నన్ను చూచుటకు వచ్చి యుండిరి.

పో. నరసింహం (పో.న)

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు

తిరుపతి

ఎమ్.టి.ఎ. ఇలా చెప్పింది-

"నా సొసైటి మీడియములు వారి కష్టాల నన్నింటినీ పోగొట్టుకొని హాయిగా సుఖసంతోషాలతో వర్థిల్లుతారు".

సక్రమంగా ప్రార్థన చేసేవాళ్లకు ఏవిధమైన బాధలూ వుండవు అని కదా! మరి నరసింహంగారు ఆదర్శయోగిగా అభివృద్ధి పొందివుంటే ఎందుకు జీవితాంతము కష్టాలు పడ్డారు? దీనిని బట్టి ఈయన సక్రమముగా ప్రార్థన చేయలేదని తెలుస్తొంది. నరసింహం గారు ఎంత ఆదర్శయోగో శార్వరి కూడా అంతే

ఆదర్శయోగి. కాబట్టి ఇది కూడా తప్పే.

22. పి.ఎన్.గారి హితోక్తులుః- రోగ నివారణ శక్తికి యోగ సాధనకు సంబంధము లేదు. .............. ఇప్పుడు ఎవరైనా ట్రీట్‌మెంట్లు చేస్తున్నారంటే అదివారి స్వశక్తి వల్లనే యోగ సాధనతో సంబంధం లేదు" చూ.పూ. 112.

పి.ఎన్ గారి హితోక్తులన్నీ మాస్టరుగారి రూల్సు, రెగ్యులేషన్సుకు విరుద్ధమైనవి. ఈయన మాస్టరుగారి నోట్సులు వగైరాలు తమ వద్ద ఉన్నా వాటిని చూచిన పాపాన పోలేదు. చూచి వుంటే ఇట్లా వ్రాసి వుండరు. మాస్టరు సాహిత్యంలో ఉన్న విషయాలు మీకు తెలుపు తాను చూడండి-

ఈ యోగం యొక్క ఉద్దేశ్యం "యోగ టీచ్ ప్రాణ ట్రీట్" అని ఆరంభమయింది.

1910 లో ఎమ్.టి.ఎ. ఇలా చెప్పింది-

మూర్ఛకు - తీవ్రమైన జ్వరాలకు - నరాల వ్యాధులకు గ్రాడ్యుయేట్ అయినవారు అంటే అభివృద్ధి పొందినవారు ట్రీట్‌మెంట్లు ఇచ్చి రక్షించాలి అని.

1910 లో ఎమ్.టి. ఎ. ఇంకొకచోట ఇలా చెప్పింది-

"మాస్టరు స్వయముగా ఎవరి యింటికైనా, ఎక్కడికైనా ట్రీట్‌మెంటుకు వెళ్లేటప్పుడు విధిగా ఒక మీడియముగాని పీపుల్‌గాని వారి వెంట ఉండాలి. చిన్న చిన్న వ్యాధులకు ఈ ప్రార్థనను ఉపయోగించరాదు" అని.

1910 లోనే ఎమ్.టి.ఎ. ఇలా చెప్పింది-

"గ్రాడ్యుయేట్ అయినవారు అంటే యోగంలో అభివృద్ధి పొందినవారు ఇచ్చిన ట్రీట్‌మెంటు ఫలము సొసైటి అధిపతియైన

నీకు (అంటే సి.వి.వి.కి) సగము నీ మీడియములకు సగము లభిస్తుంది. అప్పడు వాళ్లు నీ వుత్తరువులను అన్నింటిని భక్తితో పాటిస్తారు" అని.

1910 లోనే ఎమ్.టి.ఎ. ఏమి చెప్పిందో చూడండి-

"40 మైళ్ల దూరంలో ఉండే పేషంటును 10 ఎమ్.టి.ఎస్. వైబ్రేషన్సుతో ఒక మీడియము ఆస్ట్రల్‌ను పంపి ట్రీట్‌చేసి ఆ పేషంటులో పేరుకొనిపోయిన పూర్వజన్మకర్మను తొలగించి రక్షించు" అని.

1910 లో ఎమ్.టి.ఎ. ఒక ముఖ్యమైన విషయాన్ని తెలియ జేసింది. అది ఏదంటే-

"నీవు యోగంలో అభివృద్ధి పొందినావు అనడానికి నీవు ఇచ్చే ట్రీట్‌మెంట్లు ఫలించడాన్ని బట్టి తెలుస్తుంది. నీకు తోచే ప్రామాణికమైన భావాలు నీ అభివృద్ధిని తెలియ జేస్తాయి" అని.

1910 లోనే ఎమ్.టి.ఎ. ఇలా చెప్పింది-

"ఆనీబిసెంటు గుండె నొప్పితో బాధపడుతూ వుంది. నీ భార్య ఆస్ట్రల్‌ను పంపి ఆవిడ గుండె నొప్పి ఈ రోజే తగ్గించు. ఆమెకు నీమీద గౌరవము ఏర్పడుతుంది. నీకు కావలసిన పని పూర్తి చేసుకో" అని.

1910 లోనే "పక్షవాతానికి మాస్టరుగారినే ట్రీట్‌మెంటు చేయమని ఎమ్.టి.ఎ." చెప్పింది.

1910 లో ఎమ్.టి.ఎ."ఇప్పడు చేరినవాళ్లు కూడా ట్రీట్‌మెంటు చేయవచ్చు. ఇక్కడనుండే చేయవచ్చు. నేరుగా వెళ్లి చేయవచ్చు. మీరు సంపాదించుకోవడము కాదు. మీరు సంపాదించినది అందరికీ పంచిపెట్టాలి." అని చెప్పింది.

1910లో ఎమ్.టి.ఎ. "దూర ప్రదేశాలకు ఒక మీడియము ఆస్ట్రల్‌ను పంపి ట్రీట్‌చేసి రక్షించు" అనింది.

1910 లోనే "డాక్టరు చేసిన తప్పను ఆస్ట్రల్ ద్వారా ట్రీట్‌చేసి తప్పను దిద్దు" అని చెప్పింది ఎమ్.టి.ఎ.

1910లోనే "ఆస్ట్రల్ బాడీతో ట్రీట్‌మెంట్ కాని ఆస్ట్రల్ బాడీని నేరుగా చూచికాదు" అనింది ఎమ్.టి.ఎ.

1910 లోనే ఎమ్.టి.ఎ. ఏమి చెప్పిందో చూడండి-

"కర్మ వ్యాధులకే ఈ ప్రార్థన ద్వారా రిలీఫ్ కలిగించాలి. నీవు సరిగా ప్రాక్టీసు చేయడముచేత అభివృద్ధి పొందినావు. ట్రీట్‌మెంట్లు ఫలిస్తున్నాయి. అయినా చాలదు- నీ మీడియములను అతి జాగ్రత్తగా గైడ్ చేయాలి. డాక్టర్ కంటే ఎక్కువగానే నేర్వాలి. నీ స్వార్థం కోసరము వాళ్లను తప్పదోవ పట్టించరాదు. ఇది గారడీ విద్య కాదు. 5 నిమిషాలలో చూపేదానికి" అన్నారు.

ఇదే కాకుండా మొత్తం సాహిత్యంలో ట్రీట్‌మెంటులేని పేజీయే ఉండదు.

నరసింహంగారే కాదు ఇప్పటి వాళ్లలో చాలామంది ట్రీట్‌మెంట్లుకు, యోగానికి సంబంధము లేదు అంటున్నారు. దీనికి రెండు కారణాలు ఉన్నాయి.

ఒకటి సక్రమంగా ప్రాక్టీసు చేస్తే అభివృద్ధి కలుగుతుంది. ఆ చేసేదికూడ అత్యంత భక్తి శ్రద్ధలతో, విశ్వాసంతో, క్రమం తప్పకుండా ప్రార్థన చేయాలి. అది చేయడం ఇప్పటి వాళ్లల్లో చాలా మందికి తెలియదు.

వీళ్లు కోర్సులంటూ నూతిలో కప్పల్లాగా అరవడమేకాని ప్రార్థన చేయరు.

20-11-1921 న ఎమ్.టి.ఎ. ఏమి చెప్పిందో చూడండి-

"మనం శబ్దాలు వెదజల్లి సంతోషపడరాదు. మనం ఆచరణలో శాశ్వతత్వాన్ని నిరూపించాలి" అని.

30-11-1920 లో ఎమ్.టి.ఎ.-

"ఇకమీదట మీడియములకు ప్రాక్టీసుకు గాను ఇచ్చేది ఏమీలేదు. సత్యం లోకంలో వెల్లడి అయ్యేవరకు మీడియములు మాస్టరుగారి పేరునే ఉదయం రెండుసార్లు చెప్పి ప్రార్థించేది"

ఇంత స్పష్టంగా మాస్టరు సి.వి.వి.గారు డైరీలలో వ్రాసిపెట్టినా కోర్సుల పిశాచి పట్టిన వీళ్లు కోర్సులు చేసుకొంటూ అభివృద్ధి పొందలేక పోతున్నారు. అందుచేత వీళ్లు ట్రీట్‌చేస్తే తగ్గకపోవడం మొదటి కారణము.

రెండవ కారణము ఇతరుల అభివృద్ధిని చూచి అసూయా ద్వేషాలతో ఏవేవో అవాకులు, చెవాకులు వ్రాయడం- వాగడం. మాస్టరుగారి సాహిత్యం నోట్సులు, డైరీలు అచ్చు అయినవి కొన్నారు, చూచినారు. కాని వారిలో మార్పు రాలేదు. ఇక ఈ జన్మకు రాదనుకొంటాను. ఎమ్.టి.ఎ. ఒకమాట అన్నారు "వాళ్లల్లో పేరుకొని పోయిన పూర్వజన్మ కర్మ వాళ్లను బాగుపడనీయడము లేదు" అని. కాబట్టి వీళ్లల్లో పేరుకొని పోయిన పూర్వజన్మ కర్మ తొలగిపోయి వీళ్లంతా బాగుపడాల అని మనం మాస్టరుగారిని ప్రార్థించడం తప్ప చేయగలిగింది ఏమీలేదు. అంతరాత్మ పరిశీలన ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందాలి అన్నారు ఎమ్.టి.ఎ. 1917లో. అంతరాత్మ పరిశీలన అంటే ఏమిటో వీళ్లకు తెలియదు. ఇదీ తప్పే.

23. ఇంట్లో ఎవరూ లేరు. వంట మనిషి వెళ్లి నరసింహంగారికి చెప్పింది. చూ. పు. 109.

వారు వెళ్లమంటే వెళ్లాను. చూ. పు. 109.

మొదట ఏమో ఎవరూ లేరన్నాడు అదే పేజీలోనే వారు వెళ్లమంటే అంటారు. పరస్పర విరుద్ధం కదా. తప్పు ఇది కూడ.

24. 10-5-1922 రాత్రి 10 గంటలకు మాస్టరుగారికి ఎక్కిళ్లు రాసాగాయి. చూ. 109.

11-5-1922 మరలా గుండెపోటు వచ్చింది. చూ.110.

మరలా గుండెపోటు వచ్చింది. అంటే ఇంతకుముందు గుండెపోటు వచ్చింది అని చెప్పి వుంటే కదా మరలా అనే పదం ఉపయోగించడానికి- ముందేమో ఎక్కిళ్లు అన్నాడు ఇక్కడేమో మరలా గుండెపోటు అంటాడు. పరస్పర విరుద్దం కదా- అందుచేత ఇదీ తప్పే.

25. యోగాస్కూలు పర్ణశాలలో నడిచేది. చూ. 123

మాస్టరుగారు పుదుక్కోట మహారాజాతో కలిసి మీటర్‌గేజ్ రైల్వేలైను కాంట్రాక్టు చేసినారు. దానిలో మిగిలిన రేకులతో ఆయనే యోగాస్కూలు నిర్మించినారు. పర్ణశాలలో యోగాస్కూలు అనేది తప్పు. ఇది ఎన్.బి.వి. రామమూర్తి పుస్తకం చూచి వ్రాసింది. ఇతని కంటే అబద్ధాలకోరు ఆయన.

26. ఒక కాఫీ హోటలుకు అద్దెకు ఇచ్చారు. ఆ చెట్టును హోటల్ వాళ్లు నరికి వేశారు. చూ. 123.

అక్కడ ఉన్న మామిడిచెట్టు రెండు మూడు సంవత్సరాలకు పూర్వం యోగాస్కూలు పునర్నిర్మాణ సమయంలో యోగాస్కూలు ఫ్రెండ్సు సొసైటి వాళ్లు నరికి ఆ చెక్కలను యోగాస్కూలుకు ఉపయోగించినారు- ఇదీ తప్పే. హోటలువాళ్లు నరకలేదు.

27. మాస్టరుగారిని పరబ్రహ్మాంశతో జన్మించినవారుగా

నమ్మలేనివారు. మదర్ వెంకమ్మగారిని బ్లావెట్స్కీగాను నమ్మలేరు. చూ.పు. 130.

ఇది నాడీ గ్రంథంలోనిది. ఎమ్.టి.ఎ. ఒకచోట మాస్టరుగారు బ్రహ్మ-విష్ణు-శివుల అంశ అని ఎవరైనా అంటే అటువంటివారు ఈ సొసైటి నుండి బహిష్కరింపబడతారు అని అన్నారు. అందుచేత ఈ వాక్యము, భావమూరెండూ తప్పే.

28. యోగశక్తి అనేది శివశక్తుల కలయిక. చూ. పుట. 132. ఇది పైదానిలాగా తప్పే.

29. వెంటనే మాస్టరుగారు సమాధిలోకి వెళ్లి. చూ. పు. 132.

పతంజలి యోగంలో సమాధి స్థితిని చేరుకోవడం అత్యున్నత స్థితి. కుండలినీ శక్తి పనిచేయడం ఆరంభిస్తే ఈ స్థూల శరీరానికి బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా పోతుంది.

అయితే భక్తిరహిత తారక రాజయోగంలో కుండలినీ శక్తి పనిచేయడం ఆరంభిస్తే ఈ స్థూల శరీరం ప్రజ్ఞతో ఉండగానే అన్ని విషయాలు మనకు కుండలిని తెలియజేస్తుంది. అని ఇన్‌డిపెండెన్సు డిక్లరేషన్‌లో చెప్పబడి ఉన్నది. అందుచేత మాస్టరుగారు సమాధిలోకి వెళ్లినారు అనడం తప్పే.

30. ఒకసారి సమాధి నుండి లేచి- చూ. 133. పై సమాధానమే దీనికీ- ఇదీ తప్పే.

31. అలాగ బోధించే సమయాలలో ఆ గోడమీద ఆశీను లయ్యేవారు. చూ. 137.

ఇదీ తప్పే. ఆ గోడమీద కాదు ఆశీనులయ్యేది. ఆ గోడను ఆనుకొని ఉత్తర దక్షిణాలకు ఒక తిన్నె ఉండేది. ఆ తిన్నె మీద ఆశీను లయ్యేవారు. తోచినవి అవాకులూ చెవాకులూ వ్రాయడం

ఈయనకు అలవాటు అట్లాగే ఇదీ వ్రాసినారు. ఇదీ తప్పే.

32. విశాలమైన వరండా అరుగుమీద కూర్చుని. చూ. 139.

వరండాలో ఆనాటి నుండి ఈనాటి వరకు అరుగు అంటూ ఏమీ లేదు. ఈయన కుంభకోణం వెళ్లి ప్రార్థన చేసి వచ్చినాడు జన్మకొక శివరాత్రి అన్నట్లు. ఇది కూడా కంటికి కనిపించలేదంటే ఆశ్చర్యంగా ఉంది. ఇదీ తప్పే.

33. గదిలోకి వెళ్లి మాస్టరుగారిని అభ్యర్థించినారు. నన్నేం చేయమంటారు అని ప్రార్థించారు. మాస్టరుగారి నుండి అనుమతి వచ్చింది. చూ. 140.

మాస్టరుగారు స్వతంత్రులు కారు. ఈయనా అస్వతంత్రుడే. ఎందుకంటే ఎన్నో సందర్భాలలో "నాకు పర్మిషన్ రాలేదు" అని డైరీలలో వ్రాసియున్నారు. కాబట్టన్నీ "నేను కనిపించి చెప్పినాను" అని ఎవరైనా చెప్పితే అది కార్యరూపం ధరిస్తే నేను తోపజేసింది లేకుంటే మిమ్మల్ని మోసగించే మాయాశక్తి తోపజేసింది అని అనుకోండి అన్నారు. కాబట్టి తప్పు.

34. "నా డిస్కవరి ఆఫ్ మాస్టర్ యోగ" అనే పుస్తకం మొదటి కాపీ శ్రీ టి.యస్. శంకరయ్యరు గారికి ఇచ్చి ఆశీర్వదించమంటిని. చూ.పు. 143.

35. "యు డిడ్ ఎ వండర్‌ఫుల్ జాబ్" అని చాలా సంతోషించినారు. చూ. పు. 143.

36. యోగాపై ప్రాపర్ పర్‌ఫెక్షన్ ఉన్నవాడివి అన్నారు. చూ. పు. 143.

ఇదంతా సత్యదూరాలైన విషయాలు. స్వంత డబ్బా వాయించుకొని లోకాన్ని మోసగించే వాక్యాలు. శ్రీ గురుతుల్యులు

టి.ఎస్. శంకరయ్యరుగారు ఆంధ్రదేశంలోని మిత్రులకు ఉత్తరాలు వ్రాసినారు. అందులో శ్రీమాన్ సేనాపతి తిరుపతాచార్యులుగారు మొగుళ్లపల్లి, శ్రీ ఎస్.వి. పున్నయ్యగారు పచ్చలతాడిపఱ్ఱు, శ్రీ వి. రాధాకృష్ణగారు వరంగల్లు, పూజ్యులు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు మదనపల్లి, శ్రీ జె.బి.ఎస్. కోట్సు- మదరాసు వగైరాలకు ఉత్తరాలతో క్రింది విధంగా వ్రాసియున్నారు.

(ఎ) శ్రీ రాధాకృష్ణగారు గురుతుల్యులు శ్రీ టి.యస్. శంకరయ్యరుగారికి ఒక ఉత్తరం వ్రాసినారు. అందులో క్రింది విధంగా ఉంది.

"మీ సలహా ప్రకారము నేను కోర్సులు చేయడము నిలిపి వేసినాను. మాస్టరుగారి ప్రార్థన మాత్రము చేస్తున్నాను." సంతకము వి. రాధాకృష్ణ.

(బి) 10-8-978 న శంకరయ్యరుగారు ఎవరికో ఉత్తరము వ్రాసియున్నారు. అందులో-

"ఒంగోలు, బాపట్లల్లో ఎమ్. నరసింహం వల్ల, వి. సుబ్బారావు వల్ల చాలామంది సింపతైజర్సు యోగంలో ఏర్పడినారు. కాలక్రమంగా మాస్టరుగారు ఏర్పాటుచేసిన మార్గము నశించింది. అనేక రకాలైన వ్యాఖ్యానాలు తయారు అయినాయి. వాళ్లకు తోచిన విధంగా చేస్తూ మాస్టరుకు అంటగట్టినారు. ఆంధ్రలోని సాధకులను విమర్శించుట కాదు నాకు కావలసింది. అందరూ ఒకటై మాస్టరుగారు చెప్పినట్లు నడుచుకోవడమే నాకు కావలసింది. టి.ఎస్.ఎస్."

6-2-1978 లో శంకరయ్యర్ గారు సేనాపతి తిరుపతాచార్యులకు వ్రాసిన ఉత్తరంలో-

"నేను చెప్పినట్లు మాస్టరుగారి పేరు చెప్పి ప్రార్థన చేస్తూ

వచ్చేది. ఇతర సెంటర్లలోని పదాలను ఉచ్చరించవద్దు. శార్వరిలాగ ఆంధ్రదేశం నుండి చాలామంది మిత్రులు వ్రాస్తున్నారు. వాటికి బదులు వ్రాస్తున్నాను. టి.ఎస్.ఎస్."

31-10-78 లో తిరుపతాచార్యులకు-

"ఒకే ఒక్క మాస్టరు ప్రపంచంలో ఉంటాడు. ఇంకొకరు ఉండడు. మాస్టరు సి.వి.వి. ని జీవితంలో చూడని ఎక్కిరాల కృష్ణమాచార్యులు వగైరాలు మాస్టరు అనుకొంటున్నారు. టి.ఎస్.ఎస్."

18-1-1978 లో తిరుపతాచార్యులకు-

" దేశంలో అందరి వద్ద నుండి నీవు సలహాలు తీసుకొంటున్నట్లు తెలుస్తూంది. సారీ. ఇవేవీ నీకు ఉపకరించవనీ నీకు తెలుసు. ఆంధ్ర దేశంలోని యోగమిత్రులు కోర్సులమీద భక్తితో వాళ్ల ఇష్టప్రకారం చేస్తున్నారు. వాళ్లంతా ఒంగోలు మాస్టరనీ, కుంభకోణం మాస్టరనీ పిలుస్తుంటారు. నీవూ ఒకే మాస్టరని ఇంకొక మాస్టరు లేడని అంగీకరిస్తున్నావు. నేను చెప్పినట్లు చేసేటట్లయితే మాస్టర్ సి.వి.వి. పేరు చెప్పి ప్రార్థన చేయి. టి.ఎస్.ఎస్."

14-6-1977 లో తిరుపతాచార్యులకు-

" ఎవరికీ భయపడకుండా ఎవరినీ ఆశ్రయించకుండా నీవు మాస్టరు సి.వి.వి. గారి పేరు చెప్పి ప్రార్థించడమే నీవు చేయవలసిన పని. టి.ఎస్.ఎస్."

9-3-1979 లో తిరుపతాచార్యులకు-

"మాస్టర్లము అని చెప్పకొనే వారి మాటలు వినడముచేత నీ మనసు కలత చెందింది. నేను నీకు ఇచ్చే సలహా ఏమంటే మాస్టర్ సి.వి.వి. పేరు చెప్పి ఉదయము సాయంత్రము ప్రార్థనే చేయి. మాస్టరు పేరు తరువాత ఎవరి పేరూ చేర్చవద్దు. టి.ఎస్.ఎస్."

30-1-1976 లో తిరుపతాచార్యులకు-

" ఆంధ్ర దేశంలో మోసగించే సంస్థలు చాలా వెలసినాయని తెలిసి నేను చాలా బాధపడుతున్నాను. ఆ సంస్థలు సాధకులకు కన్‌ఫ్యూషన్ కలిగిస్తున్నాయి. అసలు విషయాన్ని పక్కకు నెట్టుతున్నాయి. టి.ఎస్.ఎస్. "

1-4-1974 లో తిరుపతాచార్యులకు-

"నేను ప్రకటించవద్దని గట్టిగా చెప్పినప్పటికీ నా మాట వినిపించుకోకుండా డబ్బు సంపాదించాలనే ఉద్దేశ్యంతో "మాస్టర్ యోగ జర్నల్" అనే దానిని ప్రారంభించినారు". టి.ఎస్.ఎస్."

5-4-1973 లో తిరుపతాచార్యులకు-

" 31-1-1922 వరకు చేరిన మీడియములు మాత్రం ఒలిడియర్ మూడవ పేరు చెప్పి ప్రేయరు చేయాలి. ఆ తరువాత ఈ యోగంలో చేరేవారు మాస్టర్ సి.వి.వి. పేరు చెప్పే ప్రాక్టీస్ చేయాలి. ఇది మాస్టర్ సి.వి.వి. గారి ఉత్తరువు. దొంగ సంస్థలు ఎన్నో పుట్టుకొస్తున్నాయి. వాటిని గూర్చి నేను మాట్లాడదలచుకోలేదు. టి.ఎస్.ఎస్. "

23-12-1972 లో తిరుపతాచార్యులకు-

" నీవు ఇప్పుడు యోగానికి సంబంధించిన సాహిత్యం చదవాలని ఉబలాటపడుతున్నావు. ఆ పుస్తకాలు చదవడంచేత నీకు ఏ మేలూ జరగదు. యువకులైన రచయితలు రచించిన పుస్తకాలు నైట్ పాయింటర్సుగా ఉంటాయి. నేను నీకిచ్చే సలహా ఏమంటే క్రమం తప్పకుండా ఉదయము సాయంత్రము మాస్టరు పేరు చెప్పి ప్రార్థన చేయాలి. మాస్టరుగారి పేరును జపించరాదు. అట్లా జపిస్తే శరీరం అత్యుష్ణాన్ని పొందుతుంది. టి.ఎస్.ఎస్. "

ఉపన్యాసాలుగాని మాస్టరుగారి సిద్ధాంతాలకు దూరమై పోయినాయి. రేడియోను సరియైన స్టేషనులో ఉంచితే చక్కగా పాడుతుంది.

ఆంధ్రదేశంలోని యోగమిత్రులు చాలామంది నాకు ఉత్తరాలు వ్రాస్తున్నారు. వాటన్నింటికి బదులు వ్రాస్తున్నాను. కొన్ని తెలుగులోను కొన్ని ఆంగ్లంలోను పుస్తకాలు ప్రకటించినారు. ఆ పుస్తకాలు మాస్టరుగారి సాహిత్యపు టంచులు కూడా చేరడానికి పనికి రావు. మాస్టరంటే సి.వి.వి. తప్ప ఇంకెవరూ మాస్టరు కాదు అని తెలుసుకో. "మాస్టరు సి.వి.వి.గారి మీడియములు గాని ఇంకా ఎవరైనా గాని మేము మాస్టర్లము అని చెప్పకొనే అధికారం ఉన్నదా? పిలవమనే అధికారం ఉన్నదా?"

నేను కడపటగా నీకు ఇచ్చే సలహా ఏమంటే మాస్టరు మాలో ఉన్నాడు అని మిమ్మల్ని మోసగించే బిచ్చగాండ్ల వంటి వారి దగ్గరకు చేరకుండా శాశ్వతుడైనటువంటి సి.వి.వి. ని ప్రార్థించు" అని.

18-9-72 లో తిరుపతాచార్యులకు-

"చనిపోయిన ఒంగోలు నరసింహము నాకు తెలుసు. మన ప్రాచీన వేదాలు, శాస్త్రాలు ఏండ్లు గడచిన కొద్దీ అవన్నీ చెడ్డ మార్గాలు త్రొక్కి పాచిపట్టిపోయినాయి. ఇన్‌సియేషన్ సంగతికి వద్దాము మాస్టరుగారికి ఒక్కరికి తప్ప ఇంకెవరికీ ఇన్‌సియేషన్ ఇచ్చే అధికారము లేదు. మాస్టరుగారు మరుగైన తరువాత యోగంలో సింపతైజర్సు అంటే అభిమానించేవారే ఉంటారు. (మీడియమ్సు అని చెప్పడానికి లేదు) మాస్టరుగారు 31-1-1922 ఇన్‌సియేషన్ నిలిపి వేసినారు. ఆ తరువాత చేరిన వారిని ప్రత్యేకమైన గ్రూపుగా ఏర్పాటు చేసినారు.

మొదటి గ్రూపు వారిని ఒబిడియర్ గ్రూపు అని ఏర్పాటు చేసినారు. వాళ్లకు ఒబిడియర్ మూడవ పేరు ప్రాక్టీసు చేయ

వలసింది అని ఉత్తరువు చేసినారు సి.వి.వి. చక్కగా రోడ్డు వేసిన తరువాత దానిపై మరలా రోడ్డు వేస్తారా? కాబట్టి నేను ఇప్పుడు మార్చి యిచ్చే ప్రార్థనను చేయాలి. ఒక్కొక్కరి శరీర ప్రకృతి ఒక్కొక్క రకముగా ఉంటుంది. వివిధ రకాలైన గాంగ్లియాలు కలిగి వుంటారు. అది పెద్ద విషయము కాదు. నీకే కాదు ఈ యోగంలో చేరినవాళ్లలో చాలామందికి నమస్కార ముద్ర రావడము లేదు. మాస్టరుగారి పేరు చెప్పగానే వర్కింగు ప్రారంభమవుతుంది. క్రమంగా తగ్గి పోతుంది. నీవు అత్యంత ప్రాధాన్యాన్ని ఫినామినాలకు ఇవ్వవద్దు. అవి నిన్ను తప్పదారి పట్టిస్తాయి. ఆంధ్రలోని యోగమిత్రులు ఫినామినాలకు అత్యంత ప్రాధాన్యము ఇస్తారని విన్నాను. క్రమంగా మీరు మీ కుండలినిలో మాస్టరును చూడగలరు. లోనుండి మీకు సరియైన సలహాలు ఇస్తారు. అందుచేత నేను నిన్ను కోరేదేమంటే మాస్టరుగారు చెప్పిన రూల్సు, రెగ్యులేషన్సును పాటించి ప్రాక్టీసు చేస్తే నీకు కావలసినవన్నీ ఆయనే సమకూరుస్తారు.

నేను ఈ యోగంలో11-8-1916 లో చాలా చిన్న వయస్సులోనే చేరినాను. దొరికిన అన్నీ పుస్తకాలు చదివినాను. కానీ నాకు తృప్తి కలుగలేదు. నా అదృష్టము కొలది ఇంతకుముందే 1913 లో చేరిన ఒక మీడియము నాకు ఈ యోగాన్ని గూర్చి అన్ని విషయాలు తెలిపినాడు. ఆ తరువాత మాస్టరుగారు మదరాసులో నాకు ఇన్‌సియేషన్ ఇచ్చినట్లు కల వచ్చింది. ఆ మరునాడు యస్ నారాయణయ్యర్ నాకు ఇన్‌సియేషన్ ఇచ్చెను. ఆ రోజు నుండి 55 సంవత్సరాలుగా ఈ ప్రార్థన విడువక చేస్తున్నాను."

శ్రీ టి.ఎస్. శంకరయ్యరుగారు కోర్సులు, రెగ్యులేషన్సు చేయరాదన్నారు. మాస్టరుగారి పేరైన సి.వి.వి. అని ప్రార్థన చేయాలన్నారు. ఆంధ్ర దేశంలో శ్రీ ఎమ్.ఎన్. గారు చనిపోయిన తరువాత వెట్టితలలు వేసింది యోగం అన్నారు. పుస్తకాలు

ప్రకటించవద్దు అన్నారు. ప్రకటించిన పుస్తకాలు యోగం దరిదాపులకు చేరడానికి కూడా తగినవి కావు అన్నారు. ప్రకటించిన పుస్తకాలు వ్యాపారుల జేబులు నింపడానికన్నారు. మొత్తానికి తేలింది ఏమంటే-

(ఎ) ఈయన పుస్తకాన్ని శంకరయ్యరుగారు మెచ్చుకోలేదు. స్వీటు ఇవ్వలేదు.

(బి) ఈయనకు కోర్సులు వగైరాలు చూపలేదు.

(సి) ఈయన్ను మెచ్చుకున్నారని 143 వ పుటలో వ్రాసినదంతా అసత్య విషయాలు ఏదో సొంత డబ్బా వాయించుకొన్నాడు ఈయన.

(డి) యు. డిడ్. ఎ. వండర్‌ఫుల్ జాబ్ అని మెచ్చుకోలేదు.

(ఇ) యోగాపై పర్ఫెక్షన్ ఉన్నవాడివి అనలేదు.

(ఎఫ్) యోగజర్నల్ ప్రకటించవద్దని టి.ఎస్.ఎస్. చెప్పినా ప్రకటించారని తేలింది. అది ఈయన గురువు శ్రీ గాలి బాల సుందరరామ గారిచే ప్రకటింపబడింది.

సత్యయోగము చేస్తున్నప్పుడు సత్య దూరాలైన విషయాలు వ్రాయకూడదు. అంతా సత్య సమ్మతాలై వుండాలి. అప్పడే లోకం మెచ్చుకొంటుంది. ఇది చూచిన తరువాతైనా ఆయనలో మార్పు వస్తుందేమో చూద్దాం.

1910 లో ఎమ్.టి.ఎ.-

"నీవు ఎవరి వద్దకూ వెళ్లి ఈ యోగంలో చేరమని చెప్పవద్దు. ఎవరైనా చేరాలని వస్తే కొన్ని రోజులు నీ వద్ద ఉండి ప్రాక్టీసు చేయనీ - సక్రమంగా ప్రాక్టీసు చేస్తాడా మధ్యలో వదలి వెళ్లుతాడా గమనించు"- అని చెప్పింది.

ఇంకొకచోట-

"ఒక మీడియము రెకమెండు చేస్తే ఆ తరువాత చేర్చుకో"

అని చెప్పింది ఎమ్.టి.ఎ.

"మాస్టర్ అనే పదం ఒక మాస్టరు సి.వి.వి. తప్ప ఇంకెవరూ తగిలించుకోరాదు" అని డైరీలో చెప్పినారు. క్రమశిక్షణా రాహిత్యం అనే వ్యాసంలోను చెప్పినారు. మాస్టరుగారి సాహిత్యంలోని విషయాలు ఎన్ని చూపినా శ్రీ మైనంపాటి నరసింహంగారి గ్రూపు వాళ్లూ, శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలపతి గ్రూపు వాళ్లూ ఇంకా మాస్టరనే పదాన్ని ఎమ్.ఎన్. గారికి ఎన్.ఆర్.బి.వి. గారికి తగిలిస్తూనే వన్ పాయింటుకు ఎమ్.టి.ఎ. కి మాస్టరుగారికి ద్రోహం చేస్తూనే ఉన్నారు.

ఇంకా 180 ప్రశ్నలు ఉన్నాయి. వాటికీ సమాధానాలు వ్రాసి తరలో భృక్తరహిత తారకరాజయోగం రెండవ భాగంగా పుస్తకరూపంలో ప్రకటించాలనే సంకల్పం మాకుంది. మాస్టరుగారి దయ ఎట్లా ఉందో !

యోగమిత్రులు సహాయ సహకారాలతో ఈ భృక్తరహిత తారకరజాయోగము అనే గ్రంథాలు తమిళ, కన్నడ, ఆంగ్ల భాషలలో త్వరలో వెలువడగలవు అని యోగమిత్రులకు విన్నవిస్తున్నాను.

శ్రీధాత పుష్యతై అమావాస్య శుక్రవారము ధనిష్ఠా నక్షత్రము సాయంత్రము 6.00 గంటలకు 7-2-1997

ఎప్పడు వీళ్ల బుద్ధి మారుతుందో తెలియదు. వీళ్ల బుద్ధులను మార్చి సరియైన మార్గంలో నడిచేటట్లు చేయమని భృక్తరహిత తారకరాజయోగ మాస్టర్లను ప్రార్థిస్తున్నాను.

భృక్తరహిత తారకరాజ యోగమార్గ మాస్టర్ల ఆజ్ఞాపాలకుడు.

20-1-97

ఎ.వి. శ్రీనివాసాచార్యులు (సీ.సా)
మాస్టర్ సి.వి.వి. యోగ సెంటర్ బ్రాంచ్,
12, రాములవారి ఉత్తరమాడ వీథి,
తిరుపతి - 517 507., ఫోను: 28814

మాస్టరుగారు క్రింది ప్రశ్నలు వేసినట్లు తెలుస్తూంది-

1. యింకా శానా రెగులేషన్ యీ బాడీకి యివ్వవలయునా?
2. దానివల్ల అనేక బాధలుగా యుండునా?
3. అది తెలిస్తే బీతిగ యిచ్చునని తెలుపలేదా?
4. బాడి డికేవల్ల బీతి కలగుతుందా?
5. సరైన బదులు యివ్వక మీడియమును పెట్టే కారణము యేమి?
6. వాయిదా తోస్తు వచ్చే కారణం యేమి?
7. బాడికి సపరింగుకు రెమడి లేకపోతే యేమి చేసేది?
8. దీనికి ఆన్సర్ కావలయును.

సి.వి.వి. మాస్టర్

ఇది ఒక కాగితములో వ్రాసియున్నారు. దానికి సరియైన నఖలు ఇది.

సీ.సా.

# కృతజ్ఞతలు

ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా కంప్యూటరులో తయారు చేసి త్వరలో మాకు ప్రతి తయారు చేసి ఇచ్చిన శ్రీ శ్రీనివాస గ్రాఫిక్స్, తిరుపతి, ప్రొప్రైటరు శ్రీ కె. శ్రీనివాసులు నాయుడు గారికీ-

ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా అచ్చువేసి ఇచ్చిన "మాస్టర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్" ప్రొప్రైటరూ-యోగమిత్రులూ అయిన శ్రీ బాదర్ల దేవదాసు విజయవాడ గారికీ- ప్రెస్సులోని పనివారికీ-

ఈ రచనకు క్రిందివారి గ్రంథాలు, ఉత్తరాలు ఉపయోగించు కొన్నాను. శ్రీ డాక్టర్. వేటూరి - ఆనందమూర్తి, హైదరాబాదు; శ్రీ కవులూరి సీతారామయ్యగారి కుమారులు, విజయవాడ; శ్రీ గురుతుల్యులు ఎన్. నారాయణయ్యర్‌గారి కుమారులు; మదరాసు; శ్రీ కె.ఎస్. శాస్త్రి, మదరాసు; శ్రీ వి. రాధాకృష్ణ, వరంగల్లు; శ్రీమాన్ సేనాపతి-తిరుపతాచార్యులు, మొగుళ్లపల్లి గార్లకూ-

ఈ గ్రంథము ఆమూలాగ్రమూ ప్రూఫు దిద్ది ఇచ్చిన శ్రీమాన్ కె.కె. ఆచార్యగారికీ-

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించిన యోగమిత్రులకూ-

ఈ గ్రంథ రచనలోనేకాదు ఎల్లప్పడూ నాకు సంపూర్ణ సహాయసహకారాలను అందిచ్చే యోగమిత్రులు ఆర్. మునికుమార్; వి.ఆర్.ఎల్.ఎన్. సింగ్; కె.ఎస్. రవీంద్రన్; పి. ఎరికలయ్య గారలు తిరుపతి. ఎం. వేణుగోపాల్, బెంగళూరులకూ-

నేనీ యోగంలో అకుంఠిత దీక్ష వహించడానికి కారకురాలైన నా శ్రీమతి. చి॥సౌ॥ సరోజ; నా మనుమరాండ్లు చి॥సౌ॥ ఎస్. యోగప్రభ; చి॥సౌ॥ శ్రీలక్ష్మిపాండుచ్చేరి, చి॥సౌ॥ వి. సుగుణా ప్రసాదు నా దత్తపుత్రికకూ- మంగళగిరులకూ-

క్రియేషన్ థీరీ తెలుపుతూ మాస్టరుగారు నా భార్య గర్భం ద్వారా జన్మింపజేసిన నా పుత్రిక చి॥సౌ॥ ఎస్. శేషమ్మ అనే శాంతకూ-

ఇంకా సహకరించిన యోగమిత్రులకూ-

వీరి కుటుంబ సభ్యులకూ-

శ్రీ మాస్టర్ సి.వి.వి. గారూ గురుదేవులు శ్రీ వేటూరి. ప్రభాకర శాస్త్రిగారూ ఆయురారోగ్య ఐశ్వర్య యోగ ఉద్యోగాభివృద్ధులను కలిగించాలని ప్రార్థిస్తూ వీరి పాదాలు పట్టుక నమస్కరిస్తున్నాను.

సీ.సా

మాస్టరుగారి మీడియము, గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి శిష్యుడననే అభిమానంతో నన్నెంతగానూ ఆదరించి నాకు వలసిన మాస్టరుగారి సాహిత్యాన్ని అందిచ్చిన మాస్టరుగారి మీడియము గురుతుల్యులు శ్రీ వి. రుద్రపతి పిళ్లె, కార్తెక్కాల్; పూజ్యులు, చిరకాల యోగమిత్రులు కీ॥శే॥ శ్రీ కవులూరి సీతారామయ్య; కీ॥శే॥ శ్రీ గూడూరు. నమశ్శివాయ గార్లకూ-

మాస్టరుగారు సశరీరంగా డిసెండ్ అయి తిరిగి వచ్చేటప్పడు వీరిని తమ వెంట కొనిరావలెనని శ్రీవారిని పాదాలు పట్టుక ప్రార్థిస్తున్నాను.

సీ.సా

## ప్రశ్నలు- అడిగినవారు

## ఈ రచనకు ఉపకరించిన గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఎమ్.టి.ఎ. గారి రచనలు | ఆంగ్లము-తమిళము |
| 2. | మాస్టర్ సి.వి.వి.గారి నోట్సులు | ఆంగ్లము-తమిళము |
| 3. | మాస్టర్ సి.వి.వి.గారి డైరీలు | ఆంగ్లము-తమిళము |
| 4. | మాస్టర్ సి.వి.వి.గారి వివరణలు | ఆంగ్లము-తమిళము |
| 5. | మాస్టర్ సి.వి.వి.గారి ఉపన్యాసాలు | ఆంగ్లము-తమిళము |
| 6. | మాస్టర్ సి.వి.వి.గారి ఉత్తరాలు | ఆంగ్లము-తమిళము |
| 7. | ఆర్.ఎస్.జి. గారి నోట్సులు | ఆంగ్లము-తమిళము |
| 8. | టి.ఎస్. శంకరయ్యరుగారి ఉత్తరాలు | ఆంగ్లము-తమిళము |
| 9. | విఖనస మహర్షి కల్పసూత్రమ్ | సంస్కృతము |
| 10. | మరీచి మహర్షి విమానార్చన కల్పమ్ | సంస్కృతము |
| 11. | పతంజలి మహర్షి యోగసూత్రాలు | సంస్కృతము |
| 12. | పూర్వగాథాలహరి | తెలుగు |
| 13. | రామలింగస్వామి రచనలు | తమిళము |
| 14. | థీసాఫికల్ సొసైటివారి గ్రంథాలు | ఆంగ్లము |
| 15. | సర్.సి.పి. బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు | ఆంగ్లము |
| 16. | శంకరనారాయణన్ ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు | ఆంగ్లము |
| 17. | పోతరాజు నరసింహంగారి ఉత్తరాలు | తెలుగు |
| 18. | వేటూరి. ప్రభాకర శాస్త్రిగారి ఉత్తరాలు | తెలుగు |
| 19. | ఆరుగురు మీడియములు సంభాషణ | తెలుగు-తమిళము-ఇంగ్లీషు |

వీరికందరికి భక్తిపూర్వకముగా నమస్కరిస్తూ కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

సీ.సా.

# గురుస్తుతి

శ్రీ నిరంతరానంద నిశ్రేయసార్థ
సాధకము, సర్వకిల్బిష బాధకము, స
మగ్ర విజ్ఞానదము; మహామహిమ ఘనము
శరణ మగు మాకు సద్గురు చరణయుగము.

సీ.వీ.వీ. కరుణాకటాక్షములు రక్షించున్ సదా తన్మయం
బై వర్ధిల్లెడు భక్తియున్నయెడ; నిత్యానంద మారోగ్య; మా
హా పుట్టించెడు ప్రజ్ఞ; ఈ త్రయము లభ్యంబౌను తార్కాణ నే
నే వేయేటికి? మీరలిందరును దీనిం జక్క గుర్తింపరో!

*గురుదేవులు శ్రీ వేటూరి. ప్రభాకర శాస్త్రిగారు*

## మాస్టర్ సి.వి.వి. నమస్కారము

# భృక్తరహిత తారకరాజయోగము

### సాధకుల ప్రశ్నలు
### సమాధానాలు
### శ్రీ సి.వి.వి. గారి సాహిత్యం ఆధారంగా

మాస్టరు సి.వి.వి. గారు జీవించి ఉండగా సంవత్సరానికి రెండు జనరల్‌కాల్సు జరిపేవారు. ఒకటి మే తుది వారంలో, ఇంకొకటి డిసెంబరు తుది వారంలో, ఆ కాల్సుకు ఆనాడు వారివద్ద చేరిన మీడియముల నందరినీ రమ్మని చెప్పేవారు. వారి ఫిజికల్ డిసపియరన్సు తరువాత కూడా ఆ రోజులలో పై కాల్సు జరుగు తున్నాయి.

తిరుపతిలో 31-12-1994 వ తేదీన 1-1-1995 వ తేదీన శ్రీ ప్రభాకర మిత్రమండలి, శ్రీ మాస్టర్ సి.వి.వి. యోగ సెంటర్ బ్రాంచ్‌లో జరిగిన యోగ సమావేశాలలో దేశం నలుమూలల నుండి యోగమిత్రులు వచ్చి పాల్గొన్నారు. ఆ సమయంలో వారు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పినవారు ఎ.వి. శ్రీనివాసాచార్యులు (సీ.సా.) రికార్డు చేసిన వారు చి॥సౌ॥ వి. సుగుణా ప్రసాద్; శ్రీ కె.సి.హెచ్. వెంకట రాజు మంగళగిరి; శ్రీ ఆర్. మునికుమార్; శ్రీ పి. కృష్ణమూర్తి; శ్రీ ఎమ్. నందగోపాల్ గార్లు

తిరుపతి, రికార్డు చేసినదానినే ఇప్పడు ప్రకటిస్తున్నాము.

ప్రశ్న అడిగినవారి పేరు, ఊరు ప్రశ్నకు తరువాత చెప్పి సమాధానం చెప్పతున్నాను.

ఇంకా దేశం నలుమూలలనుండి వచ్చిన యోగమిత్రులంతా రాత్రి రెండు గంటల ముప్పై నిమిషాల వరకు శ్రద్ధా భక్తులతో విన్నారు.

**1వ ప్రశ్న:- మాస్టర్ సి.వి.వి. గారి పుట్టు పూర్వోత్తరాలను గురించి ఏదైనా కొంత చెప్పండి?**

అడిగినవారు- చి॥సౌ॥ వి. సుగుణా ప్రసాద్; ఎమ్.ఎ., బి.ఎల్.ఎస్.సి., మంగళగిరి.

సమాధానము:- “28-11-1912 వ తేది రాత్రి 7 గంటల 15 నిమిషాలకు 1 పాయింటు ఎమ్.టి.ఎ. ద్వారా మాస్టరు గారికి క్రింది విధంగా తెలియజేసి అందరికి తెలుపుము” అనింది. (చూ. శ్రీ మాస్టర్ సి.వి.వి. గారు రచించిన డైరి శ్రీ ప్రభాకర మిత్రమండలి తిరుపతివారు ప్రకటించినది. పుట 21).

“ఈ యోగములో మాస్టర్ సి.వి.వి. ని అత్యంత భక్తి శ్రద్ధలతో గౌరవించాలి. ఆయన మీకు ఈ యోగమును ఉద్బోధించడానికి జన్మించిన ఫిజికల్ మాస్టరుగానే గౌరవించాలి- అంతేగాని ఈయన ఎలా జన్మించాడు? ఈయన తల్లి ఎవరు? తండ్రి ఎవరు? ఎందుకు ఈయన జన్మించారు? అనే విషయాలు చర్చించరాదు. ఇంకా ఏ విధమైన భావాలను ఆయనకు అంటగట్టరాదు” అని.

మాస్టరుగారి పుట్టుపూర్వోత్తరాలు చర్చించరాదు అని ఎమ్.టి.ఎ. గారు అన్నారు. కాబట్టి వివరంగా మనం చర్చించరాదు.

మాస్టరు సి.వి.వి. గారు 4-8-1868 వ తేది మంగళవారము

ఉదయము 10 గంటల 20 నిమిషాలకు ధనిష్ఠా నక్షత్రం రెండవ పాదంలో కన్యాలగ్నమున కుంభకోణమున జన్మించినారు అని మాత్రం మీకు తెలియజేస్తున్నాను. ఇంతకుమించి చర్చించరాదు.

**2 వ ప్రశ్న:- ఈ యోగము 1910 వ సంవత్సరంలో ఆరంభించినారు అని అందరూ అంటారు మరి మీరేమంటారు?**

అడిగినవారు:- శ్రీ ఎమ్. వేణుగోపాల్ ఎమ్.ఎ., బి.ఇడి., సెంట్రల్ స్కూలు, బెంగుళూరు.

సమాధానము:- సామాన్యంగా అందరికీ తెలిసింది 1910 వ సంవత్సరం మే నెల 29 వ తేదీన భృక్తరహిత తారకరాజయోగము లేదా న్యూ యోగము లేదా సత్యయోగము లేదా ప్రాక్టికల్ యోగము లేదా సైంటిఫిక్ యోగం అనేది ఆరంభింపబడింది అని.

మేము మాస్టరుగారి డైరీలు ప్రకటించేనాటికి లూయీస్‌కూనే అనే జర్మనీ దేశస్థుడు రచించిన గ్రంథాలను 1897లో మాస్టరుగారు చూచి ఈ చావును తప్పించాలని ప్రయత్నాలు చేసినట్లు తెలుస్తూంది అన్నాము.

**2 ఎ ప్రశ్న:- ఆ గ్రంథాలు ఉన్నాయాండి?**

అడిగినవారు:- వేణుగోపాల్‌గారే

సమాధానము:- మాస్టరుగారు చదివిన లూయీస్‌కూనేవీ ఉన్నాయి. ఫిజియాలజీ పుస్తకమూ, ఇతర పుస్తకాలూ ఉన్నాయి. ఇవన్నీ శ్రీ హెచ్.ఆర్. వేణుగోపాల రావుగారు మాస్టరుగారి అల్లుడు నాకు ఇచ్చినారు. రేపు చూద్దురు కానీండి.

తరువాత థీసాఫికల్ సొసైటీలో మెంబరుగా చేరినారు. వీరికున్న జ్ఞానాన్ని పురస్కరించుకొని వీరిని ఇన్నర్ సర్కిల్

మెంబరుగా చేసినారట. కొద్దిరోజుల తరువాత వారి సిద్ధాంతము మాస్టరుగారికి నచ్చక ఆథిసాఫికల్ సొసైటీని వదలి వచ్చినారు.

1900 వ సంవత్సరము నుండి కాబోలు ఈ క్రింది వారితో తన సంకల్పానికి తగినట్లు ఈ భృక్తరహిత తారకరాజయోగాన్ని ప్రారంభించినారని తెలుస్తోంది.

1. మాస్టరు సి.వి.వి. గారు
2. మొదటి భార్య రుక్మిణమ్మ కుమారుడు వెంకట్రావు గారు
3. మిత్రుడైన శ్రీ ఎస్. సుందరం గారు
4. తాతగారైన శ్రీ రంగారావు గారు
5. తండ్రిగారైన శ్రీ వెంకట్రావు గారు
6. మొదటి భార్యగారైన శ్రీమతి రుక్మిణమ్మ గారు.

వీరి ఆరుగురితో మొదట ప్రార్థన ప్రారంభించినారు. (ఎస్.ఎస్. సంపుటం 1 టి. పుట 3.)

మహాత్మా ఒక సందర్భంలో -

"నీకున్న పూర్వానుభవమూ-శాస్త్ర పరిజ్ఞానమూ నాకు తెలుసు. నీలో కుదుర్కొన్న శ్రద్ధ నా అభిప్రాయాలను, సూత్రాలను చక్కగా అర్థం చేసుకొనే స్థితిలో ఉంది" అన్నారు. (చూ. ఎస్.ఎస్. సంపుటం 1 టి. పుట 4.)

ఇంకా మహాత్మా ఏమన్నారో వినండి-

నీ కష్టాలన్నీ పోయి నీవు అదృష్టవంతుడవు అవుతావు. మూడు సంవత్సరాల నుండి మార్పు వస్తుంది అని కూడా అన్నారు. (చూ. ఎస్.ఎస్. సంపు. 1. పుట 6.)

ఇంకా మహాత్మా ఏమన్నారో వినండి-

"ఎటర్నటి సంపాదించాలనే సంకల్పం 14 కల్పాల నుండి

ఉంది. (అంటే 12096 పన్నెండువేల తొంభైయారువేల కోట్ల సంవత్సరాలు) దీన్ని అమలు జరుపడానికై నేను నీ వద్దకు వచ్చినాను' ' అన్నారు. (చూ. ఎస్.ఎస్. సంపు. 1 పేజి 5)

తండ్రి వెంకట్రావుగారు, తల్లి 11-10-1910 వ సంవత్సరం వరకు బ్రతికే ఉన్నారు. (చూ. ఎస్.ఎస్. సంపు. 2 పుట 19)

"10-2-1904 వ తేదీ నుండి ఈ యోగాలైను సూక్ష్మాణువులలో పనిచేసే వరకు అభివృద్ధిని పొంది ప్రపంచంలో పని చేస్తూంది" అని ఎమ్.టి.ఎ. ద్వారా మహాత్మా మాస్టరుగారికి చెప్పినారని వ్రాసియున్నారు. (చూ. నోట్సు 4 వ సంపుటం తేది 10-2-1922).

ఇంత శక్తి సంపాదించినారు కాబట్టే మొదటి భార్యయైన రుక్మిణమ్మగారిని చావునుండి తప్పించాలని తీవ్రంగా ప్రయత్నించినట్లూ, ప్రాణము రావడమూ, పోవడమూ జరిగినట్లూ సూచనగా తెలుస్తూంది.

శ్రీ యస్. సుందరంగారు మీడియం నెంబరు 2 గాను, శ్రీమతి వెంకమ్మగారు మీడియం నెంబరు 3 గాను 8-5-1910 వ తేదీననే ఇన్‌సియేషన్ ఇచ్చియున్నారు. మరి 29-5-1910 వ తేదీన యోగం అరంభించియుంటే 8-5-1910 వ తేదీననే ఇనిసియేషన్ ఎట్లా ఇచ్చి ఉంటారు. దీన్నిబట్టి 29-5-1910 వ తేదీకి ముందే యోగం ఆరంభించినారు అని తెలుస్తూంది.

అందుచేత 29-5-1910 న ఈ యోగము ఆరంభింప బడింది అనడము సరికాదు.

**3వ ప్రశ్న:- మాస్టరుగారు యోగం ఆరంభించిన ఉద్దేశం ఎక్కడైనా పేర్కొన్నారా?**

అడిగినవారు:- శ్రీ ఆర్. మునికుమార్, ఎమ్.కామ్., పర్సనల్

ఈ మార్గాన్ని అనుసరించడానికి సన్యాసికా నవసరము లేదు. సంసారయాత్ర సాగిస్తూనే ఈ యోగాన్ని సులభంగా అభ్యసించి శాశ్వతత్వాన్ని అంటే ఎటర్నటీని రక్తమాంసాదులతో కూడిన ఈ మానవ శరీరానికి సంపాదించి పెట్టవచ్చు".

**4వ ప్రశ్నః- మన ప్రాచీను లెవరూ మానవ శరీరం శాశ్వతంగా నిలుస్తుంది అని చెప్పలేదా?**

అడిగినవారుః- శ్రీ పి. కృష్ణమూర్తి ఎమ్.ఎ., గారు, హెడ్‌క్లర్కు స్టేట్ బ్యాంక్, యస్.వి.యు., తిరుపతి.

సమాధానముః- నాకు తెలిసినంతవరకు ప్రాచీనులెవరు చెప్పినారో తర్వాత చెప్తాను. మాస్టరుగారు 20-8-1917 వ తేదీన వినిపించిన పిల్లర్ టెస్టులో క్రింది విధంగా వినిపించినారు.

(ఈ పిల్లర్ టెస్టుకూడా మొదట తమిళ భాషలో స్వీకరించి రచించినారు. ఆ తరువాత మాస్టరుగారు నివసించిన మేడమీద ఆనాటి మీడియములనందరిని సమావేశపరచి గురుతుల్యులు శ్రీ ఎస్. నారాయణయ్యర్‌గారు మీడియము నెం.46 తమిళమును చదువగా మాస్టరుగారు ఆంగ్ల భాషలోనికి అనువదించిరి).

"ప్రాచీన మార్గాలు అన్నీ పునర్జన్మకు దారితీసేవి. ఈ రక్తమాంసాదులతో కూడిన మానవ శరీరము నశించిపోయేదేకాని ఇది శాశ్వతంగా నిలవదు. సూక్ష్మ శరీరానికే అంటే ఆస్ట్రల్, ఈథరిక్ శరీరాలకే శాశ్వతత్వము అని ప్రాచీనులు నొక్కి చెప్పినారు".

**4 ఎ. ప్రశ్నః- దానికి ఏమి చేయాలన్నారండీ?**

అడిగినవారుః- కృష్ణమూర్తిగారు

సమాధానముః- యోగాభ్యాసము అవసరము అన్నారు.

**4 బి. ప్రశ్నః- ఏ యోగం చేయాలన్నారు?**

అడిగినవారుః- కృష్ణమూర్తిగారు

సమాధానముః- పతంజలి మహర్షి అష్టాంగ యోగసూత్రాలను రచించినారు. దానినే అష్టాంగ యోగము అని అంటాము. అందులో ఉన్నతమైన స్థితి సమాధిస్థితి. సమాధిస్థితిని చేరుకొన్నప్పడు మానవుడు స్థూలప్రజ్ఞను కోల్పోతాడు. స్థూలప్రజ్ఞను కోల్పోయిన సందర్భంలో ఏదో గొప్ప అనుభూతిని పొందినాను అని అనుకొంటాడు. కానీ ఈ స్థూల శరీరానికి ప్రజ్ఞతో తిరిగి వచ్చినప్పడు ఆ సమాధి స్థితిలో ఏమి జరిగింది చెప్పలేక పోతున్నాడు. అందువలన జీవితములో అతడు యోగసాధనవల్ల సాధించింది ఏమీలేదు. ఇది ప్రాచీన పద్ధతి.

అయితే నేను నా ఈ యోగమార్గం ద్వారా ఈ స్థూల శరీరానికి ప్రజ్ఞను కోల్పోకుండా చేసి కుండలినీ శక్తి ద్వారా ఏ ఏ శరీరానికి ఎంతెంత అభివృద్ధి అవసరమో అంతంత దిన దినాభివృద్ధిని కల్గిస్తూ కడపటికి ఆత్మజ్ఞానవంతుడై ఎటర్నటీని అంటే శాశ్వతత్వాన్ని ఈ రక్తమాంస్మాదులతో కూడిన మానవ శరీరానికే ఇస్తాను.

**5 వ ప్రశ్నః- చనిపోయినవారు బ్రతుకుతారు అనే ప్రస్తావన మాస్టరుగారి డైరీలలోగాని, నోట్సులలోగాని ఇంకా ఎక్కడైనా ఉందా?**

అడిగినవారుః- శ్రీ పి. సత్యనారాయణగారు స్పెషల్ ఆర్మ్డు పోలీసు, హవల్దారు, మంగళగిరి.

సమాధానముః- మాస్టరుగారికి ఎమ్.టి.ఎ. ద్వారా ఆరు (కాంట్రాక్ట్సు) ఒప్పందాలు ఇవ్వబడ్డాయి. అందులో-

మొదటిది- అనంతమైన ప్రాణశక్తిని ఇవ్వడము.

9

రెండవది - ఈ స్థూల ప్రజ్ఞతో జీవించి ఉండగానే అనంతమైన ప్రాణశక్తిని ఇవ్వడము.

మూడవది- రక్తమాంసాదులతో కూడిన ఈ శరీరము నశించిపోకుండ ఉండడము. అంటే చావు లేకుండా ఉండడము.

నాల్గవది- రక్తమాంసాదులతో కూడిన ఈ శరీరము మార్పు చెందకుండా ఉండడము.

అయిదవది- చనిపోయినవారిని సశరీరంగా తిరిగి పిలిపించడము. అంటే రక్తమాంసాదులతో కూడిన శరీరముతో.

ఆరవది- భూత, వర్తమాన, భవిష్యత్కాలములలో జరిగే అన్ని విషయాలను గుర్తెరగడము. అంటే మాయను పారద్రోలడము. (చూ ఆంగ్ల డైరి పుట 417).

మహాత్మా ఎన్నో సందర్భాలలో చనిపోయినవారు తిరిగివస్తారు అనీ, చావును తప్పించవచ్చును అనీ తెలియజేసినారు. ఆయా సందర్భాలలో సెలవిచ్చినవి కొన్ని చెప్తాను-

ఒకటి- చనిపోయిన వ్యక్తి తిరిగి భూమిని చేరుకొనేటప్పుడు చనిపోయేటప్పుడు ఏ స్థితిలో ప్రాణమును వదలినాడో ఆ స్థితిలోనే నిద్రనుండి మేల్కొన్నట్లు తిరిగి లేచి వస్తాడు. (చూ మాస్టరుగారి నోట్సు శ్రీ ప్రభాకర మిత్రమండలివారు ఆంగ్లంలో ప్రకటించినది. పుట 29, తేది 23-10-1920).

రెండవది- మార్సు రెగ్యులేషన్ అంటే అంగారక రెగ్యులేషన్ ఏడవవారం జరిపే సందర్భంలో "చనిపోయిన వారిని బ్రతికించే సూచనలు ఉన్నాయి". (చూ శ్రీ ప్రభాకర మిత్రమండలివారు ప్రకటించిన డైరి పుట. 377 తేది 19-9-1919).

మూడవది - ఫుల్‌మూన్ కోర్సు చేసేటప్పుడు

"చనిపోయినవారిని బ్రతికించవచ్చు". (చూ. శ్రీ ప్రభాకర మిత్రమండలివారు ప్రకటించిన పుట 366 తేది 19-7-1919).

నాల్గవది- శని గ్రహమునుండి శుక్ర గ్రహమునకు ఈ రాత్రి కనెక్షన్ అంటే సంధానము ఇవ్వబడుతుంది. ఈ సందర్భములో శని భూమిని బోర్ చేయడము జరుగుతుంది. అన్ని గ్రహాలు శని ఆజ్ఞను పాటిస్తాయి. అది ఏదంటే "చావు లేకుండా చేయడము, మానవ శరీరములో మార్పు లేకుండా చేయడము జరుగుతుంది' '. (నోట్సు 2 వ సంపుటము పుట 45 తేది 3-12-1920) దీనికి అంటే శని సమయములో అని చెప్పడానికి కారణము శని ఆయుఃకారకుడు అని మాస్టరుగారి డైరీలలో, నోట్సులలో పేర్కొనడమే అని నేను అనుకొంటున్నాను.

అయిదవది - ఎమ్.టి.ఎ. గారికి మీడియములు మాస్టరుగారి ద్వారా వ్రాసి ఇచ్చిన హామీ పత్రాలలో (డిక్లరేషన్ ఫారాలలో) రెండవ నిబంధనగా క్రింది విషయము గలదు. "ఈ ఫ్రెండ్సు సొసైటీలో ఇచ్చిన ప్రాక్టీసు తప్ప ఇంకొక ప్రేయరును నేను ఎట్టి పరిస్థితులలోను చేయను. ఎందుకంటే ఈ సొసైటీలో ఇచ్చినటువంటి ప్రేయరు ఒక్కటే రక్తమాంసాదులతో కూడిన ఈ స్థూల శరీరానికి శాశ్వతత్వాన్ని అంటే ఎటర్నటీని ఇస్తాను అనే హామీ ఇచ్చింది. ఆ ఆశతోనే నేను ఈ సొసైటీలో చేరుతున్నాను".

ఏడవది- చనిపోయిన వారిని క్రింది సందర్భాలలో రక్తమాంసాదులతో సశరీరంగా పిలిపించ వచ్చును అన్నారు అవి ఏ సందర్భాలలోనంటే-

(ఎ) చావడానికి సిద్ధంగా ఉన్న మనిషిని చావునుండి తప్పించ వచ్చును. అంటే బ్రతికించ వచ్చును.

(బి) మనిషికి ప్రాణం పోయింది కానీ శవం మాత్రం ఉంది. ఆ ప్రాణములేని శవానికి ప్రాణం పోసి, బ్రతికించి మనిషినిగా చేయవచ్చును.

(సి) మనిషి చనిపోయినాడు శవాన్ని కాల్చివేసినారు. ఆ కాలిపోయిన శవము యొక్క బూడిదగాని, ఎముకలుగాని ఉన్నా, లేకపోయినా ఆ జీవుడిని రక్తమాంసాదులతో కూడిన మనిషినిగా భూమిమీద నిలబెట్టవచ్చును.

(డి) మనిషి చనిపోయి రెండు నెలలు అయింది. ఆ జీవి స్టెబిలిటి మనిషిలో చేరింది. అంటే తండ్రిలో కాని దగ్గరి బంధువులలోకాని ఆ జీవి పునర్జన్మ తీసుకోవడానికి స్థలము దొరకలేదు. ఆ జీవి క్రిందికి పైకి ఏడు పర్యాయాలు ఎక్కుతూ, దిగుతూ, తిరుగుతూ ఉంటుంది. అటువంటి జీవిని సశరీరంగా భూమి మీదికి రప్పించి బ్రతికించి నిలుపవచ్చును. (చూ. మాస్టరు ఇచ్చిన వివరణను శ్రీ గురుతుల్యులు ఆర్.యస్.జి. గారిది పుట 64 తేది 9-4-1921).

ఎనిమిదవది- మాస్టరుగారు స్వయముగా తనకు వచ్చిన శక్తిని పరీక్షించినారు అని ఆర్.ఎస్.జి. నోట్సులో ఉన్నది-

(ఎ) చనిపోయిన చందు ప్రాణమును తిరిగి తెప్పించి 20 ఇరవైరోజులు బ్రతికించినారు.

(బి) చనిపోయిన దత్తు తల్లి శవం కుళ్ళిపోకుండా కొన్నిరోజులు నిలిపి ఆ శరీరానికి ప్రాణం ఇప్పించి నడిపించినారు. (ఆర్.ఎస్.జి. నోట్సు పుట 49 తేది 29-12-1920).

తొమ్మిదవది- ఈ యోగాన్ని రూల్సు, రెగ్యులేషన్సు ప్రకారము చేసి అభివృద్ధి పొందిన వారికి అన్నము, నీరు, నిద్ర వగైరాలు ఏవీ

అవసరము లేదు అన్నారు. (చూ. నోట్సు సంపుటము 2 పుట 27).

పదవది- మహాత్మా ఎమ్.టి.ఎ. ద్వారా తెలియజేసిన పై విషయాలను దృష్టిలో పెట్టుకొనీ, తన స్వానుభవాన్నీ దృష్టిలో పెట్టుకొనీ మాస్టరుగారు గురుతుల్యులు శ్రీ పోతరాజు నరసింహం గారికి (మీడియము నెంబరు 123) 16-9-1919 వ తేదీన వ్రాసిన ఉత్తరంలో ఈ విధంగా వ్రాసినారు. "చచ్చిపోయిన మనిషిని లేచి రమ్ము అంటే లేచి రావడము మన యోగంలో చాలా చిన్న విషయము".

**5 ఎ. ప్రశ్నః- మనిషి బ్రతుకుతాడు అని చెప్పినారు బాగుంది. ఏమిచేస్తే బ్రతుకుతాడు? ఎట్లా చేయాలి చెప్పలేదు? దయచేసి చెప్పండి సార్.**

అడిగినవారుః- పి. సత్యనారాయణగారు

సమాధానముః- ఎమ్.టి.ఎ. 19-6-1911 వ తేదీన ఇట్లా అన్నారు. వినండి.

"ఒక అణువే మానవ రూపంలో శరీరం తీసుకొనడానికి కారణమైంది. మొదట ఏ అణువైతే శరీరం తీసుకొనిందో ఆ అణువులో మార్పు తీసుకొని వస్తే చనిపోవడానికి సిద్ధంగా కొస ఊపిరిలో పున్న మనిషిని బ్రతికించ వచ్చును. అటువంటి శక్తిని నీకు చాలా సంతోషంగా ఈ రోజు ఇస్తున్నాను. ఈ శక్తితో పేషంట్లను ట్రీట్‌చేసి బ్రతికించు. ఇటువంటి శక్తి 1 పాయింట్ నీకు ఇంతకుముందే ఇచ్చిన సంగతికూడా నాకు తెలుసు". (చూ ఎస్.ఎస్. సంపుటం 4. పుటలు 84-85 తేది 19-6-1911).

**6 వ ప్రశ్నః- మాస్టరుగారి డైరెక్టు మీడియములైన శ్రీ ఎస్. నారాయణయ్యర్ ఎమ్. నెం. 46; శ్రీ జస్టిస్ పి. చెంచయ్య ఎమ్. నెం.728; శ్రీ పి. నరసింహం**

అవసరము లేదు అన్నారు. (చూ. నోట్సు సంపుటము 2 పుట 27).

పదవది- మహాత్మా ఎమ్.టి.ఎ. ద్వారా తెలియజేసిన పై విషయాలను దృష్టిలో పెట్టుకొనీ, తన స్వానుభవాన్నీ దృష్టిలో పెట్టుకొనీ మాస్టరుగారు గురుతుల్యులు శ్రీ పోతరాజు నరసింహం గారికి (మీడియము నెంబరు 123) 16-9-1919 వ తేదీన వ్రాసిన ఉత్తరంలో ఈ విధంగా వ్రాసినారు. "చచ్చిపోయిన మనిషిని లేచి రమ్ము అంటే లేచి రావడము మన యోగంలో చాలా చిన్న విషయము".

**5 ఎ. ప్రశ్న:- మనిషి బ్రతుకుతాడు అని చెప్పినారు బాగుంది. ఏమిచేస్తే బ్రతుకుతాడు? ఎట్లా చేయాలి చెప్పలేదు? దయచేసి చెప్పండి సార్.**

అడిగినవారు:- పి. సత్యనారాయణగారు

సమాధానము:- ఎమ్.టి.ఎ. 19-6-1911 వ తేదీన ఇట్లా అన్నారు. వినండి.

"ఒక అణువే మానవ రూపంలో శరీరం తీసుకొనడానికి కారణమైంది. మొదట ఏ అణువైతే శరీరం తీసుకొనిందో ఆ అణువులో మార్పు తీసుకొని వస్తే చనిపోవడానికి సిద్ధంగా కొన ఊపిరిలో వున్న మనిషిని బ్రతికించ వచ్చును. అటువంటి శక్తిని నీకు చాలా సంతోషంగా ఈ రోజు ఇస్తున్నాను. ఈ శక్తితో పేషంట్లను ట్రీట్‌చేసి బ్రతికించు. ఇటువంటి శక్తి 1 పాయింట్ నీకు ఇంతకుముందే ఇచ్చిన సంగతికూడా నాకు తెలుసు". (చూ ఎస్.ఎస్. సంపుటం 4. పుటలు 84-85 తేది 19-6-1911).

**6 వ ప్రశ్న:- మాస్టరుగారి డైరెక్టు మీడియములైన శ్రీ ఎస్. నారాయణయ్యర్ ఎమ్. నెం. 46; శ్రీ జస్టిస్ పి. చెంచయ్య ఎమ్. నెం.728; శ్రీ పి. నరసింహం**

**ఎమ్. నెం.123; శ్రీ ఎమ్. నరసింహ ఎమ్. నెం.666; శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలపతి ఎమ్. నెం.650 గార్లు ఇంకా చాలామంది ఎటర్నటి రక్తమాంసాదులతో కూడిన ఈ స్థూల శరీరానికి కాదు. ఈథరిక్, ఆస్ట్రల్ శరీరాలకే అన్నారు కదా మీరేమంటారు?**

అడిగినవారు:- శ్రీ వి.ఆర్.ఎల్.ఎన్. సింగుగారు, అసిస్టెంట్ రిజిస్ట్రార్, యస్.వి. యూనివర్సిటి, తిరుపతి.

సమాధానము:- గురుతుల్యులు శ్రీ ఎస్. నారాయణయ్యర్ గారు రచించిన న్యూ యోగ అనే ఆంగ్ల గ్రంథమంతా తప్పుల తడక. ఆయన శంకరమతానుయాయి. (అద్వైతమతమునకు చెందినవారు) ఆయన తన అద్వైత సిద్ధాంతమును వదలుకోలేక దానినీ మాస్టరుగారి సిద్ధాంతాలనూ కలిపి, ఆయన బుద్ధిను చెడగొట్టుకొని అందరి బుద్ధిలనూ చెడగొట్టినారు. తమిళంలోని బ్రహ్మజ్ఞాన గీతము అనే పాటలను అనుసరించి ఈ గ్రంథమును రచించినట్లు తెలుస్తూంది. ఇది మాస్టరుగారి సిద్ధాంతాలకు, నిర్ణయాలకు విరుద్ధమైన అభిప్రాయాలు కల గ్రంథము. (చూ. న్యూ యోగ).

(ఎ) నారాయణయ్యర్‌గారు మీడియం నెం.46 మాస్టరు గారికి అంతరంగికుడు. అందుకే ఈయనకు స్పెషల్ లిఫ్టు ఇచ్చినారు. (చూ డైరి పుట 86)

(బి) అదే నారాయణయ్యర్‌ను సస్పెండ్ చేసినారు. "ఎందుకంటే అయ్యర్ ఆలోచనలు వేరే విధంగా ఉండడంవలన, ఈ సొసైటి రూల్సుకు వ్యతిరేకంగా నడవడంవలన అభివృద్ధికి అడ్డు తగులుతూ ఉంది ఇతని ఆలోచనలు. అందువల్ల ఇతనికి వార్నింగ్ ఇచ్చినాను. అయినా బాగుపడలేదు. అందుకని సస్పెండ్

చేసినాను" అన్నారు. (చూ. డైరి పుట 69).

(సి) మాస్టరుగారికి తెలియకుండ, ఆయన అనుమతి లేకుండ కోర్సులు ఇతరులకు ఇచ్చి తగిన శిక్షను అనుభవించినారు అయ్యరుగారు.

(డి) ఈయన తన భార్యను ఆస్ట్రల్ సైట్‌కు పురికొల్పి చీవాట్లు తిన్నారు. (చూ. డైరి. పుట. 272).

(ఇ) ఇంకా కొంతమంది మద్రాసులోని మీడియములు మాస్టరుగారి రూల్సుకు విరుద్ధంగా ప్రవర్తించడముచేత రీ అడ్మిషన్ అనే సందర్భంలో- "ఎట్టి పరిస్థితులలోను మద్రాసు మీడియములను తిరిగి చేర్చుకోవద్దు" వారికి సలహాలు ఇచ్చినాను- వార్నింగ్ ఇచ్చినాను- ఇకపై తప్పగా నడవము అని ప్రమాణము చేసినారు, అయినా తిరిగి తప్పగా నడుస్తున్నారు; వారు క్షమాపణ చెప్పినా వారి యెడల ఉదారభావాన్ని చూపవద్దు" అని మాస్టరుగారికి తెలుపగా వారు డైరీలో వ్రాసినారు. (చూ. డైరి పుట 322).

గురుతుల్యులు శ్రీ పి. చెంచయ్యగారు మీడియం నెం.728 గార్డియన్ అనే ఆంగ్ల పత్రికలో మాస్టరుగారిని గూర్చి ఒక వ్యాసాన్ని వ్రాసి ప్రకటించినారు. అందులో ఆయనకూడా మాస్టరుగారి యోగాన్ని గూర్చి సరిగా ప్రామాణికంగా వ్రాయలేదు.

: ఈయన క్రైస్తవ మతానికి చెందినవారు కాబట్టి బైబిల్‌తో సరిపోలుస్తూ వ్రాసినారు. అరవిందునితో పోలుస్తూ వ్రాసినారు. తనకు తోచినట్లు వ్రాసినారు.

గురుతుల్యులు శ్రీ పోతరాజు నరసింహంగారు మీడియం నెం.123. ఈయన ఫిలాసఫి లెక్చరర్‌గా మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఆనాడు పనిచేసేవారు. తాను చదువుకొన్న ఫిలాసఫీని ఆధారం

చేసుకొని ఏవేవో వ్రాసినారు ఆ రచనలన్నీ మాస్టరుగారి యోగసూత్రాలకు లక్ష్యాలకు అనుగుణమైనవి కావు. ఈయనకు తోచిన విధంగా వ్రాసినారు.

గురుతుల్యులు శ్రీ మైనంపాటి నరసింహంగారు మీడియము నెం.666. ఈయనగారు కూడా తమ ఉపన్యాసాలలో మాస్టరుగారి రూల్సుకు, రెగ్యులేషన్సుకు, యోగానికి, యోగ సూత్రాలకు విరుద్ధంగా భాగవతం వగైరాలను గూర్చి ఉపన్యసించి నారు. ఈయనకు తోచినవి ఈయన ఉపన్యసించినారు.

గురుతుల్యులు శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలపతిగారు మీడియము నెం.650. ఈయన కాకాభుజండర్ అనే ఆయన రచించిన భుజండర్‌నాడీ గ్రంథాన్ని ఆధారం చేసుకొని అందులోని విషయాలనే చిత్రవిచిత్రాలుగా పదాల విరుపులు విరుస్తూ వల్లించినారేగాని మాస్టరుగారి రూల్సు, రెగ్యులేషన్సు, యోగ విషయాలను గూర్చి సరిగా ఉపన్యసించలేదు. ఏ విషయం చెప్పినా నాడీ గ్రంథంలో ఇలా చెప్పి ఉంది అని అనేవారు.

అందుచేత గురుతుల్యులైన పైవారి వ్రాతలన్నీ మాస్టరుగారి రూల్సును, రెగ్యులేషన్సును, ఆ యోగాన్ని, యోగ సూత్రాలను అనుసరించి రచించలేదు అని సవినయంగా సత్యాన్ని తెలియజేస్తున్నాను. సత్యం ఎప్పడూ కటువుగానే ఉంటుంది. క్షమించండి. ప్రశాంతమైన హృదయంతో మొత్తం గ్రంథాన్ని చదివితే మీకే సత్యం తెలుస్తుంది. ఏది సరియైన మార్గమో తెలుస్తుంది.

తమిళ భాషలో ఉండిన పిల్లర్ టెస్టును 20-8-1917న మాస్టరుగారి ఇంటి మేడమీద నారాయణయ్యరుగారే చదివినారు. మాస్టరుగారు దానిని ఆంగ్లంలోకి తర్జుమా చేసినారు. ఆనాటి

మీడియములూ విన్నారు. అందరికీ దాని నకలు పంపినారు. అందులో-

"ఈ రక్తమాంసాదులతో కూడిన మానవ శరీరము ఎందుకూ పనికిరానిది, ఆత్మజ్ఞానము అభివృద్ధి పరచుకోవడానికి ఆటంకము కలిగించేది, ఇది నశించి పోయేదానికి సిద్ధంగా ఉండేది అని ప్రాచీనులు చెప్తున్నారు. అయితే ఈ మానవ శరీరము అత్యవసరమైనది, దీనికి తగిన శిక్షణ ఇచ్చి తీర్చి దిద్ది చావు లేకుండా చేయడమే నా ఉద్దేశ్యము" అన్నారు.

అప్పుడే గురుతుల్యులు శ్రీ కె.యస్. కోదండరామయ్యర్ మీడియం నెం.76 మాస్టరుగారికి వ్రాసిన ఉత్తరాన్ని చదివి వినిపించినారు. ఆ ఉత్తరంలో-

"ప్రాచీన శాస్త్రాలూ, వేదాలూ మానవుని ఆయుఃపరిమాణము నూరు సంవత్సరాలు అని చెప్పతున్నాయి కదా; మరి మీరు మానవ శరీరాన్ని శాశ్వతంగా నిలపాలని అంటున్నారు కదా? అది సాధ్యమేనా?" అన్న ప్రశ్న వేసినట్టున్నది.

దానికి గాను మాస్టరుగారు ఏమన్నారో వినండి-

"ఇటువంటి సందేహాలు మీ బుర్రలలో మీకు ఎందుకు కలిగినాయి? ఇదిగో చూడండి. మీకు ఒక ఉదాహరణ ఇస్తాను.

దశరథమహారాజు అరవైవేల సంవత్సరాలు జీవించినాడు కదా! ఆయన ఏ యోగాన్ని చేసి అన్నివేల సంవత్సరాలు జీవించినాడు? ఆనాడు ఆయనతో జీవించిన సామాన్య మానవుని ఆయుః పరిమాణము ఎంత?" అన్నారు.

వీటినన్నింటిని విన్న-చదివిన మాస్టరుగారి మీడియములే పిచ్చి పిచ్చిగా వ్రాసినారు అంటే ఏమనుకోవాలి. మాస్టరుగారి

యోగాన్ని గురించి సరిగా అవగాహన చేసుకోకుండా మనము మీడియములు కదా మనము ఏమి చెప్పినా చెలామణి అవుతుందని వారికి తోచిన విధంగా వ్రాసినారు అని అనుకోవలసి వస్తుంది కదూ!

**7 వ ప్రశ్న:- ఎటర్నటీ యోగసాధన చేసేవారందరికీ వస్తుంది అంటారు కదా ఏదైనా నియమాలను పాటించి ప్రార్థన చేసేవారికి మాత్రము వస్తుందా? లేక అందరికీ వస్తుందా? ప్రార్థన ఎట్లా చేయాలి? వివరంగా చెప్పండి సార్.**

అడిగినవారు:- శ్రీ ఎస్. ప్రభాకర్‌గారు, ప్రొప్రైటర్, ఓంకార్ స్టోర్సు, చిత్తూరు.

సమాధానము :- దీనికి చెప్పాలంటే చాలగానే చెప్పాలి. అదంతా తర్వాత చర్చించుకుందాము. ముందు ఎమ్.టి.ఎ. చెప్పింది కొంత చెప్తాను వినండి-

"భ్రమలు, ఊహలు అన్నీ వదలి పెట్టినవారికీ ముందుగానే ఒక నిర్ణయానికి రానివారికీ, అత్యంత భక్తి కలవారికీ, అత్యంత శ్రద్ధాసక్తులు కలవారికీ, పరిశుద్ధమైన మనస్సు కలవారికీ మాత్రమే ఎటర్నటీ లభిస్తుంది. అంతేకాదు క్రమం తప్పకుండా ఉదయము సాయంత్రము నియతమైన సమయాలలో 45 నిమిషాలు ప్రార్థన చేస్తూ అంతరాత్మలో జరిగే పరిణామాలనూ అభివృద్ధినీ గమనిస్తూ దినదినాభివృద్ధిని పొందేవారికి మాత్రమే ఈ యోగ ఫలము లభిస్తుంది".

**7 ఎ. ప్రశ్న:- ప్రార్థన ఎన్ని గంటలకు చేయాలండీ? మాస్టరుగారు ఏమైనా చెప్పినారా?**

అడిగినవారు:- శ్రీ ఎస్. ప్రభాకర్‌గారు

సమాధానము :- యోగం ఆరంభించింది మొదలు

18-4-1921 వ సంవత్సరం వరకు అంటే సుమారు 11 సంవత్సరాల కాలము మాస్టరుగారు రచించిన నోట్సులు, డైరీలు వగైరాలు చూస్తే క్రింది విషయాలు తెలుస్తున్నాయి.

మొదట ఈ ప్రార్థన ఉదయం 8.30 గంటలకు చేయాలని ఎమ్.టి.ఎ. చెప్పినారు. (చూ ఎస్.ఎస్. సంపు 3 పుట 62 తేది 15-12-1910).

ఆ తరువాత క్రమక్రమంగా ఉదయం 7 గంటలకు సాయంత్రం 7 గంటలకు మారింది. (చూ డైరీ, నోట్సులు).

మరల ఉదయం 6-30 గంటలకు సాయంత్రం 6-30 గంటలకు మారింది. (చూ. డైరి. నోట్సులు)

కోర్సులు రెగ్యులేషన్సు వగైరాలు చేసేటప్పుడు కూడా ఈ నియమాన్నే పాటించినట్లు రికార్డు తెలుపుతూంది.

మొత్తంమీద వివిధ సమయాలలో ప్రార్థన చేసినట్లున్నది.

ఒలిడియర్ 3 వ నేమ్ ప్రాక్టీసు చేయడానికి 10-4-1921 వ తేదీనుండి ఉదయము 6 గంటలకు సాయంత్రం 6 గంటలకు ప్రారంభించినారు. అంతకు పూర్వం
ఈ నియమము లేదు.

1-6-1921 వ తేదీన "ఒలిడియర్ రెగ్యులేషన్ ధనుర్లగ్నంలో పనిచేస్తూందనీ. 14-7-1921 న ఒలిడియర్ బాగాపని చేసి మెమో చేరిందనీ" వ్రాసియున్నారు.

18-4-1921 వ తేదీనుండి మాస్టరుగారు కుంభకోణంలో ఉండకుండా శ్రీరంగం, తంజావూరు, మదరాసు, భాగవతపురం, పాపనాశం వగైరా ప్రదేశాలకు తన స్వంత పనిమీద వెళ్లినట్లు తెలుస్తూంది.

5-1-1922 వ తేదీన "ఒలిడియర్ 3 వ నేమ్ కుంభకోణం టౌన్ మీడియములు మాత్రం మరు ఉత్తరువు వరకు చేయ వలసింది" అని వ్రాసి యున్నారు.

మాస్టరుగారి ఉద్దేశ్యంలో టౌన్ అంటే కుంభకోణము అనే కాని మిగతా మనం నేడు పట్టణాలు అనేవి కావు.

కుంభకోణం టౌన్‌లో లేని మీడియములు కూడా ఒలిడియర్ 3 వ నేమ్ ఎట్లా చేసినారో, చేయించినారో తెలియడము లేదు. ఇది మాస్టరుగారి సిద్ధాంతాలకు విరుద్ధమైనదే కదా! మాస్టరుగారి డైరీలు, నోట్సులు చూడండి మీకే తెలుస్తుంది సత్యం.

మాస్టరంటే ఏమిటో మాస్టరుగారి యోగమంటే ఏమిటో మాస్టరుగారు యోగం ఎందుకు ఆరంభించినారో ఈ ప్రాధమిక పరిజ్ఞానమే లేనివాళ్లు ఇంతకు ముందూ చేసినారు-చేయించి నారు- వారి శిష్యప్రశిష్యులంతా గ్రుడ్డియెద్దు చేనబడ్డట్టు గ్రుడ్డిగా చేస్తున్నారు-చేయిస్తున్నారు-మహాపాతకాన్ని ఒడిగట్టుకొంటున్నారు. అట్టివాళ్లు మహాపాతకాన్ని వాళ్లు ఒడిగట్టుకోవడమే కాకుండా ఇప్పటి వాళ్లకూ ఒడిగట్టుతున్నారు.

వీళ్లేదో కోర్సులు, రెగ్యులేషన్సు వగైరాలు చేయడంచేత గొప్పవారమైనామనీ, మాస్టర్లమైనామనీ గొప్పలు చెప్పకొంటూ ఎగురుతూ క్రిందపడి కాళ్లు విరగ్గొట్టు కొంటున్నారు. ఈ రెండు గ్రూపులకూ చేరీ చేరనట్టున్న వాళ్లూ కొందరున్నారు. అందులో ఒకరు శ్రీ శార్వరిగారు హైదరాబాదు; శ్రీ బి. కొండాచార్య బళ్లారిగార్లు. ఇందులో శ్రీ శార్వరిగారు మాస్టరుగారికి ఆరిజన్ ఇచ్చిన రూల్సు, రెగ్యులేషన్సుకు విరుద్ధంగా ఈ యోగాన్ని ధనార్జనకై

ఉపయోగిస్తున్నారు.

**7 బి. ప్రశ్న:- మరి ప్రార్థన ఏమని ఇప్పటి వాళ్లు చేయాలండీ?**

అడిగినవారు:- శ్రీ డి. దామోపదరం, ఎలక్ట్రికల్ వర్క్సు, చిత్తూరు.

సమాధానము:- 8-5-1910 వ తేదీన గురుతుల్యులు శ్రీ ఎస్. సుందర శర్మగారికీ మీడియం నెం.2; శ్రీమతి వెంకమ్మగారికీ మీడియం నెం.3 ప్రార్థన ఇచ్చింది మాస్టరు సి.వి.వి. అనే బీజాక్షరాలతోనే. 22-4-1922 వ తేది వరకు యోగంలో చేరిన మీడియములకు అందరికీ ఒకరిద్దరికి తప్ప మిగిలిన వారికి పై బీజాక్షరాలతోనే ఉపదేశము ఇచ్చినారు.

**7 సి. ప్రశ్న:- 29-5-1910 వ యోగం ఆరంభం అయితే 8-5-1910 ననే ఉపదేశం ఇచ్చినారు అని మీరు అంటారే ఇది విరుద్ధం కాదా?**

అడిగినవారు:- డి. దామోదరంగారే

సమాధానము:- ఎవరో 29-5-1910 వ తేదీన యోగం ఆరంభము అయింది అన్నారు. నేను 1900 ల సంవత్సరము నుండి కానీ లేదా 1904 వ సంవత్సరము నుండి కానీ యోగం ఆరంభం అయింది అని ముందే చెప్పినాను. రామాయణమంతా విని రామునికి సీత ఏమి కావాలి? అని అడిగినట్లుంది మీ ప్రశ్న. ఇంకా విచిత్రం చెప్తాను వినండి.

కోర్సులు, రెగ్యులేషన్లు వగైరాలు చేసినప్పడు మాస్టరుగారికి మీడియములకు కలిగిన శరీర బాధలు వగైరాలు పోవడానికి "మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్ ఈ బాధలు తొలగించ"మని వన్ పాయింట్ ఎమ్.టి.ఎ. ద్వారా మాస్టరుకు తెలియజేస్తే వాళ్లంతా అట్లాగే చేసినట్లూ వాళ్ల బాధలు తొలగిపోయినట్లూ డైరీలలో

వ్రాసినారు. ఇంకా ఉంది తర్వాత చర్చిద్దాం.

20-8-1917 న పిల్లర్ టెస్టులో ఏమన్నారో వినండి-

"ఈ యోగా స్కూల్లో ప్రవేశించినంత మాత్రానగాని-ప్రమాణ పత్రాలలో సంతకాలు చేసినంత మాత్రానగాని చావునుండి తప్పించుకో లేరు. కనీసము పది సంవత్సరాలు క్రమం తప్పకుండా రూల్సు, రెగ్యులేషన్సును పాటిస్తూ అంతరాత్మ పరిశీలన చేసినవారికి మాత్రమే ఎటర్నటీ లభిస్తుంది" అన్నారు. కాబట్టి అందరూ అంతరాత్మ పరిశీలనను పాటించండి. ఎటర్నటీని సంపాదించడానికి ప్రయత్నించండి.

**8 వ ప్రశ్న:- ఇంతకుముందు కొందరు మీడియములు తాము మాస్టర్లము అని చెప్పకొన్నారు. ఇప్పడూ కొందరు తాము మాస్టర్లము అని చెప్పకొంటున్నారు. ఏవేవో వక్రభాష్యాలు మాస్టరుగారి యోగానికి అంటగట్టినారు-అంటగట్టుతున్నారు దానికి మీరు ఏమంటారు?**

అడిగినవారు:- శ్రీ టి.జి. వెంకటేశంగారు, చిత్తూరు.

సమాధానము:- దీనికి నేను చెప్పాలంటే చాలా ఉంది. ఈ మాస్టర్లు అనుకొనేవారెవరికీ మాస్టరుగారి యోగాన్ని గూర్చి మాట్లాడే అర్హత లేదు. వీళ్లంతా స్కూలు మాస్టర్లో, స్టేషన్ మాస్టర్లో అవుతారుగాని యోగానికి మాస్టర్లు కారు-కాలేరు. ఎందుకంటే-

7-1-1915 వ తేదీన ఎమ్.టి.ఎ. ఇలా చెప్పింది-

"మాస్టర్ అనే పేరు పెట్టుకోవడానికి ఈ ప్రపంచంలో ఈ యోగం చేసేవారెవరికీ అర్హత లేదు- ఒక్క మాస్టర్ సి.వి.వి." కి తప్ప అని ఇంకా ఎమ్.టి.ఎ. క్రమశిక్షణా రాహిత్యము అన్న ఉపన్యాసంలో ఏమి చెప్పినారో చూడండి-

ఎమ్.టి.ఎ. అయిన నేను మీకు ఫిజికల్ మాస్టరైన సి.వి.వి.

తప్ప ఇంకెవరైనా "నేను మాస్టర్ని" అని ధైర్యంగా చెప్పగలరా? ఇంకెవరికైనా "మాస్టర్" అనే కోటు తగిలిస్తే ఏమి లాభము? ఎమ్.ఆర్.ఆర్.ఎస్. అనీ ఓం అనీ ప్రత్యేకమైన మంత్రాలద్వారా ప్రాక్టీసు చేసేవాళ్లు మాస్టర్లమని ధైర్యంగా చెప్పగలరా?

**8 ఎ. ప్రశ్న:- మొన్న మాటల సందర్భంలో మహాత్మా ఆనాడే మీడియములను చాలా కటువుగా మందలించినారు అన్నారు. దాన్ని కాస్త చెప్పండి సార్.**

అడిగినవారు:- శ్రీ టి.జి. వెంకటేశంగారు

సమాధానము:- అడిగేవాడికి చెప్పేవాడు లోకువ అన్న సామెత ఉంది. అట్లాగే మీరూ ఎప్పడో చెప్పిన విషయాన్ని రంకుమొగుడు లాగ వెంటబడి ప్రాణం తీస్తునారే. అయినా మీకున్న శ్రద్ధకు జోహారులు. వినిపిస్తాను వినండి-

ఈ యోగం ఆరంభించిన రోజులలో దురభిప్రాయాలకు లోనై మాస్టరుగారిని గూర్చి, వారి యోగాన్ని గూర్చి పిచ్చి పిచ్చిగా మాట్లాడిన మీడియములను ఉద్దేశించి 24-8-1911 వ సంవత్సరంలో వన్ పాయింట్ చాలా కటువుగా మందలించినట్లూ దానిని ఎమ్.టి.ఎ. మాస్టరుకు చెప్పినట్లూ - మాస్టరు మీడియములకు తెలియజేసినట్లూ రికార్డు అయి ఉంది. ఇదిగో వినండి-

"వ్యక్తిగత సాధనల విషయంలోను, సలహాలు ఇవ్వడంలోను నేను స్వయంగా ఇప్పటివరకూ జోక్యం చేసుకోలేదు. అందుచేత కొందరు మీడియములు తప్పదోవ పట్టించే మార్గాలను అనుసరిస్తూ ఈ యోగ సొసైటి సూత్రాలకు వక్రభాష్యాలు చెప్పతున్నారు. ఈ వక్రభాష్యాలవల్ల కొత్తగా చేరే యువసాధకుల మనస్సులు మారిపోవడం జరిగింది. అటువంటి తప్పడు

అభిప్రాయాలను మీ మనస్సుల నుండి తొలగించడానికీ- అత్యుత్తమమైన నియమాలను పాటించి మీడియములు యోగాభివృద్ధిని పొందడానికీ - శ్రమ తీసుకొని స్వయంగా మీడియములకు ఈ సలహాలను ఇవ్వడానికీ నేను ఇక్కడికి వచ్చినాను. నా సిద్ధాంతాలను మీరు అర్థం చేసుకొంటున్నారు. కానీ ఇతరులకు చెప్పడంలోనూ - ఆచరించడంలోనూ మీ ప్రవర్తన సరిగాలేదు అని చెప్పడానికి చింతిస్తున్నాను.

మీరు భ్రాంతిలోపడి ఈ సొసైటీలో గారడీవాడు ఏదో తమాషా చేస్తున్నాడు అని మీ మనస్సులను మీకు మీరే పక్కదారి పట్టించుకొంటున్నారు. ఇంతకుముందు మీలాంటి వారెవరూ ఈ సొసైటీలో చేరలేదు. మీరు ఉన్నతమైన అభిప్రాయాలనూ చూపడం లేదు- అభివృద్ధి చెందడానికి శ్రద్ధా చూపడం లేదు.

మాస్టరు వివిధ రకాలైన కోర్సుల నిచ్చీ- సలహాల నిచ్చీ- అసాధారణమైన ఉన్నతమైన జీవితాన్ని గడపడానికి సహాయ పడతాడేగాని పాఠశాలలో ఉపాధ్యాయుడు బెత్తంతో కొట్టి పాఠం చెప్పినట్లు కొట్టి చెప్పడు.

తెలుసుకోవలసినవీ- అర్థం చేసుకోవలసినవీ- చర్చించ వలసినవీ ఎన్నో విషయాలుండగా ఏ ఒక్క మీడియమైనా దానికై ప్రయత్నం చేసినారేమో నోరు విప్పి చెప్పండి- నేను వింటాను.

అయ్యో పాపం! ఓ మీడియములారా మీ మనసులను పక్కదారి పట్టించుకోకండి. మీ మనస్సులను చెడగొట్టుకొని చెత్తబుట్టలో భద్రంగా పడి ఉండే కాగితంలాగా మీ జీవితాలను వ్యర్థం చేసుకోకండి.

మీరందరూ ఉన్నతమైన స్థితిని చేరుకొని నేను చెప్పే

విషయాలను అర్థం చేసుకొనే స్థితిలో లేదని ఇంత ఎముందే చెప్పినాను.

కొంతమంది మీడియములు మాత్రమే మాస్టర్ చెప్పిన సూత్రాలను తు.చ. తప్పకుండా పాటిస్తూ అభివృద్ధిని పొందినారు. ఆయనమాట విన్నవారు చెడలేదు అని నేను స్పష్టముగా చెప్పతున్నాను.

మీకు ఒక ఉదాహరణ ఇస్తాను. మాస్టర్ కొడుకూ ఒక మీడియమే. అతను మాస్టరు అనుమతి లేకుండా- మాస్టరుకు తెలియకుండా తనతో సాధన చేసే ఇంకొక మీడియానికి సాధనను, గురించి సలహాలు ఇస్తున్నాడు.

ఓయ్ సీతారామన్! నా యోగానికి సంబంధించిన శాస్త్ర పరిజ్ఞానం నీకు లేదు. అందుచేత తమిళంలో ఉండే భూగోళ, ఖగోళ, అనాటమి, ఫిజియాలజి, బయోకెమిస్ట్రి వగైరా పుస్తకాలను నీవు చదువు. వాటిని నీవు చదువుకొంటేనే శాస్త్రరీతిగా నేను ఇచ్చిన వివరణలు (ఎక్స్‌ప్లనేషన్సు) కొద్దిగా అయినా నీకు అర్థం అవుతాయి. ఇప్పటి నీ ప్రవర్తన నేను సహించలేను.

నా అనుమతి పొందని మీడియములు కొందరు నా మాటలు రిసీవ్ చేసుకొన్నాము అనే మాటలు నమ్మి, మీరంతా తప్పదారి పట్టవద్దండి.

ఓయీ రామచంద్రయ్యర్! నీవు నేనిచ్చిన ప్రాక్టీసును చులకన చేసి మాట్లాడుతున్నావు. నా యోగ పరిణామ శక్తిని పూర్తిగా తెలిసినవాని మాదిరి మాట్లాడుతున్నావు. నీ ప్రవర్తన చూస్తే నా శక్తి ఒక వేగబాండ్ శక్తిలాంటిది అని నీవు అనుకొంటున్నట్లున్నావు. ఇటువంటి తప్పదారి పట్టించే అభిప్రాయాలు నీకు ఉండడము

చేతనే నీవు అభివృద్ధి పొందలేకపోతున్నావు. నీ యోగ్యత ఇంతే. నా అభిప్రాయాలకు భిన్నంగా ప్రవర్తిస్తున్నావు. కాబట్టి నీవు తీవ్రమైన పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుంది.

సుందరేశయ్యరును చూడండి ఆయనను ఎంతగానో గౌరవిస్తాను. ఆయన ఎంత చక్కగా ప్రాక్టీసు చేస్తున్నాడో చూడండి. ఇది అతిశయోక్తి కాదు. ఆయన చక్కగా ప్రాక్టీసు చేస్తున్నాడు కాబట్టి ఆయనమీద అసూయ గాని, ఆయనను కించపరచడము గాని ఈ సొసైటీలో చేయరాదు.

నేను చెప్పిన మాటలూ- మాస్టరు చెప్పిన మాటలూ ఎవరైతే విని ప్రాక్టీసు చేస్తారో వాళ్లు మాత్రమే ఈ ఫ్రెండ్సు సొసైటీలో ఉండండి. మేము చెప్పిన మాటలు వినడానికి మీకు ఇష్టం లేకపోతే ఈ ప్రాక్టీసును- ఈ యోగా స్కూలును వదలి వెళ్లండి. మీతో నాకు పనిలేదు.

అయితే నా కోరిక ఏమంటే మీరందరూ అభివృద్ధి పొంది ఉన్నత లక్ష్యాలను సాధించాలని మాత్రమే అమూల్యమైన మా సమయాన్ని వృధాపరచి మా ఇరువురిని ఇబ్బంది పెడితే ప్రయోజనమేమి? మీ మనసులు కల్మషమైనవి గనక మీకు ఎలాంటి దివ్యశక్తులు ఇవ్వలేదు.

ఏ మీడియమైతే పరిపూర్ణమైన విశ్వాసంతో నా అభిప్రాయాలను మాస్టర్ అభిప్రాయాలను అనుసరించి సాధన చేస్తాడో అటువంటి మీడియము మాత్రమే ఈ ప్రమాణ పత్రంలో సంతకము చేయవలసింది.

ఈ ప్రమాణ పత్రంలో సంతకం చేసికూడా మునుపటిలాగా బాధ్యతా రహితంగా- మా అభిప్రాయాలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే అటువంటివారి పేర్లు ఈ సొసైటి మెంబర్ల పేర్ల పట్టిక నుండి తొలగించబడును. అంతేకాక ఈ సొసైటి నుండి బహిష్కరింప

బడుతారు. అటువంటివారికి తిరిగి ఎట్టి పరిస్థితులలోను ఈ సొసైటీలో ప్రవేశము లభించదు.

శిష్యుడు విషయాన్ని సరిగా అర్థం చేసుకొని సందేహాలను తీర్చుకోవడానికి మాస్టరును ప్రశ్నించడానికి సిద్ధమైతే అప్పుడు మాస్టరుకూడా శిష్యుని సందేహాలను తీర్చి అతని అభివృద్ధికి స్వయంగా తోడ్పడుతాడు. మీరందరూ చిన్నపిల్లల్లాగ తగవులాడుకొంటే ఏమీ ప్రయోజనము లేదు. ముమ్మాటికీ ప్రయోజనము లేదు.

మీ అందరికీ నేనిచ్చే చివరి సలహా ఏమంటే మీకు అతి ప్రధానమైన "మైండ్ కోర్సు" అనే ప్రాక్టీసు ఇవ్వబోతున్నాను. ఈ ప్రాక్టీసు ఆరంభించడానికి ముందు మీరు ఒక నిర్ణయానికి వచ్చి మీ కడపటి అభిప్రాయాన్ని తెలియజేయండి.

మీ గుండెలను చీల్చి ఆ రక్తంతో మీ కాళ్లు కడుక్కొని నిర్మలమైన హృదయంతో ప్రార్థన చేస్తే "బిల్డింగ్ ప్రాసస్" తెలుస్తుంది. అంటే యోగ వికాస మార్గము అభివృద్ధి చెందుతుంది.

ఈ విషయాలను ఇక్కడలేని మీడియములు ఇక్కడికి వచ్చినప్పడు వారికీ తెలియజేయండి. ఒక్కొక్క మీడియాన్ని తప్పపట్టడానికి నేను క్రిందికి దిగి రాలేదు.

ఇక్కడలేని మీడియములు ఇక్కడికి వచ్చి పై విషయాలను తెలుసుకొన్నప్పడు వారు వారి మనసులు మార్చుకొని సక్రమంగా ప్రవర్తిస్తారు అని అనుకుంటాను. సక్రమంగా ప్రవర్తించకుంటే వారు కూడా ఈ ప్రాక్టీసు ఫలితాన్ని పోగొట్టుకొంటారు. అంటే ఈ సొసైటి నుండి బహిష్కరింప బడతారు. వారి గతికూడా అంతే.

మాస్టర్ అడ్వైస్ ఆల్

సి.వి.వి.

ఫార్ మాస్టర్ ఎమ్.టి.ఎ.

ప్రత్యేకంగా ఈ ఇద్దరి మీడియములను అంటే రాజారావును, రామ చంద్రయ్యరును పేర్కొనడంలో ఉద్దేశ్యము వారు తప్పదారిలో పోవడంచేతనే. వాళ్లు చక్కబడడానికీ, యోగాభివృద్ధి పొందడానికీ వాళ్ల పేర్లు ఇక్కడ పేర్కొనబడ్డాయి. వాళ్లు తప్పగా అర్థం చేసుకోకూడదు. ఎందుకంటే వాళ్లలో పేరుకొనిపోయిన పూర్వజన్మకర్మ వాళ్లను ఈ విధంగా తప్పదారి పట్టించింది. అందుచేత వాళ్ల పేర్లు మాత్రమే పేర్కొనడమైనది. ఇక్కడలేని కొంతమంది టౌన్ మీడియముల భావాలను వాళ్లు ఇక్కడికి వచ్చినప్పుడు చెప్పతాను.

సి.వి.వి.

ఫార్ మాస్టర్-

సంతకము

ఎమ్.టి.ఎ.

చూ. ఎన్.ఎస్. సంపు 4 పుట 87 నుండి 91

**9 వ ప్రశ్న:- మాస్టరుగారి పేరే గొప్పది అని మహాత్మా చెప్పినప్పుడు ఎన్ఆర్.బి. వెంకటాచలపతి మీడియం నెంబరు 650 మైనంపాటి నరసింహం మీడియం నెంబరు 666 గార్లు ఒబిడియర్ 3 వ నేమ్ అందరికి ప్రాక్టీసుగా ఇవ్వడం ఎంతవరకు న్యాయము?**

అడిగినవారు:- శ్రీ ఎమ్. శ్రీనివాసమూర్తి ఎమ్.ఎ., గారు, జూనియర్ లెక్చరర్, గవర్నమెంట్ కాలేజి, అద్దంకి.

సమాధానము:- దీన్ని గురించి తరువాత చర్చిద్దాం ముందు మహాత్మా చెప్పిన విషయాలు కొన్ని చెబుతాను వినండి-

20-8-1917 నాటి పిల్లర్ టెస్టులో-

అందరినీ ఒకటిగా డెవలప్ చేయాలంటే సాధ్యం కాలేదు.

ఎట్లాగంటే యాభైమందికి జ్వరం వస్తే ఒకే మందు ఇస్తే అందరికీ జ్వరం నయంకాదు. వారి వారి శరీరతత్వాన్నిబట్టి మందు మార్చి ఇచ్చినప్పడే జ్వరం తగ్గుతుంది" అన్నారు.

ఇంకొకచోట-

"ఏడు సంవత్సరాలు అనేక రకాలైన కోర్సులూ అందరి మీడియములకూ ఇచ్చి అందరినీ ఏకకాలంలో డెవలప్ చేయాలని ప్రయత్నించినాను. కానీ అందరూ ఏకకాలంలో డెవలప్ కాలేక పోయినారు" అన్నారు.

మరొకచోట-

ఈ రోజు కోర్సు మార్చి ఇస్తున్నాను. దీనిని ప్రాక్టీసు చేయడానికి ప్రత్యేకమైన సమయాన్ని నిర్ణయించినాను. ఈ కోర్సు ఫస్టు గ్రూపువాళ్లకు మాత్రమే. సెకండ్ గ్రూపు వాళ్లూ- అంతకు తక్కువ గ్రూపు వాళ్లూ అయిన మీడియములు ఈ రాత్రి ఇచ్చే కోర్సులకు రావలసిన పనిలేదు అన్నారు. (చూ డైరి పుట 2).

ఇంకొకచోట-

కొంతమందిని పనికిరానివాళ్లు అని నిరాకరించినారు. మరికొంతమందిని ప్రొబేషనర్లు అన్నారు. మరికొంతమందిని ఎలిమెంటరీ టైపువాళ్లు అన్నారు. (చూ. డైరి. పుట 79, 85).

ఒక్కొక్క మీడియమునకు ఒక్కొక్క రకమైన కోర్సు ఇచ్చి ఆ మీడియమును డెవలప్ చేసినట్లు డైరీలు చూస్తే తెలుస్తోంది. కానీ అందరికీ అన్ని కోర్సులూ ఇచ్చి వాళ్లను డెవలప్ చేసినట్లు డైరీలలో ఎక్కడా కనిపించదు.

జనరల్ కాల్సు అప్పడుమాత్రం మాస్టర్సు ఓన్ అడ్జస్టుమెంట్సు వంటివి ఏవో కొన్ని మాత్రం అందరిచేత చేయించినట్లు డైరీలు

చూస్తే తెలుస్తుంది. (చూ డైరి పుట 78).

ఒక సందర్భంలో-

"ఈనాటి వరకు బ్రతికిఉన్న మీడియములు కాస్మాన్‌లోనికి వైబ్రేట్ చేసిన కోర్సుల సంఖ్య ఎంత? యోగా స్కూలు వదలి వెళ్లినవారు యోగాస్కూలు వదలి వెళ్లేవరకు వైబ్రేట్ చేసినవి ఎంత? యోగంలో చేరి శరీరం వదలినవారు శరీరం వదిలేవరకు వైబ్రేట్ చేసినవి ఎంత? మొత్తం ఎంత అయినది? ఇంకా ఎంత మిగిలి ఉన్నది లెక్క కట్టి మిగిలిన వానిని నీవే చేయి. నీ పొరపాటువల్ల వీళ్లనంతా మీడియములనుగా చేర్చుకొన్నావు కాబట్టి నీవే చేయి" అని ఉత్తరువు వేసింది మహాత్మా.

మాస్టరుగారు "ఇవన్నీ (మిగిలిన దానితో సహా) పూర్తి చేసినాను" అని డైరీలో వ్రాసినారు.

దీనినిబట్టి ఎవరూ ఏ కోర్సులూ, రెగ్యులేషన్సూ చేయనవసరం లేదు అని తెలుస్తూంది కదా!

ఒకచోట-

"(1) ప్రాక్టీసు కోసరం ఇచ్చిన నేమ్సు పూర్తి చేయడం జరిగింది.
(2) మీడియముల ద్వారా సలహాలు ఇవ్వడము.
(3) డైరెక్టుగా పనిచేయడము అంటే నేరుగా పనిచేయడం.
ఇకమీదట రెండు; మూడు పనిచేస్తాయి" అన్నారు మహాత్మా (11-2-1922).

ఇంకొకచోట-

"అంతరాత్మలో నేను కనిపించి తోపజేసినట్లు తోచినవిగానీ-నేను మాటలద్వారా చెప్పినట్లు విన్నవిగానీ కార్యరూపం దాలిస్తేనే అవి నేను తోపజేసినవి. లేదా డెల్యూడింగ్‌వన్ అంటే మోసగించే

మాయాశక్తి తోపజేసింది అని తెలుసుకోండి" అన్నారు మహాత్మా. (చూ. డైరి. పుట. 151).

మరొకచోట ఇట్లా వ్రాసినారు-

యోగంలో మొదట చేర్చుకొనేటప్పడు టెస్టు తీయగా "కొందరు ఆరికోర్సుకే అర్హులు కారు" అని రావడంచేత వారికి కోర్సు ఇవ్వలేదు. చూ. డైరి. పుట.

అయితే మనకు గురుస్థానీయులైన శ్రీ మైనంపాటి నరసింహంగారూ, శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలపతిగారూ ఈ కోర్సులూ, రెగ్యులేషన్సూ అందరిచేత ఎందుకు చేయించినారో వారికే తెలియాలి. ఇది మాస్టరుగారి రూల్సును వ్యతిరేకించడమే. నరసింహంగారు మాత్రం చాలా ఏండ్లవరకూ కోర్సులు, రెగ్యులేషన్సు చేయించడానికి ఇష్టపడలేదు. శ్రీ బ్రహ్మాండం కుటుంబరావుగారు అనే శిష్యుని నిర్బంధంవలన చేయించినారు. నరసింహంగారు చనిపోయిన తరువాత అది వెర్రితలలు వేసింది. అందుచేతనే ఆనాటి మీడియములు "ఆంధ్ర దేశములో భ్రష్టరూపమైన మాస్టర్ యోగం నెలకొని ఉంది" అని చెప్పడం జరిగింది.

మాస్టరుగారిని ఈ భూమి మీద అవతార పురుషుడుగా శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలపతిగారే అవతరింప జేసినారని నాడీ గ్రంథంలో ఉన్నదానినే ఆయన చెప్పినారు. ఆయన శిష్యులూ చెప్పతున్నారు.

నేనేమంటానంటే ఆంధ్ర దేశంలో భ్రష్టరూపమైన మాస్టరు యోగమైనా ప్రచారంలో ఉంది. అసలు యోగం పుటిన కుంభకోణంలోగాని తమిళనాడులోగాని ఆ భ్రష్టరూపమైన యోగం కూడా లేదు.

శ్రీ ఎన్.ఆర్.బి.వి. గారు జాతి, మత, కుల ద్వేషాలనే విషబీజాలను నాటినారు. అవి పెరిగి మహావృక్షాలైనాయి. మాస్టరుగారు బ్రాహ్మణుడు ఆయన పేరైన సి.వి.వి. అనే అక్షరాలు చెప్పి మనం ఎందుకు ప్రేయరు చేయాలి అనే దురహంకారం ఈయనకు ఏర్పడింది. అంతే ఎన్.ఆర్.బి.వి. అనే అక్షరాలను "నర్భవి' 'గా మార్చి ఇకపై అందరూ నర్భవి అని ప్రేయరు చేయాలి అన్నారు. నర్భవి ఏమీ పని చేయలేదు. అందుచేతనే భ్రష్టరూపమైన యోగమూ అభివృద్ధి చెందలేదు. "నర్భవి" అభివృద్ధి చెందలేదు. వీళ్లు సాధించింది ఏమీ లేదు. సత్యమైన ఈ విషయాలన్నీ అందరికీ తెలియజెప్పితే అందరికీ నామీద కోపం వస్తుంది. వీళ్ల కోపానికి నేను భయపడను. యోగానికీ, మాస్టరుగారికీ న్యాయము చేయడమే నా ధ్యేయము. అందుకే ఇవన్నీ చెప్పతున్నాను.

వీళ్లదో గొప్పవాళ్లు అనిపించుకోవడానికి ఇవన్నీ చేయించి అయినా ఉండాలి లేదా ఆనాడు వీరివద్ద చేరిన సాధకుల సందేహాలను తీర్చలేక ఈ కోర్సులన్నీ వీళ్లమొహాన పడేసి ఇవి చేయండి సి.వి.వి. అని లక్ష పర్యాయాలు జపం చేయండి అని తరువాత చూద్దాము అని తప్పించుకోవడానికైనా ఇచ్చి ఉండాలి.

నిజంగా మాస్టరుగారి డైరీలు, సాహిత్యం వీళ్లుకూడా చూచివుంటే కోర్సులు, రెగ్యులేషన్సు, జపాలు వగైరాలు చేయించి ఉండరు. నిజం చెప్పాలంటే వీళ్లిద్దరూ ఎంత మంచి చేసినా మనుకొన్నా మాస్టరుగారి యోగానికి ద్రోహం చేసినవారే.

**10వ ప్రశ్న:- ఎన్.బి.వి. రామమూర్తి, జె.వి. కుంజు అయ్యర్, కుంభకోణం, శార్వరి, హైదరాబాదు; దామరాజు వెంకట హనుమంతరావు, వరంగల్లు; బి. కొండాచార్య, బళ్లారి; ఎ.యస్.ఆర్. మూర్తి, అనంతపురం గార్లు**

**ఇంకా కొంతమంది ఆదోని, కల్యాణ దుర్గం, హైదరాబాదు వగైరా ప్రదేశాలలో కోర్సులు, రెగ్యులేషన్సు, బ్రీతింగ్ ప్రిన్సిపల్సు వగైరాలు ఏవేవో చేయిస్తున్నారు కదా ఇది ఎంతవరకు సబబు అంటారు?**

అడిగినవారు:- శ్రీ వి.యస్.ఆర్.కె. ప్రసాద్‌గారు, టెల్లర్ యస్.బి.ఐ. మంగళగిరి.

సమాధానము :- ముందు ప్రశ్నలో మహాత్మా చెప్పిన విషయాలు కొన్ని చెప్పినాను. ఇంకా కొన్ని చెప్పిన తరువాత చర్చించుకుందాము.

ఒకచోట మహాత్మా ఇట్లా చెప్పినాడు-

"తప్పగా ఉచ్చరించడముచేతా, తప్పగా అనుసరించడంచేతా పని చేయడము లేదు. సరిగా చేయండి". (చూ. డైరి. పుట.356). ఇట్లాగే చాలాచోట్ల చెప్పబడి ఉన్నది.

ఇంకొకచోట ఇట్లా ఉంది-

"మాస్టరు అనుసరించే నా యోగమూలాన్ని తెలుసుకోవడానికి ఎవరికీ సాధ్యం కాదు. అటువంటప్పడు మీరు నా యోగమూలాన్నీ; నేను చెప్పే నూతన సృష్టి విధానాన్నీ మీడియము శబ్దముల ద్వారా తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఈ యోగం ప్రాచీన మార్గాలకు అన్నింటికన్నా వేరైనది" అని. (చూ. డైరి. పుట.17).

మరొకచోట ఇట్లా అన్నారు-

"మీకు ఈ యోగాన్ని గూర్చి ఏమీ తెలియదు. నేను ప్రయోగించిన పదాల అర్థాలు- స్పష్టమైన భావాలు- అభిప్రాయాలు తెలియకుండా- ఏవో కొన్ని పదాలకు మాత్రం అర్థాలు తెలుసుకొని అరకొర జ్ఞానంతో మీరు పనికిరాని వాదనలు చేయరాదు. నా

యోగానికి నా అభిప్రాయాలు కావాలిగాని మీ అభిప్రాయాలు నాకు అవసరము లేదు" అని. (చూ. డైరి. పుట. 22).

"మనము తప్పదారిలో నడిస్తే మనగతి ఏమి అవుతుందో అన్న భయం కూడా లేకుండా మీరు ప్రవర్తిస్తున్నారు" అని మరొకచోట అన్నారు. (ఎస్.ఎన్. సంపు.3 పుట 65).

ఇంతకుముందు ప్రశ్నలో కొన్నీ, ఈ ప్రశ్నలో కొన్నీ మహాత్మ చెప్పిన విషయాలు చెప్పినాను. వీళ్ల గురువులకూ తెలియదు-వీళ్లకూ తెలియదు. వీళ్లంతా గురువులనీ, మాస్టర్లనీ అనిపించు కోవాలి అని ఏదో ఉబలాట పడేవారే.

మాస్టరుగారి యోగాన్ని గురించిన ప్రాధమిక పరిజ్ఞానమే లేనివాళ్లు వీళ్లు. ప్రాధమిక పరిజ్ఞానము అంటే ఈ యోగం ఎందుకు ఆరంభింపబడింది అని. వీళ్ల రచనలన్నీ పరస్పర విరుద్ధపు అభిప్రాయాలను తెలియజేస్తాయి.

ఒకవేళ మాస్టరుగారు కనిపించి ఈ కోర్సులు మీరు చేయవలసినది అని చెప్పినారు అని వారు చెబితే ఎట్లా నమ్మేది. "నేను కనిపించి మాటలు చెప్పినట్లు వినపడినా, ఏదో కనిపించినా అది సత్యమని నమ్మవద్దు అన్నారుగా మాస్టరుగారు" "అన్నీ పూర్తి చేసినాను అని చెప్పిన మాస్టరు వీళ్లకు ఎందుకు చెప్పతారు-ఇంతకూ మాస్టరుగారు స్వతంత్రులు కాదు గదా! మరి వీళ్లకు ఎట్లా చెప్పినారు. అంతా అబద్ధాలు. తాము చేసిన తప్పిదాలను కప్పిపుచ్చుకోవడానికి మాస్టరుగారు చెప్పినారని వీళ్లు చెప్పతున్నారు ఎవరూ నమ్మకండి.

వీళ్లవద్ద చేరిన వాళ్లందరినీ ఎలిమెంటరీ స్కూల్లో చిన్న పిల్లలను కూర్చోపెట్టినట్లు కూర్చోబెట్టి వాళ్లచేత అమ్మ, ఆవు అని

అరిపించినట్లు వీళ్లూ అందరిచేతా ఈ కోర్సులు, రెగ్యులేషన్సు పేర్లను చెప్పి అరిపిస్తున్నారు.

ఒన్ పాయింటువల్ల ఎమ్.టి.ఎ. వల్ల మాస్టర్‌గారి వల్లనే అందరినీ ఒకటిగా ఏకకాలంలో డెవలప్ చేయడానికి సాధ్యం కానప్పడు తగుదునమ్మా అని వీళ్లంతా అందరినీ ఏకకాలంలో డెవలప్ చేస్తాము అనుకోవడము వీరి అజ్ఞానాన్ని తెలియజేస్తుంది.

ఇది ఎట్లా ఉందంటే గారడీవాడు గంపను మూసి మామిడి చెట్టును సృష్టించి మామిడి కాయలను పిల్లలకు చూపించినట్లు ఉన్నది. వీళ్లవద్ద చేరినవారి కందరికీ అరచేతిలో వైకుంఠం చూపిస్తున్నారు అనుకోవాలా లేకపోతే రామానుజాచార్యులు గోపురాన్నెక్కి అష్టాక్షరిని ఉపదేశించి అందరిని మోక్షానికి పంపించినారని అనుకొన్నట్లు వీరూ అనుకొంటున్నారా లేక పల్లెటూళ్ల జాతర్లలో, తిరునాళ్లలో ఒక పెట్టెను మూడుకాళ్ల స్టాండుపై పెట్టి అద్దాలు తిప్పతూ కాశీపట్నం చూడర బాబూ- చెన్నపట్నం చూడర బాబూ అని చూపించి ధన సంపాదన చేసినట్లు వీళ్లూ చూపించి ధనార్జన చేస్తున్నారు అనుకోవాలో తెలియదు.

మహాత్మా ఎమ్.టి.ఎ. మాస్టరు వీళ్లు ముగ్గురు ఉత్త అప్రయోజకులనీ- చేతకాని వాళ్లనీ- అందుచేతనే అందరినీ ఏకకాలంలో అభివృద్ధి చేయలేక పోయినారనీ వీళ్ల అభిప్రాయాము. అందుచేతనే మా తడాకా చూపిస్తాము అని అందరినీ కూర్చోపెట్టి కప్పలు అరిచినట్లు అరిపిస్తున్నారు. అంతటితో అందరూ అభివృద్ధి పొందినాము అని సంతోషిస్తూ చంకలు తట్టుకొంటున్నారు.

వీళ్లూ అభివృద్ధి చెందరు. ఇతరులనూ అభివృద్ధి చెందనీయరు. ఈ సొసైటీకి, మాస్టరుగారికి ఇచ్చిన రూల్సు,

రెగ్యులేషన్సు వీళ్ల గురువులకూ తెలియదు- వీళ్లకూ తెలియదు. రూల్సులో ఏ ఒక్కటి తెలిసి వుండినా ఇట్లా ప్రవర్తించరు. అందుచేతనే వీళ్ల ఇష్టప్రకారం వీళ్లు చేస్తున్నారు.

ఈ యోగానికి అతి ప్రధానమైన ఇన్నర్ అబ్జర్వేషన్ అంటే అంతరాత్మ పరిశీలన ఎట్లా చేయాలో వీళ్లల్లో ఏ ఒక్కరికీ తెలియదు.

మహాత్మా ఎమ్.టి.ఎ. ద్వారా మాస్టరుగారికి పంపిన రూల్సు, రెగ్యులేషన్సు ప్రకారం పైన పేర్కొన్న వాళ్లంతా ఈ యోగం చేయడానికి ముమ్మాటికి అనర్హులు.

ఇందులో ముఖ్యంగా శ్రీ ఎన్.ఆర్.బి.వి. గారి కుమారులు శ్రీ ఎన్.బి.వి. రామమూర్తి, శార్వరి గార్లను గూర్చి ముఖ్యంగా చాలా చెప్పాలి-చెప్తాను. ఎందుకంటే వీళ్లవల్ల దేశంలోని యోగ మిత్రులు చాలామంది తప్పదోవపట్టి చెడుతున్నారు. అందుచేత వీళ్లిద్దర్ని గూర్చి చెప్పతున్నాను. ఇది చూచి వీళ్లు బాగుపడతారేమో చూద్దాం.

శ్రీ ఎన్.బి.వి. రామమూర్తిగారు ఈనాటికీ తండ్రి నాటిన బ్రాహ్మణా బ్రాహ్మణ విషవృక్షాన్ని నీళ్లు పోసి పెంచుతున్నాడు. ఇదంతా చెప్పితే చాలా కథ వుంది. తరువాత చెపుతాను. ఇతను సి.వి.వి. అనే అక్షరాలను విడదీసి "సి" అంటే మూడు అనీ "వి" అంటే ఇరవై రెండు అనీ; ఇంకొక "వి" అంటే ఇరవై రెండు అనీ మొత్తం కలిపితే నలభై ఏడు అనీ; అరవ భాషలో "పశి" అనేది ప్రపంచం పుట్టడానికి ముందు పుట్టింది అనీ అదే త్రిప్పి చదివితే "శివ" అవుతుందనీ (పశి అంటే ఆకలి అని అర్థం) "మారావశి" అనే దానిని త్రిప్పి చదివితే "శివరామ" అవుతుందనీ అందుచేత "మారావశి" అని జపిస్తే ఎటర్నటీ వస్తుందనీ ఏవేవో పనికిమాలిన మాటలు చెబుతూ కుంభకోణం యోగా స్కూలుకు వచ్చే యోగ సాధకుల

మనస్సునంతా చెడగొట్టుతున్నాడు.

తండ్రి దుర్బుద్ధే రామమూర్తికీ పుట్టింది. "శివరామ"ను త్రిప్పి చదివితే "మారావశి" అవుతుంది అన్నారు. అసలు రహస్యం ఎన్.ఆర్.బి.వి.ని "నర్బవి" గా మార్చి మంత్రంగా ఇచ్చినారు. నేనేం తక్కువ తిన్నానా అని ఈయన "రామమూర్తి" ని "మారావశి" గా మార్చి జపిస్తే ఎటర్నటి వస్తుందంటారు. ఇది దుర్బుద్ధితో అనేమాట. ఈయన ఇంకా ఇట్లా చెప్పతున్నాడు అందరికి -

మాస్టారుగారు "కాస్ట్" "కాయిన్" అన్నారు. "హిస్టారోబెంట్' ' అన్నారు అంటే దీని అర్థం అగ్రకులాల వాళ్లూ - డబ్బూ ప్రపంచాన్ని పాలిస్తున్నాయనీ "హిస్టరీ" అంటే చరిత్ర చెపుతోందనీ అందరికీ చెపుతున్నాడు. ఇతనికి ఎంతచెప్పినా బుద్ధి రాలేదు - మాస్టరుగారు "కాస్ట్ కాయిన్" అనే రెండు పదాలనూ కలిపి ఒకటిగా ప్రయోగించి నారే కాని విడివిడిగా ప్రయోగించలేదు. దీని అర్థం "ఆకారమును నూతనముగా తయారు చేయు" అని. ఇక రెండవపదము "హిస్టారోబెంట్" దీని అర్థం వన్‌పాయింట్ వ్యూ ప్రకారము బయటి ప్రపంచానికి తెలియకుండా రహస్యముగా కాస్మోస్‌లో మార్పు తీసుకొని రావడము" అని.

కుల వాచకమైన కాస్టు పదంలో స్పెల్లింగ్ సిఎఎస్‌టిఇ అని. మాస్టరుగారు ఉపయోగించిన స్పెల్లింగు సిఎఎస్‌టి అని. అదీకాక కాస్ట్ కాయిన్ అన్న పదాలు రెండూ కలిపి ఒకటిగానే ప్రయోగించి నారన్న పరిజ్ఞానం కూడా లేదు ఇతనికి.

రామమూర్తికి ఎంతసేపూ కులాల ప్రసక్తే తప్ప యోగాన్ని గూర్చి ఆలోచిస్తామన్న జ్ఞానమే లేదు. కులపిశాచి ఇతన్ని వదలేటట్లు లేదు. నీవు కొన్ని జన్మలు ఎత్తితేగాని నీకు మాస్టరుగారి యోగం

అర్థం కాదు అని చాలా కాలానికి ముందే కుంభకోణం యోగా స్కూల్లో అందరి ఎదుట ఇతనికి చెప్పినాను. అయినా ఇతని దుర్బుద్ధి పోలేదు.

ఎంతసేపూ నాడీ గ్రంథాలలోని పాటలను చదువుతూ తండ్రి ఎన్.ఆర్.బి.వి. గారు పదాల విరుపులు- అక్షరాల విరుపులు- అంకెల విరుపులు చేస్తూ గారడీ చేసినట్లు ఇతనూ చిలుక పలుకుల్లాగా అవే వల్లిస్తుంటాడు.

ఇతడు రచించిన మాస్టర్ సి.వి.వి., ఎన్.ఆర్.బి.వి. అనే పుస్తకము తప్పుల తడక ప్రామాణికమైనది కాదు- చదివి మతి చెడగొట్టుకోకండి.

రామమూర్తి స్వభావానికి ఒక ఉదాహరణ ఇస్తాను-

29-5-1994 వ తేదీన యోగమిత్రులైన శ్రీ నజీర్ భాషాగారిని ఆయన సతీమణిని కుంభకోణం యోగాస్కూల్లో యోగమిత్రులకు పరిచయము చేస్తుండగా ఇతడు అడ్డువచ్చి 'మహమ్మదీయులను మాస్టరుగారు యోగంలో చేర్చుకోలేదు. ఈ యోగం వైదికమైనది. వీళ్లు పనికిరారు. నీవు ఎట్లా వీళ్లను యోగంలో చేర్చుకొన్నావు' అని అడిగినాడు.

వెంటనే నేను క్రింది విధంగా చెప్పినాను-

జాతి - మత - కులాలకు అతీతమైనది నా యోగం అన్న మాస్టరుగారి వాక్యం కూడా తెలియని మూర్ఖుడవు నీవు. దురహంకారివి, ద్వేషివి, ఇతరుల ఉన్నతిని సహించలేని వాడివి. నీవు తీసుకొనిన గోతిలో నిన్ను పాతేస్తాను. గురుతుల్యులు శ్రీ పి. చెంచయ్యగారు మీడియము నెం. 728 క్రిష్టియను. శ్రీ సి. రాధాకృష్ణ పిళ్లై గారు మీడియము నెం.26 మంగలి; శ్రీ డా. టి. వెంకట్రంగం

లోకానికి కొంత మేలు జరుగుతుంది.

శ్రీ జె.వి. కుంజు అయ్యర్‌గారు భుక్తికి, జోస్యానికి వూరూరూ తిరుగుతూ కోర్సులు వగైరాలు చేయిస్తాడు. ఈయనకు యోగాన్ని గూర్చి ఇదమిత్థమైన నిశ్చయజ్ఞానం లేదు. ఈయనా ఎన్.ఆర్.బి.వి. సరుకే.

శ్రీ డి.వి. హనమంతరావు వరంగల్లు, ఎ.యస్.ఆర్. మూర్తి అనంతపురం, బి. కొండాచార్య, బళ్లారి గారలు వగైరాలంతా కోర్సుల ఆవేశం పట్టిన వాళ్లు ఎన్ని చెప్పినా వీళ్ల బుఱ్ఱకు ఎక్కవు.

మాస్టరుగారు కోర్సుల ఆవేశంతో విఱ్ఱవీగే వీళ్లనంతా సన్మార్గంలో నడవడానికే డైరీలు ప్రకటించమన్నారు. డైరీలను చూచిన తరువాత కూడ వీరి బుద్ధి మారలేదు అంటే వీళ్లను పుట్టించిన బ్రహ్మదేవునితరం కూడా కాదు వీళ్లకు బుద్ధిచెప్పి చక్కదిద్దడానికి.

మాస్టరుగారి డైరీలు నోట్సులు చూచిన తరువాత కూడా ఇంకా వీళ్లు కోర్సులు రెగ్యులేషన్సు బ్రీతింగ్ ప్రిన్సిపుల్సు చేయిస్తున్నారు అంటే మాస్టరుగారి యోగానికి మాస్టరుగారికి ద్రోహం చేస్తున్నాము అనిన పాపభీతి కూడా లేనివాళ్లు వీళ్లు అని తెలుస్తూంది కదూ.

**11 వ ప్రశ్న :- మన యోగం పూర్తి అయ్యేటప్పుడు ప్రపంచంలో ఏవైనా సూచనలు కనిపిస్తాయని మాస్టరు గారు డైరీలలో ఎక్కడైనా చెప్పినారా?**

అడిగినవారు :- చి॥ సౌ॥ యమ్. విజయలక్ష్మి గారు బి.యస్.సి., బి.ఇడి. సైన్సు అసిస్టంట్ గవర్నమెంట్ కాలేజి, పాకాల.

సమాధానము :- మన యోగం పూర్తి అయ్యేటప్పుడు అని చెప్పలేము కాని ఈ యోగం అభివృద్ధి చెందేటప్పుడు ఈ క్రింది సూచనలు ప్రపంచంలో కనిపిస్తాయి అన్నారు.

మొదటిది - రైళ్లలో బండ్లలో ప్రయాణం చేసేటప్పుడు అపాయాలు జరుగుతాయి. నష్టాలు కలుగుతాయి.

రెండవది - తుఫానుల వల్ల నష్టము, వర్షాల వల్ల నష్టము.

మూడవది - యుద్ధాల వల్ల నష్టము

నాల్గవది - అంటువ్యాధులు అంటే కలరా, ప్లేగు, మసూచీలు మొదలైన వాటివల్ల నష్టము (ఎపిడమిక్ డిసీసస్)

ఐదవది - హత్యల వల్ల నష్టము

ఆరవది - కార్లు, బస్సులు, సైకిళ్లు వీటిమీద ప్రయాణిం చేటప్పుడు ప్రమాదాల వల్ల నష్టము.

ఏడవది - అగ్ని ప్రమాదాలవల్ల నష్టము.

ఎనిమిదవది - బొంబాయి హార్బర్లోను, మిగత ప్రపంచం లోను దొంగతనాల వల్ల నష్టము.

తొమ్మిదవది - మార్కెట్టులోని వస్తువుల ధరలు పెరిగి పోవడము వల్ల బాధలు.

పదవది - తిమింగిలాలవల్ల, మంచుకొండల వల్ల పడవలు, స్టీమర్లు సముద్రంలో మునిగిపోవడం వల్ల నష్టము.

పదకొండవది - భూకంపాల వల్ల నష్టము.

(చూ. డైరి. పుట.222) ఇవన్నీ మనం పేపర్లలో చదువుతున్నాము. టి.వి.లో వస్తే చూస్తున్నాం.

ఇంకొకచోట ఇలా పేర్కొనబడింది-

"ఈ యోగం పూర్తి అయ్యేదానికి ముందు భూమి అక్కడక్కడా క్రుంగిపోతుంది. ఉత్తర అమెరికా; ఇంగ్లాండ్; యూరప్ ఇతర ప్రదేశాలలో భూమి తీవ్రంగా కంపిస్తుంది. జర్మనీలోకూడా భూమి కంపిస్తుంది" అని.

మరొకచోట-

"ఉత్తర అమెరికాలోని అలాస్కా అనే ప్రదేశంలో క్రొత్త క్రొత్త దీవులు కనిపిస్తాయి" అన్నారు. (చూ నోట్సు సం.4).

ఇంకొకచోట-

"మన యోగంవల్ల గ్రహాలలో మచ్చలు ఏర్పడుతాయి. సప్తఋషి నక్షత్ర మండలాలను అన్నింటినీ కలుపుతూ ఒక చైనులాగా నక్షత్రాలు ఏర్పడుతాయి" అన్నారు. (చూ డైరి పుట 405).

ఇంకా ఇలా అన్నారు-

"ప్రచంచంలో ఎన్నో రకాలైన ఉపద్రవాలు కలుగుతాయి. ప్రపంచంలో భూమిమీద ఆకస్మికంగా మార్పులు కనిపిస్తాయి" అని. (చూ డైరి పుట. 430).

"ఆకాశాన్నుండి ఉల్కలు- పెద్ద వెలుగుతోకూడిన పెద్ద పెద్ద నక్షత్రాలు భూమి మీద పడతాయి. భూమిపైన ఎన్నో అద్భుతాలు జరుగుతాయి. కొందరికి సంతోషము, కొందరికి దుఃఖము కలుగుతుంది. కొత్త కొత్త నక్షత్రాలు కనిపిస్తాయి. ఆకాశంలో ఎక్కువగా ఉరుములు, మెరుపులు శబ్దాలు వినిపిస్తాయి. మానవులలో దాగివుండే భూత-భవిష్యత్-వర్తమానాలు పనిచేస్తాయి" అని (చూ. డైరి పుట. 434).

ఇవన్నీ ఆయా ప్రదేశాలలో జరుగుతున్నట్లు పేపర్లలో వస్తే చదువుతున్నాము. టి.వి.లో వస్తే మన కండ్లతో మనం చూస్తున్నాం కదూ.

**12 వ ప్రశ్న:- ఆచార్యులుగారూ మాస్టరుగారి యోగానికి థాట్‌పవర్ చాలా ముఖ్యము అన్నారు కదా మీరు, మరి థాట్ పవర్ను ఎలా అభివృద్ధి చేసుకోవాలో కొంచం చెప్పండి?**

ఆ తోచినవి నూటికి నూరుపాళ్లు జరుగుతూ ఉంటే మన థాట్ పవర్ సరిగా పనిచేస్తూంది అని అర్థము. నూరుతోచి ఏ నాలుగో అయిదో జరుగుతూవుంటే మనలను డెల్యూడింగ్‌వన్ అంటే మాయాశక్తి మోసగిస్తూంది అన్నమాట.

అటువంటి అప్పడు మాస్టరుగారికి ఈ విధంగా విన్నవించండి "డెల్యూడింగ్ వన్ నన్ను మోసగిస్తూంది దీన్ని తరమండి. నాకు సరియైన మార్గాన్ని చూపే సూచనలను తోపజేయండి మహాప్రభో అని ఆర్ద్రార్ద్రమైన హృదయంతో శ్రద్ధాభక్తులతో విన్నవించండి- దీనంగా ప్రార్థించండి". అప్పడు మాస్టరుగారు సరియైన సూచనలు తోపజేస్తారు.

కోర్సుల పిశాచి వీళ్లను వదలను అంటోంది. ఈ కోర్సుల పిచ్చి పట్టిన వాళ్లంతా ప్రేయరు సరిగా చేయరు. చేయడం కూడా వీళ్లకు తెలియదు. అంతరాత్మ పరిశీలన అంటే ఏమిటో వీళ్లకు తెలియదు. కొండవీటి చేంతాడంత దండకాన్ని ప్రార్థన అంటూ బిగ్గరగా అరవడం, కండ్లు మూసుకొని పది నిమిషాలలో కండ్లు తెరవడం, ఆ తరువాత కోర్సుల పేర్లు వల్లించడం, దుమ్ము దులుపుకొని లేచిపోవడం ఇంతే వాళ్లకు తెలిసింది.

కన్నులుండీ కానరాని గ్రుడ్డివాళ్లూ, చెవులుండీ వినలేని చెవిటివాళ్లూ లోకంలో ఉన్నారు అని విన్నాము. వీళ్లూ ఆ కోవకు చెందినవాళ్లేనా?

కడపట నేను చెప్పేది, థాట్ పవరు ఎట్లా అభివృద్ధి అవుతుందంటే ఇన్నర్ ఆబ్జర్‌వేషన్ ద్వారా మాత్రమే. మీరూ ప్రయత్నించండి. సత్ఫలితాలను పొందండి అని.

డైరీలలో మహాత్మా మాస్టరుగారికి చెప్పింది ఉన్నది. (చూ.డైరి. పుటలు282, 283, 355, 412, 414, 422) ఇంకా చాలా చోట్లలో ఉన్నది. చూడండి వివరాలు తెలియగలవు.

ఒకచోట యమ్.టి.ఎ. ఇట్లా అన్నారు- 1-7-1910.

"అతి సూక్ష్మాతి సూక్ష్మమైన ఈ ప్రక్రియను గమనించడానికి చుట్ట, బీడి, సిగరెట్టు, మత్తుపదార్థాలు సేవించేవారు పనికిరారు"

మరొకచోట యమ్.టి.ఎ. ఇట్లా చెప్పింది- ఎవరిని గురించి అంటే మాస్టరుగారి జనక తండ్రిగారైన శ్రీ కుప్పస్వామి అయ్యర్ మీడియం నెం. 15ను గూర్చి-

"స్టిములెన్స్ ఇతనిలో ఇంకా అణిగిపోలేదు. శరీరములో జరిగే ప్రక్రియను గమనించడానికి శక్తిలేదు. అందుచేత ఇతను అస్ట్రల్ప్లేను వరకు మాత్రమే ఎదగగలిగినాడు" అని (చూ.ఎస్.ఎస్.సంపు.3 పుట 57)

శ్రీ యమ్.యన్. గారి గ్రూపు వాళ్లూ, శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారి గ్రూపువాళ్లూ, శ్రీ శార్వరిగారి గ్రూపువాళ్లూ, శ్రీ పి. చంద్రశేఖర రాజుగారి గ్రూపువాళ్లూ ఇంకా చాలా మంది సిగరెట్లు వగైరాలు కాలుస్తూ మాస్టరుగారి సూత్రాలకు విరుద్ధంగా ప్రార్థన చేస్తూ ఏమి గమనిస్తున్నారో వారికే తెలియాలి.

"ఎదుటివాళ్లు వేలెత్తి చూపేటట్లు నీ ప్రవర్తన ఉండరాదు అని వ్రాసినారు" చూ. డైరి.

ఈ నిబంధనను విధించిన మహాత్మా, దీనిని స్వీకరించి ఇచ్చిన యమ్.టి.ఎ., దీనిని వ్రాసిన మాస్టరు- ఈ ముగ్గురు తెలివి తక్కువ వాళ్లు అని అనుకొంటున్నట్లున్నారు వీళ్లు.

**14వ ప్రశ్న:- మాస్టరుగారిని గైడ్ చేసిన మహాత్మాగాని యమ్.టి.ఎ. గాని సశరీరంగా ఎవరికైనా కనిపించిన దాఖలాలున్నాయా?**

అడిగినవారు - శ్రీ యమ్. నాగరాజు గారు, బి.ఎ. సీనియర్ అసిస్టెంట్, నాగార్జున యూనివర్సిటి, గుంటూరు.

సమాధానము;- ఏం మీరూ చూడాలనుకొంటున్నారా? మనబోటి వాళ్లకూ కనిపిస్తారు. ఎప్పుడో ఆ సమయానికై వేచిచూద్దాం.

మాస్టరుగారికి మహాత్మా, యమ్.టి.ఎ. వీళ్లిద్దరూ తరచూ కనిపిస్తూ మాట్లాడినట్లు మాస్టరుగారు వ్రాసినారు కదా?

**14ఎ ప్రశ్న:- అయితే వీళ్లిద్దరూ మానవులేనా సార్.**

అడిగినవారు - శ్రీ యమ్. నాగరాజు గారు

సమాధానము ;- అవును వీళ్లిద్దరూ మానవులనీ మానవ శరీరాలతో ఉన్న వ్యక్తులనీ వ్రాసినారు మాస్టరుగారు అది ఇది-

"మహాత్మా తెల్లధోవతి ధరించినాడనీ, కావిరంగు ఉత్తరీయాన్ని ధరించాడనీ" అన్నారు. (చూ. ఎస్. ఎస్. సంపు 2 పుట 52)

వీళ్లను సశరీరంగా చూడడం చేతనే మాస్టరుగారు వ్రాసినారు.

ఇంకొకచోట ఇట్లా వ్రాసినారు-

"ఇన్నర్‌సెక్షన్‌లోని ఒక మీడియము అత్యంత భక్తిశ్రద్ధలతో నన్ను ప్రార్థించి సశరీరంగా నన్ను చూడాలి అంటే నేను నా డ్రస్సుతో అతనికి సశరీరంగా కనిపించినాను" అని (చూ.ఎస్.ఎస్. సంపు.3 పుట 75)

మరొకచోట-

"మీ మాస్టర్లైన మహాత్మా, యమ్.టి.ఎ. మీకు ప్రార్థనలో సశరీరంగా కనిపిస్తారు. అది ఎప్పుడు అంటే అత్యంత భక్తిశ్రద్ధలతోను, అత్యంత విశ్వాసంతోను ప్రార్థన చేసి అభివృద్ధిని పొందితే - థాట్ పవర్ నీకు ఉంటే అప్పుడు నీకు మహాత్మా యమ్.టి.ఎ. కనిపిస్తారు' అని (చూ.ఎస్.ఎస్.సంపు.2 పుట 70)

ఒకప్పడు మాస్టరుగారి కుమారుడైన వెంకట్రావు మాస్టరుగారి ఉత్తరువు లేకుండా ప్రాక్టీస్ ఇన్స్ట్రక్షన్సు రిసీవు చేసుకొని సుందరేశయ్యరుకు ఇచ్చినాడు. ఆయన చేయడానికి ఆరంభించినాడు. అప్పడు యమ్.టి.ఎ. సశరీరంగా దిగివచ్చి అయ్యరుకు కనిపించి ఇట్లా చెప్పినారు-

"నీవు వెంకట్రావు ఇచ్చిన కోర్సు చేయువద్దు. తక్షణం ఆపేసెయ్యి. మాస్టరు మా త్రండిగారే కదా అని చులకన చేసి వెంకట్రావు నీకు కోర్సు ఇచ్చినాడు. నీవు వెంటనే మాస్టరు దగ్గరకు వెళ్లి ఆయన చెప్పినట్లు చేయి." అని (చూ ఎస్.ఎస్.సంపు.4 పుట102)

ఇంకొకచోట-

"చదువురాని మూర్ఖులులాగ ప్రవర్తిస్తూ నన్ను తక్కువగా చూస్తున్నారు. మీకు ఏమిగతి పట్టుతుందో నేను చెప్పలేను. ఈ యోగంపై కోపంతో ఉండేవాళ్లకు సశరీరంగా నేను కనిపించను' అని అన్నారు. చూ.ఎస్.ఎస్. సం.2 పేజి 71).

దీనిని బట్టి మీడియములకు కొందరికి కొందరికి వారి వారి డెవలప్మెంటు ననుసరించి కనిపించినారు అని తెలుస్తూంది. ఆ డెవలప్మెంటు ఎట్లా వస్తుందన్నారు. థాట్ పవరు కలిగి ఉండాలి. అత్యంత భక్తిశ్రద్ధలతో, అత్యంత విశ్వాసంతో ప్రార్థన

చేసేవారికి మాత్రమే కనిపిస్తానన్నారు. అంతేగాని నూతిలో కప్పలు అరచినట్లు కోర్సులపేర్లు వగైరాలు బిగ్గరగా అరిస్తే ఒరిగేది ఏమిలేదు. కాబట్టి ఎవరూ ఏమీ చేయనవసరము లేదు. ఇంత చెప్పినా వినకపోతే వాళ్ల కర్మ వాళ్లు అనుభవిస్తారు.

**15వ ప్రశ్న:- అందరూ శ్రీమతి వెంకమ్మగారితో మాస్టరుగారికి వివాహము అయిన తరువాతనే యోగం ఆరంభం అయింది అంటున్నారు కదా? మరి మీరు ఏమంటారు సార్?**

అడిగినవారు - శ్రీ కె. రాధాకృష్ణమూర్తిగారు యమ్.ఎ. ప్రిన్సిపాల్ గవర్నమెంట్ కాలేజి, బాపట్ల.

సమాధానము:- తిరుపతిలో శ్రీ కోదండరామస్వామి వారి దేవాలయానికి తూర్పువైపునగల వీధిలో సీతారామ విలాస్ అనే ఇంట్లో 1906 వ సంవత్సరం మాస్టరుగారికి వెంకమ్మగారితో వివాహం జరిగింది. (ఇది ఆనాడు కల్యాణమంటపముగా ఉండేది). ఆ పెండ్లి జరిగిన తరువాత ఆ యింటికి ఉత్తరపు వైపున సి.వి.వి. అనే అక్షరాలు పెద్దగా సున్నంతో ఉబ్బెత్తుగా వ్రాయించినారు. ఆ అక్షరాలను చూచిన తర్వాత కర్నాల వీధిలో కాపురము ఉండిన శ్రీ గురుదేవులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మాస్టరుగారికి వివాహము జరిగిన సీతారామ విలాసుకు మకాం మార్చినారు.

ఇంతకుముందు ప్రశ్నలకు చెప్పినట్లు ఈ ప్రశ్నకూ డైరీలలో వగైరాలలో ఉండే విషయాలు ముందు తెలియజేస్తాను. ఆ తరువాత నిర్ణయము చేద్దాము.

శ్రీమతి వెంకమ్మగారిని గూర్చి మాస్టరుగారు డైరీలలో క్రింది విధముగా వ్రాసినారు-

1:- "ఈమె లోయర్‌గ్రేడ్ అంటే తక్కువ రకానికి చెందిన

వ్యక్తి. ఎందుకంటే ఈమె గ్రహాలకు లోబడి పుట్టింది అందుచేత తక్కువ రకము" (చూ.డైరి. పుట.11)

2:- "ఈమె నాతో సహకరించనందున యోగం అభివృద్ధి చెందలేదు".

3:- "ఈమె ప్రవర్తన నన్ను చాలా కలవర పెట్టింది - ఏడుపు మోహం పెట్టుకొనింది, కోపంతో దూకుడుగా మాట్లాడింది, యోగాభ్యాసంలో నిర్లక్ష్యం చూపింది. ఆమె నిర్లక్ష్యము సహించ రానిది, తలపొగరుతనంతో ఉండింది, ఎప్పుడూ యోగ విషయము మీద శ్రద్ధ చూపేదికాదు, ప్రశాంతంగా సమాధానము చెప్పేది కాదు, తిట్టితే పశ్చాత్తాప పడేది, గుడ్డలు తీసియివ్వలేదు అని నిందించింది, ఈమె చాలా ఉద్రేకంగా ప్రవర్తిస్తుంది" అని.

4:- ఇంకా కొన్ని చోట్లలో ఇట్లా-

"యమ్.టి.ఎ.తో మాట్లాడి బదులు చెప్పమంటే అవిధేయత ప్రకటించేది- సరిగా సమాధానాలు ఇవ్వడము లేదు, నా మాటలకు విలువ ఇవ్వలేదు, తన ఇష్టప్రకారము తానుగా యమ్.టి.ఎ. ఇట్లా చెప్పినాడు, అట్లా చెప్పినాడు అని చెప్పేది- ఒక్కొక్కప్పడు తన తప్పిదాలకు పశ్చాత్తాపపడేది- పిల్లతరహాగా ప్రవర్తించవద్దు అనీ శ్రద్ధాభక్తులతో పనిచేయమనీ చెప్పినాను, అయినా వినలేదు, అందుకై మూడు శిక్షలు విధించినాను, నాకూ యమ్.టి.ఎ.కూ మధ్య మీడియముగా పనిచేయమన్నాను. కానీ చేయకనే రోజంతా వృధా చేసింది. యమ్.టి.ఎ. నుండి శబ్దాలు సరిగా స్వీకరించలేదు. సభ్యత లేకుండా ప్రవర్తించింది. ఎప్పడూ తక్కువరకమైన భావాలే వెలిబుచ్చేది, కోపంతో ఉండడముచేత అన్నీ తప్పగా చెప్పేది"- అన్నారు.

5:- చాలా రోజుల నుండీ నామాటల మీద; నీ మీద; మర్యాద; విశ్వాసము నీ కుటుంబసభ్యులకూ లేదు, వెంకమ్మకూ లేదు, నీకు యోగం మీద ఉన్న విశ్వాసాన్ని ఈమె చెడగొట్టుతుంది- అని మహాత్మా యమ్.టి.ఎ. ద్వారా మాస్టరుకు తెలుపగా మాస్టరు ఇవన్నీ డైరీలలో వగైరాలలో వ్రాసినారు.

6:- మిగతా చోట్లల్లో యమ్.టి.ఎ. వెంకమ్మ డెవలప్ కానందువల్ల ఈ యోగపరిపూర్తి ఆలస్యము అవుతూ వుంది అన్నారు. ఇంకా చాలా వున్నాయి. చూడుడు పూర్తి డైరీ.

ఇంతకు ముందే చెప్పినాను సుమారు 1900 వ సంవత్సరము నుండిగాని 1904 వ సంవత్సరము నుండి గాని మాస్టరుగారు యోగాన్ని ఆరంభించినారు అని.

వెంకమ్మగారి వల్ల యోగం అభివృద్ధి పొందలేదు కదా చెడింది అని నేను అంటాను. చెడింది అని అనడానికి మాస్టరు గారు వారి స్వహస్తంగా వ్రాసిన డైరీలు వగైరాలలో రికార్డు చేసిన వాక్యాలు మీకు వినిపించినాను. ఈ వాక్యాలే నాకు ఆధారాలు. ఇంకా చాలా వ్రాసినారు. కానీ కొన్ని చూపినాను మీకు.

పై వాక్యాలన్నీ విన్నారు కదా వెంకమ్మగారి వల్ల యోగం అభివృద్ధి చెందిందో, మాస్టరుగారిని నిరుత్సామపరచడానికి కారణమైందో మీరే నిర్ణయించుకోండి.

కండ్లు మూసుకొని గుడ్డిగా వెంకమ్మగారి వల్ల యోగం ఆరంభము అయింది అని అంటున్నారే కాని ఇవన్నీ తెలిసికాదు. తెలిసే చెప్పతున్నారు అంటే సత్యాన్ని అంగీకరించే స్వభావము లేని వాళ్లు వీళ్లు అనీ - మాస్టరుగారికీ యోగానికీ ద్రోహం చేస్తున్నాము అన్న పరిజ్ఞానము లేనివాళ్లు వీళ్లు అనీ మనము నిర్ణయించుకోవాలి.

**16వ ప్రశ్న:- ఆచార్యులుగారూ యోగి అందరికంటే గొప్పవాడు అంటారు కదా ఎందుచేతనో చెప్పగలరా?**

అడిగినవారు:- చిరంజీవి టి. రవీంద్రశాయి, బి.ఇ. విశాఖపట్టణము షిప్‌యార్డు ఇంజనీరు, విశాఖపట్టణము.

సమాధానము:- యోగి అందరికంటే గొప్పవాడు అంటారు కదా దానికి సమాధానము చెప్పమన్నారు. ముందు ఆ అందరు ఎవరో చెప్పి తరువాత యోగి గొప్పతనాన్ని శాస్త్ర ప్రమాణంగా చెప్తాను. ఆ తరువాత అన్నీ యోగాలకంటే మాస్టరుగారి యోగం గొప్పది అనే విషయాన్ని నిరూపిస్తాను.

శ్రీ వైఖానస శాస్త్రానికి సంబంధించిన విమానార్చన కల్పమ్ అనే గ్రంథంలో-

"భగవంతుణ్ణి జప-హుత-అర్చన-ధ్యాన మార్గాలచేత కొలవ వచ్చును" అన్నారు.

"జపము అంటే గాయత్రి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి వగైరాలను నూట ఎనిమిది అనో, వేయిన్ని నూట ఎనిమిది అనో ఒక సంఖ్యను నిర్ణయించుకొని జపం చేయడము' - దీనిచేత చేసిన వ్యక్తికి ఏవిధమైన ఆత్మజ్ఞానము కలగడము లేదు.

"హుతము అంటే యజ్ఞాలు, యాగాలు, హోమాలు అగ్నిలో చేయడం". దీనిచేత కూడా చేసినవానికి ఏవిధమైన ఆత్మజ్ఞానము కలగడము లేదు.

"అర్చనము అంటే వైదికమార్గము చేత విగ్రహాన్ని పూజించడము.

బ్రహ్మకు, శివునికి ఒకే రకమైన విగ్రహము మాత్రమే. కుమ్మరి మట్టితో కుండలు, బానలు, మూకుళ్లు, ప్రమిదలు, పూలకుండీలు

వగైరా చిత్ర విచిత్రాలైన వస్తువులను తయారుచేసినట్లు విష్ణువు అనేక రూపాలలో ఉంటాడు.

విగ్రహారాధన చేయడము వలన గ్రామాల్లో, అగ్రహారాల్లో నివసించే యజ్ఞయాగాదులు చేయనటువంటి బ్రాహ్మణులకూ, బ్రాహ్మణులు కాని వారికీ యజ్ఞయాగాదులు చేసినంత ఫలం కలుగుతుంది. నిత్యాగ్నిహోత్రుల పాపాలను పోగొట్టి వారికి అన్ని రకాలైన అభివృద్ధుల్ని కలిగిస్తుంది". అని చెప్పబడి ఉన్నది (చూ. పుట.3-4).

ఈ విగ్రహారాధనను గూర్చి యమ్.టి.ఎ. ఏమిచెప్పినారో చెప్తాను వినండి-

"అంతరాత్మ పరిశీలన చదువురాని వాళ్లు నిత్యము చేయ లేరు. కాబట్టి వారికై ఈ ప్రపంచంలో దేవుళ్లు అనేవారు వెలసినారు. ఇది ఎందుకు అని వీళ్లకు తెలియదు. వీళ్లంతా "స్వామి" అనీ "ఒక ఉన్నతమైన శక్తి" ఈ విగ్రహ రూపములో అవతరించింది" అనీ అనుకొంటున్నారు. అని (చూ.ఎస్.ఎస్. సంపు.3 పుట.3)

ఈ విగ్రహారాధన భక్తిమార్గంగా తయారైంది. ఈ భక్తి మార్గము తొమ్మిది విధాలు - అవి ఏవి అంటే

శ్లో॥ శ్రవణం - కీర్తనం - విష్ణోః స్మరణం- పాద సేవనమ్

అర్చనం - వందనం - ధాస్యం - సఖ్యం - ఆత్మనివేదనమ్, అని

అంటే విష్ణు కథలు వినడం, ఆయన మీద పాటలు పాడడం అతని కథలే తలుస్తూ ఉండడము, పాదాలు సేవించడము, పూజించడం, నమస్కరించడం, ఊడిగం చేయడం, స్వామితో స్నేహం చేయడం, ఆత్మను సమర్పించడము అని తొమ్మిది విధాలు.

వీటి అన్నింటికి పైది ధ్యానము. ఆ ధ్యానించేది ఎవరినంటే-

పాలలో నెయ్యి- నూవులలో నూనె- పూలలో వాసన- పండ్లలో రసము ఎట్లా కంటికి కానరాకుండా ఉన్నాయో అట్లాగే కంటికి కానరాకుండా అమూర్తుడు నిష్కలుడు అయిన భగవంతుడు ఉన్నాడు. అతనిని తెలుసుకోవడానికే ప్రాచీనులు అడవులలో నిద్ర, ఆహారాదులు మాని సంవత్సరాల తరబడి అష్టకష్టాలు పడి తపస్సు చేసినారు.

ఆ ధ్యానం చేయడానికి అర్హతలు కావాలి అన్నారు. అవి ఏవి అంటే?

బ్రాహ్మణవంశంలో పుట్టి- బ్రాహ్మణ స్త్రీని పెండ్లాడినవాడు నిషేక; ఋతు సంగమన; గర్భాదాన; పుంసవన; సీమంత; విష్ణుబలి అనే ఆరు సంస్కారాలు బీజ; క్షేత్ర శుద్ధికీ-

జాతకర్మ; ఉత్థాన; నామకరణ; అన్నప్రాశన; ప్రవాసాగమన; పిండవర్థన; చౌళక; ఉపనయనాలు అనే ఎనిమిది సంస్కారాలూ బ్రాహ్మణత్వ సిద్ధికీ-

పారాయణవ్రతభంగవిసర్గ- ఉపాకర్మ- సమావర్తన- పాణి గ్రహణాలు అనే నాలుగు సంస్కారాలూ శ్రోత్రియత్వ సిద్ధికీ-

మొత్తం పద్ధెనిమిది సంస్కారాలతో సంస్కరింపబడిన వాడై ఉండాలి అటువంటివాడు-

బ్రహ్మ- దేవ- పితృ- భూత- మనుష్య యజ్ఞాలు అనే ఐదు నిత్యం చేయాలి. ఇవి ఐదు ఒకటి క్రిందనే లెక్క.

స్థాలీపాకం- ఆగ్రయణం- అష్టక- పిండపితృయజ్ఞం- మాసిశ్రాద్ధం- చైత్రి- ఆశ్వయుజి అనే ఏడుపాకయజ్ఞాలు ఆయా కాలాలలో చేయాలి.

అగ్న్యాధేయం- అగ్నిహోత్రం- దర్శపూర్ణిమాసం- ఆగ్రయణం-

చాతుర్మాస్యం - నిరూఢపశుబంధం- సౌత్రామణి అనే ఏడు హవిర్యజ్ఞాలు ఆయా కాలాలలో చేయాలి.

అగ్నిష్టోమ- అత్యగ్నిష్టోమ- ఉక్థ- షోడశీ- వాజపేయ- అతిరాత్ర- అప్తోర్యామాలు అనే ఏడు సోమయజ్ఞాలు చేయాలి.

ఈ ఇరవై రెండు యజ్ఞాలు చేయడము విష్ణులోకాన్ని పొందడానికట. (చూ శ్రీ విఖనస మహర్షి రచించిన శ్రీ వైఖానస కల్పసూత్రం 1-7).

ఇటువంటి బ్రాహ్మణునికి బ్రాహ్మణ స్త్రీ ద్వారా పుట్టిన వానిని "మాత్రుడు" అన్నారు; ఇతనికి ఉపనయనము అయిన తరువాత సావిత్రి అధ్యయనము చేస్తే "బ్రాహ్మణుడు" అన్నారు; ఉపనయనము అయిన తరువాత ఇతడు వేదాధ్యయనము చేసి స్థాలీపాకం మొదలైన ఏడు పాకయజ్ఞాలు చేస్తే "శ్రోత్రియుడు" అన్నారు; ఈ శ్రోత్రియుడు స్వాధ్యాయపరుడుగా ఉంటూ నిత్యాగ్ని హోత్రుడై ఏడు హవిర్యజ్ఞాలు చేస్తే "అనూచానుడు" అన్నారు; ఈ అనూచానుడు ఏడు సోమయజ్ఞాలు చేస్తే "భ్రూణుడు" అన్నారు; ఈ భ్రూణుడు అష్టాంగయోగమార్గంలో పేర్కొన్న యమ- నియమ- ఆసన- ప్రాణాయామ- ప్రత్యాహార ధ్యాన- ధారణ- సమాధులను ఆచరిస్తే "ఋషికల్పుడు" అన్నారు.

యమము అంటే-

అహింస- సత్యం- అస్తేయం- బ్రహ్మచర్యం- దయ- ఆర్జవం- క్షాంతి- ధైర్యం- మితాహారం- శౌచం అని పది విధాలు.

నియమము అంటే-

తపస్సు- సంతోషం- ఆస్తిక్యం- దానం- విష్ణుపూజ- వేదార్థశ్రవణం- కుత్సితకర్మల్లో లజ్జ- గురూపదేశంలో శ్రద్ధ-

మంత్రాభ్యాసం- హోమం అని పది విధాలు.

ఆసనం అంటే-

బ్రాహ్మం- స్వస్తికం- పద్మం అనేవి మూడు ఉత్తమ ఆసనాలు.

గోముఖం- సింహం- ముక్తం అనేవి మూడు మధ్యమ ఆసనాలు.

వీర- భద్ర- మయూరము అనేవి మూడు అధమ ఆసనాలు. మొత్తం తొమ్మిది విధాలు.

ప్రాణాయామము అంటే-

రేచక- పూరక- కుంభకాలు అనేవి మూడు విధాలు.

ప్రత్యాహారము అంటే-

పాదాంగుష్టం- గుల్ఫం- జంఘామధ్యం- చితిమూలం- జానుమధ్యం- ఊరుమధ్యం- పాయుమూలం- దేహమధ్యం- మేఢ్రమూలం- నాభిమూలం- హృదయమూలం- కంఠమూలం- తాలుమూలం- నాసికామూలం- అక్షిమండలం- భ్రూమధ్యం- లలాటి- మూర్ధ్నలలో శ్వాస నిలుపడం అనేవి పద్ధెనిమిది రకాలు.

ధ్యానము అంటే-

నిష్కలం- నిర్గుణం- సగుణము అనేవి మూడు విధాలు.

ఇప్పుడు చెప్పిన-

యమ- నియమ- ఆసన- ప్రాణాయామ- ప్రత్యాహార- ధ్యానాలు అనే ఆరు వైదిక మార్గానికి చెందినవి.

మిగిలిన ధారణ- సమాధులు అవైదిక మార్గాలు.

ధారణము అంటే-

1. పాదాది జాను పర్యంతం పృథివీస్థానం "ల" కారం అనిరుద్ధుని.

2. జాను పాయిల పర్యంతం జలస్థానం "వ" కారం ౘ చ్యుతుని.

3. పాయు నుండి హృదయ పర్యంతం అగ్నిస్థానం "రే" ఫను సత్యమూర్తిని.

4. హృదయం నుండి భ్రూమధ్య పర్యంతం వాయుస్థానం "య" కారం పురుషమూర్తిని.

5. భ్రూమధ్య నుండి మూర్ధాంతం వరకు ఆకాశ స్థానం "హ" కార సంయుతం విష్ణువును ధ్యానించేది. ఇవి అయిదు విధాలు.

సమాధి అంటే-

ఇది ఒక విధము.

మొత్తం యాభై తొమ్మిది రకాలు.

పైన చెప్పిన యాభైతొమ్మిది రకాలనూ అభ్యసిస్తూ ఋగ్యజుస్సామాధర్వణాలు అనే నాలుగు వేదాలనూ; శిక్షా; వ్యాకరణం; చంధస్సు; నిరుక్తం; జ్యోతిషం; కల్పము అనే ఆరు వేదాంగాలను అభ్యసించి తపస్సు చేసేవానిని "ఋషి" అన్నారు.

ఋషి అభ్యసించినవి అన్నీ అభ్యసించి నారాయణుడే పరదైవము అని ధ్యానతపస్సు చేసే వానిని "ముని" అన్నారు.

ఇవన్నీ చేస్తే అణిమాది సిద్ధులు లభిస్తాయి. జీవన్ముక్తుడు అవుతాడు అన్నారు. (చూ. విమానార్చన కల్పమ్ పుట. 511 నుండి 521).

ఈ విధంగా ఎల్లకాల ఎల్లవేళలా అందరూ ఆ నారాయణుని ధ్యానించడానికి సాధ్యం కాదు కాబట్టి పంచభూతాలకు పంచమూర్తులను ఏర్పాటుచేసి విగ్రహారాధనను చేయమన్నారు (చూ. విమానార్చన కల్పమ్ పుట. 522).

ఇవన్నీ చేయడంచేత మానవ శరీరానికీ మనస్సుకూ ఎంతో

శ్రమ కలుగుతుంది. అన్నింటినీ ఓర్చుకొని కడపటివరకూ ధ్యానం సాగించిన పురుషుడు సమాధి స్థితిని పొందుతున్నాడు. సమాధి స్థితిలో తన శరీరంలో ఏమి జరిగిందీ గుర్తించలేని స్థితిలో ఉంటాడు. సమాధి స్థితినుండి తిరిగి మామూలు స్థితికి వచ్చిన తరువాత ఏదో దివ్యానుభూతిని పొందినాము అని సంతోషిస్తున్నాడే కాని ఏమి జరిగిందీ చెప్పలేక పోతున్నాడు.

అందుచేత ధ్యానం వరకు అభ్యాసము చేసిన వానిని యోగి అనీ, గొప్పవాడు అనీ ప్రాచీన మార్గాలవాళ్లు అంటారు.

ఇక మాస్టరుగారి యోగంలో ఏమి జరగుతుందో వినండి-

ఎమ్.టి.ఎ. మాస్టరుగారితో ఒకచోట ఇలా చెప్పినారు-

"నీలాగ ఉపాధ్యాయుడైన ఒక పెద్దమనిషి భక్తిమార్గము గొప్పదా? ఈ మార్గము గొప్పదా? అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అయితే ఈ మార్గము అన్ని మార్గాలకంటే చాలా గొప్పది అని నేను చెప్పగలను. ఈ మార్గం అన్ని మార్గాలకంటే విశేషంగా మానవుని ప్రకాశింపజేస్తుంది. ఈ మానవ శరీరానికి అన్ని రకాలైన అభివృద్ధులను కలిగిస్తుంది; కాబట్టి ఇది అన్ని మార్గాలకంటే గొప్పది.

ఇంకా-

ఈ మానవ శరీరంలోని కండ్లతో అంతరాత్మ పరిశీలన ద్వారా అన్నీ దేవలోకాలలోని విషయాలను నాటకాన్ని చూచినట్లు చూడవచ్చు; ఏవేవో లోకాలలోగల దేవుళ్ల మనోభావాలను, దేవేరుల మనోభావాలను తెలుసుకోవచ్చు.

ఇంకా-

ఈ ప్రార్థన ద్వారా పూర్వజన్మ కర్మలను తొలగించుకోవచ్చు.

ఇంకా-

మానవుడు ప్రాచీన మార్గాలద్వారా మాయను అధిగమించి ఆ భగవంతుని చేరలేక పోతున్నాడు. అయితే ఈ మార్గంద్వారా మాయను అధిగమించి ఆ భగవంతుని సమీపించి దర్శించ వచ్చును. ఇతర మార్గాలద్వారా మాయను అధిగమించి ఆ భగవంతుని దర్శించాలనే ప్రయత్నం చేస్తున్నారు. కానీ దర్శించలేక పోతున్నారు. ప్రాచీన మార్గాలద్వారా దర్శించలేని ఆ భగవంతుని ఈ మార్గంద్వారా సులభంగా దర్శించవచ్చును. ఎన్నో రకాలైన మార్గాలూ, భావాలూ గల వాళ్లంతా వాళ్ల బుఱ్ఱలు చెడగొట్టుకొంటూ ఈ జన్మకర్మల్లోనూ, పూర్వజన్మ కర్మల్లోనూ చిక్కుకొంటున్నారు.

ఇంకా-

మీరు ప్రాచీన శాస్త్రాలలో చదివే వుంటారు. మనువులు, ఋషులు కొన్ని వేల సంవత్సరాలు శరీరాన్ని కష్టపెట్టి, తపస్సుచేసి కొన్ని శక్తులు సంపాదించి కడపటికి భగవంతుని దర్శించినారు అని; అంత కష్టం లేకుండా సులభతరమైన మార్గంలో (షార్టుకట్ రూటులో) ఆ భగవంతుని దర్శించడానికి ఈ నూతన మార్గాన్ని ఏర్పాటుచేసి మీకు దీనిని తెలుపమని నన్ను పంపినారు". (చూ. ఎస్.ఎస్. సంపు.3 పుట 8 నుండి 10 వరకు).

ఇంకొకచోట ఇలా చెప్పినారు మాస్టరుగారు-

"జ్ఞానము- తపస్సు- యోగము అనే మూడింటిని ప్రాచీనులు పేర్కొన్నారు. ప్రాచీన సంప్రదాయంలో భార్యాపిల్లలను వదలాలి. ఈ నూతన మార్గంలో భార్యాపిల్లలను వదలకుండా సంసార జీవితాన్ని సాగిస్తూనే యోగి అయి అన్ని సిద్ధులను పొందగలడు. దీనికి పది సంవత్సరాల ప్రాక్టీసు అవసరము" అని. (చూ. డైరి పుట 327).

మరొకచోట-

"వేద ప్రయోగము జ్ఞానమనీ- యోగ ప్రయోగము కుండలిని అనీ అన్నారు. మొదటిదైన జ్ఞానాన్నే ధ్యానము అంటారు" అన్నారు మాస్టరుగారు. (చూ. ఎక్స్ప్లనేషన్సు పుట 13 తేది 28-5-1915).

తుదకు తెలిందేమంటే ప్రాచీన మార్గాలన్నీ ఈ శరీరానికి కష్టాన్ని కలిగించేవి అని. అందుకే ఈ శరీరానికి ఏ విధమైన కష్టమూ లేకుండా- సంసార జీవితయాత్ర సాగిస్తూనే ప్రాచీన మార్గాల ద్వారా పొందలేని ఎటర్నటీని అంటే శాశ్వతత్వాన్ని జాతి, మత, కుల, విచక్షణ లేకుండా మానవులంతా ఈ శరీరానికే సంపాదించడానికై షార్టుకట్ రూటులో ఈ యోగాన్ని ఆరిజన్ తయారు చేయడం జరిగింది అని.

అతి ముఖ్యమైన విషయ మేమంటే ప్రాచీన మార్గాలు అన్నీ ఒక వ్యక్తి ఉన్నతిని పొందడానికై ఏర్పాటు అయినవి. అయితే ఈ యోగం మానవజాతికంతటికీ ఉన్నతిని సంపాదించి పెట్టడానికై ఏర్పాటు అయినది అని.

షార్టుకట్ రూటులో ఏ విధమైన శ్రమా పడకుండా మాస్టరుగారు అణిమ- లఘిమ- గరిమ దీనినే యతకామాన కాయత్వ మంటారు అనే మహిమలు సంపాదించినారు.

అణిమ- లఘిమ- మహిమ- ప్రాప్తి- ప్రాకామ్యం- వశత్వం- ఈశత్వం- గరిమ అనే యతకామాన కాయత్వము అనేవి అష్టసిద్ధులు. ఇవి యోగం ద్వారా లభించేవి.

1. అణిమ- దీనిని సంపాదించడము వలన స్థూల శరీరముగల వ్యక్తి. సూక్ష్మాకారాన్ని పొంది ఎక్కడికి కావలిస్తే అక్కడికి ఎప్పుడు కావలిస్తే అప్పుడు పోయే శక్తిని కలిగి ఉంటాడు.

2. లఘిమ- దీనిని సంపాదించడము వలన స్థూల

శరీరము కలిగిన వ్యక్తి దూదిపింజవలె ఆకాశమునకు ఎగిరే శక్తిని కలిగి ఉంటాడు.

3. మహిమ- దీనిని సంపాదించడము వలన శరీరము నాగనగ పర్యంతము (అంటే ఐరావత పర్వతము కాబోలు) పెరిగే శక్తిని కలిగి ఉంటాడు.

4. గరిమ- అనే యంతకావహాన కాయంత్వమును సంపాదించడము వలన సత్యసంకల్పాన్ని కలిగి ఉంటాడు; అన్ని భూతాల స్వరూపాలను మార్చగల శక్తిని కలిగి ఉంటాడు; విషాన్ని తినిపించి విషం తిన్నవాడు చావకుండా ఉండేటట్లు చేయగలుగుతాడు; విషంలోగల ప్రాణాన్ని తీసే శక్తిని పోగొట్టి దాని స్థానంలో ప్రాణాన్ని కాపాడే శక్తిని ప్రవేశింపజేయగల శక్తిని కలిగి ఉంటాడు. (చూ. పతంజలి యోగసూత్రాలు విభూతిపాదం).

ఈ నాలుగు మహిమలు మాస్టరుగారికి ఉన్నాయి కాబట్టే చావును తప్పించాలి అనే ప్రయత్నం చేసినట్లు ఉన్నారు.

మాస్టరుగారు ఫస్టు గ్రూపు అని ఏర్పాటు చేసిన వాళ్లు-వాళ్లు ఎంతవరకు పూర్వజన్మలలో ఎదిగినారో తెలుస్తుంది.

1. శ్రీ టి. హబిలయ్య, ఈయన 22-6-1912 వ తేదీన ఈ యోగంలో చేరినారు. 27-7-1912 నుండి నిత్యమూ మాస్టరుగారితో ప్రాక్టీసు చేసినారు. కానీ ఎందుచేతనో మీడియముల లిస్టులో ఈయన పేరులేదు. కారణము తెలియదు. శ్రీమతి వెంకమ్మగారిని తీసివేసి ఫస్టు లిస్టులో ఈయనను చేర్చినారు. ఈయన వాగీశ ఋషి అంశ (అంటే బృహస్పతి) అన్నారు.

2. శ్రీ సి.ఎ. శంకర శాస్త్రిగారు మీడియం నెం.12, పత్యేయ ఋషి అంశ అన్నారు.

3. శ్రీ బి.ఎస్. కృష్ణమూర్తిగారు మీడియం నెం.19, గార్గ్య ఋషి అంశ అన్నారు.

4. శ్రీ సి. రాధాకృష్ణ పిళ్లె గారు మీడియం నెం.26, కణాద ఋషి అంశ అన్నారు.

ఈ నలుగురు ఋషి పర్యంతము ఎదిగిన వారు అన్నారు.

5. శ్రీ వి. రామచంద్రయ్యర్‌పగారు మీడియం నెం.11, లఖితముని అంశ అన్నారు.

ఈయన ముని పర్యంతము ఎదిగిన వారు అన్నారు. ఋషి కంటే పై మెట్టు మునిది. అంతవరకు ఎదిగినవారు అన్నారు మాస్టరుగారు. (చూ డైరి పుట 13, తేది 29-9-1912).

పూర్వజన్మలలో ఎంతవరకు డెవలప్ అయినారో దివ్యదృష్టితో పరికించి బాగా డెవలప్ అయినవారిని ఫస్టు గ్రూపు అని ఏర్పాటు చేసినట్లు దీనివలన మనం తెలుసుకోవచ్చును.

పై విషయాలను బట్టి అందరిలోకి యోగి గొప్పవాడు అంటారు.

నేనేమంటాను అంటే ప్రాచీన యోగులు అందరికంటే భృక్తరహిత తారకరాజయోగమార్గాన్ని అంటే మాస్టరు సి.వి.వి. గారి యోగాన్ని వారి రూల్సు, రెగ్యులేషన్సు, సూచనలు తు.చ. తప్పకుండా పాటిస్తూ ప్రార్థన చేస్తూ అంతరాత్మ పరిశీలన చేసేవాళ్లు గొప్పవాళ్లు అంటాను.

**17 వ ప్రశ్న:- మాస్టరుగారికీ థియోసాఫికల్ సొసైటీకి సంబంధం ఉంది అంటారు కదా మీరు; ఎవరెవరితో పరిచయం ఉందో మీకు తెలిస్తే కొంచం చెప్పండి సార్?**

అడిగినవారు:- చి॥సౌ॥ డాక్టర్ కె. శాయిలక్ష్మి, న్యూజర్సి, యు.యస్.ఎ.

సమాధానము:- మాస్టరుగారికి థియొసాఫికల్ సొసైటీలో అనీబిసెంట్; సి.డబ్ల్యు. లెడ్‌బీటర్; కూట్‌హూమిలాల్ సింగ్ ఈయన్నే కె.హెచ్. అంటారు; టి. సుబ్బారావుగారు; రావు సాహెబ్ గ్రంథి. సుబ్బయ్య శెట్టిగారు; శ్రీ వి.వి. చారిగారు; శ్రీ శ్రీనివాసన్ గారలతో సన్నిహిత సంబంధం ఉన్నట్లు తెలుస్తూంది. (చూ. ఎస్. ఎస్. సంపు. 1, పుట 9).

ఎమ్.టి.ఎ. ఒకచోట ఇట్లా చెప్పింది-

"నీవు ఎవరు? నీవు ఎందుకు జన్మించినావు? అనే విషయాలు తెలియకుండానే నీ భార్య ద్వారా అనీబిసెంటు నీకు కావలసిన విషయాలు తెలియ జేస్తూంది" అని. (చూ. ఎస్. ఎస్. సం.1 పుట 51).

దీనిని బట్టి వెంకమ్మగారి ఆస్ట్రల్‌ద్వారా అనీబిసెంట్ ఆస్ట్రలుతో మాట్లాడించినట్లు తెలుస్తూంది కదూ!

సి.డబ్ల్యు. లెడ్‌బీటరు మెంటల్ ప్లేన్ వరకు ఎదిగినవాడు. న్యాయంగా ఇతడే థియొసాఫికల్ సొసైటీకి ప్యూర్ మాస్టరుగా ఉండవలసినవాడు. అయితే విచిత్రమైన పరిస్థితులలో కె.హెచ్. అనీబిసెంటును ఇన్‌టలక్‌చ్యుయల్ హెడ్‌గా నియమించినారు. వీళ్లిద్దరూ మాస్టరుగారికి సలహాలు ఇస్తూ ఉండినట్లు తెలుస్తూంది. (చూ. ఎస్. ఎస్. సంపు 2 పుట 9).

ఆ సలహాలు ఎట్లా వస్తున్నాయి అని ఎమ్.టి.ఎ. మాస్టరు గారికి చెప్పినారో వినండి-

"మాస్టరుగారు నివసించే రూములో "ఆరా" అంటే ఒక దివ్యమైన శక్తి ఉన్నది. ఆ శక్తి ఒక కొళాయి పైపులాగా పనిచేస్తుంది. దీనిద్వారా ఏ దేశాన్నుండి అయినా; ఏ లోకాన్నుండి అయినా -

విషయాన్నైనా సేకరించడానికి మాస్టరుకు శక్తి ఉంది. ఆ సేకరించే విషయాలు ఇతరులెవ్వరూ తెలుసుకోవడానికి సాధ్యము కాని స్థితిలో ఉంటుంది" అని. (చూ. ఎస్. ఎస్. సంపు 2 పుట 10).

ఇంకొకచోట ఎమ్.టి.ఎ.-

"ఆస్ట్రల్‌ద్వారా నీకు సలహాలు ఇచ్చేటప్పడు ఆనీబిసెంటుకు హోర్టుపెయిన్ వస్తుంది. ఆమె దానితో బాధపడుతూ ఉంటుంది. ఆమెను నీవు ట్రాన్సుకు పంపి; ట్రీట్‌చేసి ఆమె బాధ తగ్గించు. అప్పడు ఆమెకు నీమీదా- ఈ యోగం మీదా విశ్వాసం ఏర్పడుతుంది. ఆమె ద్వారా నీకు కావలసిన పనిని నీవు ఈ రోజే పూర్తి చేసుకో" అని చెప్పింది. (చూ. ఎస్. ఎస్. సంపు 2 పుట 45).

ఇంకొకచోట ఎమ్.టి.ఎ.-

"థియోసాఫికల్ సొసైటివాళ్లు మెడిటేషన్ అంటే ధ్యానము మాత్రమే చేస్తున్నారు. అయితే వారికి ఈ శరీరంలో జరిగే ఆక్షన్‌గాని అంటే సంచలనాలు; డెవలప్‌మెంట్సు అంటే ఆధ్యాత్మిక అభివృద్ధిగాని తెలియడము లేదు" అన్నారు. (చూ. ఎస్. ఎస్. సంపు 4, పుట 116).

ఆనీబిసెంటు గురువు ఆమెకు ఇట్లా చెప్పినారట-

"ఒక మహాపురుషుని వలన ప్రపంచమంతా బాగు పడుతుంది" అని. అందుకని ఆమె ఆ మహాపురుషునికి స్వాగతం పలుకడానికి అని "తారక సంఘము" అనే సంస్థను 11-1-1911వ సంవత్సరంలో ఏర్పాటుచేసి దాని హెడ్ ఆఫీసును కాశీలో ఏర్పాటు చేసింది. ప్రపంచంలో అన్నిచోట్ల ఆ మహా పురుషునికి ఎదుర్కోలు చెప్పడానికి శిష్యులను ఏర్పాటు చేసింది.

తారకసంఘానికి శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారిని అధ్యక్షులుగా చేసింది. ఆయన్ను అధ్యక్షులుగా చేసిందేకాని ఆయన అందులో ఎన్నో రోజులు ఉండలేదు. అనీబిసెంటు ఆస్ట్రల్ ద్వారా మాస్టరుగారికి సూచనలు ఇవ్వడానికీ దీనికీ ఏదైనా సంబంధం ఉన్నదేమో చూడాలి.

ఇందులో పేర్కొన్న వాళ్లందరూ కానీ- కొందరు కానీ మాస్టరుగారి యోగంలో మీడియములు అనే సందేహం నాకు ఉంది.

మాస్టరుగారి కాలంలో ఇండియాలో వైస్‌రాయిగా ఉన్నతను బ్రిటీష్ ప్రభుత్వానికి క్రింది విధంగా వ్రాసినాడు-

"భారతదేశంలో ఆధ్యాత్మిక విద్యద్వారా అద్భుతాలు సృష్టిస్తున్నారు- కొన్నాళ్లకు డెత్‌ను (అంటే చావును) అరికట్టాలి అనే ప్రయత్నాలు చేస్తున్నారు. ప్రయత్నాలు ఫలించేటట్లు ఉన్నాయి. ఇది దక్షిణభారతదేశంలో జరిగేటట్లు తెలుస్తూంది" అని.

11-1-1917 వ తేదీన ఎలిజబెత్ షార్ప్ మీడియము నెం.587 గా ఈ యోగంలో చేరింది. ఆ చేరేటప్పుడు ఆమె వ్రాసి ఇచ్చిన డిక్లరేషన్ ఫారంలో స్వదస్తూరీతో-

"భగవంతుని సహాయంతో ఈ రక్తమాంసాదులతో కూడిన మానవ శరీరము శాశ్వతముగా నిలుస్తుంది. అంటే చావు "డెత్" ఉండదు అనే విషయాన్ని నేను తెలుసుకొని ఇందులో చేరుతున్నాను" అని. (చూ డైరీ. ఉపో. పుట 33). వ్రాసింది.

ఆమె ఆ విధంగా వ్రాయడంచేత ఆనాటి వైస్‌రాయి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్రాసి ఉంటాడని నేను ఊహిస్తున్నాను.

**18వ ప్రశ్న:- అందరూ మాస్టరుగారు యోగాని కని మేడం హెచ్.పి. బ్లావెట్స్కీని వెంకమ్మగారుగా పుట్టించి పెండ్లి చేసుకొన్నారు అంటున్నారు కదా? మరి మీరు ఏమంటారు సార్?**

అడిగినవారు:- చి॥ జె. లీలాకుమార్, తిరుమల.

సమాధానము:- ఇది శుద్ధ తెలివి తక్కువ మాట. అదిగో పులి అంటే ఇదిగో తోక అన్న సామెతగా ఉంది ఇది. ఈ గందరగోళమంతా శ్రీ గురుతుల్యులు ఎన్.ఆర్.బి. వెంకటాచలం గారు చదివిన కాకాభుజండరు నాడీ గ్రంథం వలన వచ్చింది.

మేడం హెలీనా పెట్రోవినా బ్లావెట్స్కీని గూర్చి, ఆమె వ్రాసిన పుస్తకాలను గూర్చి మహాత్మా ఎమ్.టి.ఎ. ద్వారా మాస్టరు గారికి ఏమి చెప్పినారో వినండి-

"నిజమైన సత్యాన్ని తెలుసుకోవడానికీ, తెలుసుకొనిన దానిని ఎట్లా ఉపయోగించాలి, ఎక్కడ ఉపయోగించాలి, ఎప్పుడు ఉపయోగించాలి అనేదానికి కూడా కొంచం కామన్‌సెన్సు అంటే ఇంగిత జ్ఞానం ఉండాలి. ఈ ఇంగిత జ్ఞానం లేకుండా, సత్యం యొక్క విలువ తెలియకుండా, లోతు తెలియకుండా, చెత్తబుట్టలో చెత్తపడవేసినట్లు మనిషి కనిపించగానే వాడినెత్తిన రుద్దుతున్నారు. సత్యం ఎప్పడూ మానవులను విరోధింపజేయదు. సత్యం మానవులంతా అన్యోన్యంగా కలిసిమెలిసి జీవించేదానికి సహాయ పడుతుంది, ఇతరులకు అపకారాన్ని కలిగించదు. ఈ సత్యాన్ని తెలుసుకోవడానికి ఉదారమైన, ఉన్నతమైన భావాలు కావాలి. ఎవరైనా అడిగినప్పడు సరియైన సలహాలు ఇచ్చే స్థితిలో ఉండాలి. కొంతమందిని చూస్తే వాళ్లకున్న యోగ్యత ఏమిటో తెలుసు కోకుండా, ఏవిధమైన శ్రమా పడకుండా, హద్దుమీరి ఇతరులకు

సలహాలు ఇస్తున్నారు. పై విషయాలు హెచ్.పి.బి. అంటే హెలీనా పెట్రోవినా బ్లావెట్స్కీని గూర్చి చెప్పినాను. కొంతమంది ఆమె ఏదో ఉన్నతమైన స్థితిలో ఉంది అని చెప్పడంచేత నేను ఈ విషయాలు వ్రాయవలసి వచ్చింది. వ్రాయవలసి వచ్చిందే అని చింతిస్తున్నాను' ' అని (చూ.పి.పి. సంపు.3 పుటలు 2, 3).

హెచ్.పి.బి. ని గూర్చి యమ్.టి.ఎ. ఎంత హేళనగా చెప్పినారో విన్నారు కదా?

హెచ్.పి.బి. ని మాస్టరుగారు చూడలేదు. కారణాలు వినండి-

మేడం బ్లావెట్స్కీ 21-12-1884 లో కడసారి మదరాసు వచ్చింది. చాలా జబ్బులో పడింది. 31-3-1885 న ఇండియా వదలి వెళ్లింది. అంటే మూడు నెలల పదిరోజులు మాత్రం ఉండినది.

మాస్టరుగారు 4-8-1864 లో పుట్టినారు. మేడం బ్లావెట్స్కీ ఇండియా వదలి వెళ్లేటప్పటికి మాస్టరుగారి వయస్సు పదహారు సంవత్సరాల ఏడునెలల ఇరవై ఏడు రోజులు మాత్రం.

అనిబిసెంటును, సి.డబ్ల్యు. లెడ్‌బీటరును, కూట్‌హూమిలాల్ సింగును, టి. సుబ్బారావును, రావుసాహెబ్. గ్రంథి సుబ్బయ్య శెట్టిని, వి.వి.చారిని, శ్రీనివాసన్ (వగైరాలంతా థీసాఫికల్ సొసైటీ వాళ్లే). వీళ్లనందరినీ పేర్కొన్న మాస్టరుగారు బ్లావెట్స్కీని చూచివుంటే ఎందుకు పేర్కొనలేదు? అందుచేత మాస్టరుగారు బ్లావెట్స్కీని చూడలేదు. కలవనూ లేదు. ఇవన్నీ నాడీకారుని కల్పితాలే.

వీళ్లంతా మాస్టరుగారు సత్యాన్ని కప్పిపుచ్చి వ్రాసినారు అని అనుకొంటున్నట్లున్నారు. అట్లా అనుకొనే వాళ్లంతా సత్యం మీదా, మాస్టరు మీదా, మాస్టరు యోగం మీదా నమ్మకం లేనివాళ్లై ఉండాలి.

**ఈ యోగాన్ని గూర్చిన పరిజ్ఞానం కొంచంకూడా లేని వీళ్లు**

ఏమైనా చెప్పవచ్చు. ఏమైనా వ్రాయవచ్చు. వీళ్ల మాటలు నమ్మి మోసపోకండి.

యమ్.టి.ఎ. ఒకచోట ఇలా చెప్పింది-

"మాస్టరు హయ్యర్‌సోర్సు నుండి జన్మించినారు. ట్రాన్సు మీడియములు వగైరాలంతా ప్లానిటరీ రీజన్ నుండి అంటే నవగ్రహాల ప్రభావము వల్ల పుట్టినారు" అని (చూ.డైరి.పుట.11)

వీటన్నింటినీ బట్టి మాస్టరు వెంకమ్మను పుట్టించినారు అనేది అసత్యమని తేలింది కదా! వెంకమ్మగారి వల్లనే యోగం చెడింది అని ఇంతకు ముందే చెప్పినాను జ్ఞాపకం ఉంది అనుకొంటాను.

**19వ ప్రశ్న!- అడ్జస్టుమెంట్సనీ, న్యూ అడ్జస్టుమెంట్సనీ, స్పెషల్ అడ్జస్టుమెంట్సనీ, కోర్సులనీ, రెగ్యులేషన్సనీ రకరకాల పేర్లతో డైరీలలో చాలా ఉన్నాయి. వీటిని గురించి ఏమైనా చెప్పండి?**

అడిగినవారు :- డా. పి. కృష్ణమోహన రెడ్డి, యమ్.ఎ., పి.హెచ్.డి., చంద్రగిరి.

సమాధానము:- తను ఏర్పాటు చేసుకొన్న మార్గానికి అనుగుణంగా యోగంలో చేరినవాళ్లను అభివృద్ధి పరచుకొని, త్వరలో ఈ యోగం ద్వారా ఎటర్నటీని స్థాపించాలనే సంకల్పంతో ఈ విధమైన అడ్జస్టుమెంట్సు, కోర్సులు వగైరాలు ఇచ్చినట్లు తెలుస్తూంది.

అడ్జస్టుమెంటు అంటే - ఒక మీడియము యొక్క పూర్వజన్మ కర్మ అతని అభివృద్ధికి అడ్డుతగిలినప్పడు దానిని తక్షణం తొలగించి అతనిని అభివృద్ధి పరచడానికి ఇచ్చేది అడ్జస్టుమెంటు అంటారు.

న్యూ అడ్జస్టుమెంటు అంటే - ఒక అడ్జస్టుమెంటు ఇచ్చినారు. అది పనిచేయలేదు, మరలా ఒక కొత్త అడ్జస్టుమెంటు ద్వారా అతనిని

అభివృద్ధి పరచడానికి ఇచ్చే అడ్జస్టుమెంటును న్యూ అడ్జస్టుమెంటు అంటారు.

స్పెషల్ అడ్జస్టుమెంట్ అంటే - ఈ రెండు అడ్జస్టుమెంట్సు వల్లా అతనిని అభివృద్ధి పరచడానికి వీలుకానప్పడు స్పెషల్ అడ్జస్టుమెంట్ ఇచ్చి అతనిని అభివృద్ధి పరచినట్లున్నారు. ఇదే స్పెషల్ అడ్జస్టుమెంట్.

ఇవి కాకుండా ఆనాటి మీడియములకు సెవెన్ అడ్జస్టుమెంట్సు అనీ ఇంకా కొన్ని ఇచ్చినారు. అందులో బ్రీతింగ్, బోరింగ్, కెమికల్ అడ్జస్టుమెంట్సు అనేవి అతి ముఖ్యమైనవి. ఎందుకంటే మానవునిలో బ్రీతింగ్ అనేది ప్రతి 45 రోజులకు ఒకసారి మారిపోతుంది అన్నారు యమ్.టి.ఎ. ఆ బ్రీతింగే ఎటర్నటీకి శాశ్వతత్వానికి పునాదిరాయి. దానిని చక్కదిద్దడానికే ప్రతిరోజు మీడియములు వాటిని చేయాలన్నారు. అందులో కెమికల్ అన్నారు- అంటే రసాయన పదార్థాలు. మానవ శరీరంలో వుండే రసాయన పదార్థాలు అభివృద్ధి చెందినప్పడే రోగాలు లేకుండా మానవుడు ఎటర్నల్‌గా అంటే శాశ్వతంగా నిలవగలడు. అందుకే బయోకెమిస్ట్రీ అంటే జీవరసాయనశాస్త్రాన్ని చదవమన్నారు ఈ యోగంలో చేరేవాళ్లను, చేరిన వాళ్లనూ కూడా.

అడ్జస్టుమెంటు అంటే ఉన్నది చాలనప్పడు వేరే మార్గం ద్వారా దానిని చక్కదిద్దడము అని అనుకొంటాను.

ఉదాః- మిలిటరీ వెళ్లుతూ ఉంటుంది. మధ్యలో పెద్దనది అడ్డువస్తుంది. అప్పడు తాత్కాలికంగా ఒక బ్రిడ్జిని ఏర్పాటుచేసుకొని ఆ నదిని దాటి వెళ్లుతుంది. అట్లాగే ఈ మీడియములకు కూడా పూర్వజన్మకర్మలు అడ్డువచ్చినప్పడు రకరకాల అడ్జస్టుమెంట్సు ఇచ్చి

మీడియములను పైపై అంతస్థులకు అభివృద్ధి పరచి కొనిపోయినారు.

**19(ఎ) ప్రశ్న:- మాస్టరుగారికి పూర్వజన్మ కర్మలేదు అన్నారు కదా? మరి మాస్టర్సు అడ్జస్టుమెంట్సు, మాస్టర్సు ఓన్ అడ్జస్టుమెంట్సు ఎందుకు చేసినారు? మీడియముల వద్ద ఎందుకు చేయించినారు?**

అడిగినవారు :- కృష్ణమోహన్ గారే

సమాధానము :- మాస్టరు హయ్యర్ సోర్సు నుండి వచ్చినారు కాబట్టి ఆయన కర్మ అనుభవించవలసిన పనిలేదు". "ఒకరికి ట్రీట్ చేసేటప్పడు వాడి కర్మ ఆ ట్రీట్‌చేసేవాడిని బాధిస్తుంది అని ఒక చోట యమ్.టి.ఎ. చెప్పినారు. 751 మంది మీడియములను అభివృద్ధి పరచడానికి సంకల్పించినారు కాబట్టి అందరికర్మలూ మాస్టరుగారు అనుభవించి తీరాలసిందే. అది ఆయన అభివృద్ధికి అడ్డువస్తుంది" (చూ.ఎస్.ఎస్. సం. 2 పుట. 73). అప్పడు మీడియములకు ఇచ్చిన అడ్జస్టుమెంట్సు కాకుండా ప్రత్యేకంగా మాస్టర్సు అడ్జస్టుమెంట్ అనీ, మాస్టర్సు ఓన్ అడ్జస్టుమెంట్సనీ ఇస్తే ఆయనగారు చేసినారు, మీడియములవద్దా చేయించినారు.

కోర్సులు అనేవి ఒక నియమితమైన కాలానికి సంబంధించినవి. ఇన్ని రోజులు చేయాలి అనే నిర్ణయంతో చేసినట్లు తెలుస్తోంది డైరీలు చూస్తే. కోర్సులు అనేవి చాలా రకాలుగా ఉన్నాయి.

అందులో కొన్నింటిని చెప్తాను వినండి. కె కోర్సు, మైండు కోర్సు, డ్రాప్ కోర్సు, సింబల్‌లైట్ కోర్సు, కామెట్ కోర్సు అనేవాటిని చాలా ముందుగానే చేసినట్లు తెలుస్తోంది. వీటి తరువాత ఆరి, సింపుల్, అర్, న్యూ అడ్జస్టుమెంట్ కోర్సు, ఎక్లిప్సు కోర్సు, స్పెషల్ ఎక్లిప్సు

కోర్సు, న్యూమంత్లి కోర్సు, స్పెషల్ కోర్సు, సిగ్నార్ కోర్సు, మెర్చరి కోర్సు, సెవెన్ ఇయర్సు న్యూకోర్సు, న్యూకోర్సు (P.N.T.. న్యూ కోర్సు, M. కోర్సు, T. కోర్సు, స్పెషల్ ప్రిపరేటరి కోర్సు (దీనినే ట్రైనింగ్ కోర్సు అంటారు) ఇది ఏడు రకాలు, ఆర్డర్ కోర్సు, టెస్టు కోర్సు ఇంకా ఇంకా ఎన్నో రకాలైన కోర్సులు చేసినట్లు తెలుస్తూంది. (చూ.డెయిరి పుట 37)

అయితే ఈ కోర్సులు అన్నీ అందరికీ ఇచ్చి చేయించలేదు. "వారి వారి డెవలప్‌మెంట్‌ను చూచి వాళ్ల అభివృద్ధికి తగిన విధంగా ఇస్తున్నాను" అన్నారు యమ్.టి.ఎ. ఇందులో కొన్ని -కోర్సులు "కుంభకోణం యోగాస్కూల్లో మాస్టరుగారి సమక్షంలో, ఆయనగారి పర్యవేక్షణలోనే చేయాలి" అని కూడా చెప్పబడి ఉన్నది.

ఉదాహరణము- ఒక రోగి వైద్యుని దగ్గరకు వెళ్లుతాడు. వైద్యుడు రోగిని పరీక్షించి ఏదో ఒక మందు పదిరోజులు తీసుకొని తిరిగి వస్తే మరల పరీక్షించి మందు ఇస్తాను అంటాడు. ఆ పది రోజులు మందు తీసుకొని రోగి మరలా వైద్యుని దగ్గరకు వెళ్లితే పరీక్షించి రోగం ఎంతవరకు తగ్గుముఖం పట్టింతో తెలుసుకొని మందు మార్చి ఇవ్వాలి అంటే మందు మార్చి ఇచ్చి ఆరోగి ఆరోగ్యాభివృద్ధికి సహాయపడుతాడు. అట్లాగే మాస్టరుగారు కూడా M.T.A. తో సంప్రదించి వారివారి ఆరోగ్యాభివృద్ధికి యోగాభివృద్ధికి తగిన విధంగా కోర్సులు వగైరాలు మార్చి, మార్చి ఇచ్చినట్లు డైరీలు చూస్తే తెలుస్తూంది. మీరూ చూడండి.

రెగ్యులేషన్సుకూడా చాలారకాలు ఉన్నట్లు తెలుస్తూంది. గ్రహారెగ్యులేషన్సు, నక్షత్రరెగ్యులేషన్సు, గాడ్సు రెగ్యులేషన్సు, డే రెగ్యులేషన్సు, అవర్సు రెగ్యులేషన్సు, మినిట్సు రెగ్యులేషన్సు, సెకెండ్సు రెగ్యులేషన్సు వగైరా వగైరాలు.

ఉదాః- జనం తొక్కిసలాడుతూ ఉంటారు, పోలీసులు వచ్చి అందరినీ క్రమబద్ధంగా నడిపిస్తారు. ఇదే రెగ్యులేట్ చేయడం అంటే దేవతలు, గ్రహాలు వగైరాలు వాళ్ల ఇష్టప్రకారం నడుస్తుంటే ఈ యోగమార్గానికి అనుకూలంగా వారిని నడిపించడానికి ఈ రెగ్యులేషన్స్ ఏర్పాటుచేసినట్లు తెలుస్తూంది డైరీలు చూస్తే.

మనమెక్కడున్నామో మనకే తెలియని స్థితిలో ఉంటే మనమంతా ఇవన్నీ చేస్తే ఒరిగేదేమీ లేదు.

**20 వ ప్రశ్నః- గ్రూపులనీ, సెక్షన్‌లనీ, లింక్సనీ, సెలక్షన్‌లనీ ఏవేవో పదాలు డైరీలలో కనిపిస్తున్నాయి కదా! అట్లా ఎందుకు ఏర్పాటు చేసినారో చెప్పగలరా?**

అడిగినవారుః- చి॥సౌ॥ నిర్మల, ఒంటిల్లు.

సమాధానముః- మాస్టరుగారు జనరల్ కాల్సులో తప్ప మిగతా రోజులలో అందరు మీడియములనూ ఒకేచోట కూర్చోపెట్టనూ లేదు. అందరికీ అన్ని కోర్సులూ ఇవ్వనూ లేదు అని ఇంతకుముందే చెప్పినాను.

కొంతమందిని ఫస్టుగ్రూపనీ, కొంతమందిని సెకెండ్ గ్రూపనీ, కొంతమందిని థర్డుగ్రూపనీ ఎన్నోరకాలుగా విభజించినారు. ఈ విభజన అంతా ఆ మీడియములు పూర్వజన్మలో పొందిన అభివృద్ధినీ, ఈ జన్మలో పొందిన అభివృద్ధినీ లెక్కవేసి యమ్.టి.ఎ. చెప్పినట్లుగా గ్రూపులుగా ఏర్పాటు చేసినట్లు డైరీల ద్వారా తెలుస్తూంది.

ఇందులో ఫస్టు గ్రూపులోని ఏడుమందిని అంటే-

1. మాస్టరు సి.వి.వి. మీడియం నెంబరు 1
2. శ్రీ వి. రామచంద్ర అయ్యరు మీ. నెం. 11
3. శ్రీ సి. రాధాకృష్ణపిళ్లై మీ. నెం. 26

4. శ్రీ టి. హబిలయ్య. ఇతని సంగతి తరువాత చెప్తా ం.
5. శ్రీ బి.యస్. కృష్ణమూర్తి మీ.నెం. 19
6. శ్రీ సి.ఆర్. శ్రీనివాస అయ్యంగారు మీ.నెం. 38
7. శ్రీ ఆర్. రాజారావు మీ.నెం. 8

ఈ ఏడుమందిని కలిపి "ఆస్ట్రోగ్రూప్" అని పేరు పెట్టి, కొంతకాలానికి వీరినే అభివృద్ధి పరచి ఉన్నతమైన స్థితికి తీసుకొని వచ్చి "ఆరిజోనా గ్రూపు" అని పిలిచినారు. (చూ.డైరి.పుట37) ఆస్ట్రో గ్రూపు అని పేరు పెట్టడములోని ఉద్దేశ్యం ఫస్టుగ్రూపు వాళ్లందరూ డెవలప్ కావాలనీ అందరూ థాట్ ఇచ్చి ఏకాభిప్రాయంతో సాధన కొనసాగించాలని (చూ.డైరి.పుట.12).

యమ్.టి.ఎ. ఇట్లా చెప్పింది-

"ఈ ఫస్టు గ్రూపు వాళ్లు ఉదయము సాయంత్రము తప్పకుండా ప్రార్థన చేయాలి. ప్రతి శుక్రవారము తప్పకుండా యోగాలయానికి రావాలి. వచ్చినప్పడు ఈ వారంలో తమకు కలిగిన యోగానుభవాలను మాస్టరుకు విన్నవించాలి. అప్పడు మాస్టరు దివ్యచక్షువుతో పరికించి వారి అభివృద్ధికి ఏదైనా అడ్డువచ్చేటట్లు మాస్టరు గమనిస్తే దాన్ని అధిగమించడానికి టెంపరరి అడ్జస్టుమెంట్లు ఇస్తారు. ఆ అడ్జస్టుమెంట్లు యోగా స్కూల్లోనే ప్రాక్టీసుచేసి అభివృద్ధిని పొందాలి" అని (చూ.డైరి.పుట 37).

ఈ యోగాన్ని గూర్చి అన్ని విషయాలు అందరితో చర్చించరాదు. అందుకనే కొంతమందిని వాళ్ల అభివృద్ధినీ, వాళ్ల శ్రద్ధాభక్తులనూ, యోగరహస్యాలను కాపాడుతారు అనే నమ్మకం ఉండేవాళ్లనూ మాత్రం ఏరుకొని కొన్ని గ్రూపులుగా ఏర్పాటు చేసినారు అనే విషయం డైరీలు చూస్తే తెలుస్తుంది.

ఇన్నర్ సెక్షననీ, ఔటర్ సెక్షననీ, ఈసటోరిక్ సెక్షననీ, యూనివర్సల్ బ్రదర్‌హుడ్ సెక్షననీ, ఈ యోగానికి ప్రత్యేకంగా బ్రదర్‌హుడ్ సెక్షననీ ఐదు రకాలుగా విభజించినారు. (చూ.ఎస్. ఎస్. సంపు 4 పుట 51, 61, 62, 74).

మరలా ఆ ఇన్నర్ సెక్షన్ రెండు రకాలు అన్నారు. ఒకటి ఇన్నర్ సెక్షన్, రెండవది ఇన్నర్ సెక్షన్ సబ్‌డివిజన్. అని (చూ.డైరి. పుట. 26)

ఇన్నర్ సెక్షన్‌కు నలుగురిని ఎన్నుకొన్నారు.

1. మాస్టరు సి.వి.వి.
2. వి. రామచంద్ర అయ్యర్
3. సి. రాధాకృష్ణ పిళ్లై
4. వి. సుందరేశ అయ్యర్. మీడియం నెం. 29.

ఈ సుందరేశ అయ్యర్ గారు ఫస్టు గ్రూపులో లేరు. అయినా ఇన్నర్ సెక్షన్‌కు సెలక్టు చేసినారు.

ఇన్నర్ సెక్షన్ సబ్‌డివిజనుకు ముగ్గురిని ఎన్నుకొన్నారు.

1. టి. హబిలయ్య
2. బి. యస్. కృష్ణమూర్తి
3. సి.ఎ. శంకరయ్యర్. మీడియం నెం. 12

ఈ సి.ఎ. శంకరయ్యర్ గారు ఫస్టు గ్రూపులో లేరు. అయినా ఇన్నర్‌సెక్షన్ సబ్‌డివిజన్‌కు ఎన్నుకొన్నారు.

వీళ్లుకూర్చుని వాళ్లు పొందిన డెవలప్‌మెంటును చర్చించుకొని మాస్టరుగారికి తెలియజేయాలి.

ఇట్లాగే బయటివూళ్ల వాళ్లకు కూడా సెక్షన్‌లు వగైరాలు ఏర్పాటుచేసినట్లు డైరీల వల్ల తెలుస్తూంది.

'W' సెట్ అనీ, 'F' సెట్ అనీ (చూ.డైరి.పుట.80) రెండింటిని పేర్కొన్నారు. 'W' సెట్ అంటే వీక్లీసెట్ వారానికి ఒకసారి ప్రార్థించేది అని కాబోలు. 'F' సెట్ అంటే ఫార్టునైట్‌సెట్ అని కాబోలు. అంటే పదిహేను రోజులకు ఒకసారి ప్రార్థించేది అనిగాని వారానికి గాని, పదిహేను రోజులకుగాని కలుసుకొనే సెట్టుగాని కావచ్చును. ఇది నా ఊహ మాత్రమే. సత్యము కావచ్చు. కాకపోవచ్చు.

మీడియములు వారు వారు పొందిన ఉన్నతిని పరిశీలించి ఆరిలింక్ అటాచ్‌మెంటనీ, మెర్కరీలింక్ అటాచ్ మెంటనీ, కె కోర్సులింక్ అటాచ్‌మెంటనీ, మాస్టర్సు లింక్ అటాచ్‌మెంటనీ, ఒలిడియర్ లింక్ అటాచ్‌మెంటనీ ఏవేవో లింకులు ఏర్పాటుచేసి అందులో వారిని కలిపినారు. ఉన్నతికి తగిన లింకులు ఇచ్చినారు.

తాను తలపెట్టిన ఎటర్నటి అనే మహత్కార్యం ఒక మహారథం వంటిది. దానిని ఈడవడానికి లావుపాటి మోకులు కట్టి ఈడవాలి. సమపాళ్లలో ఉన్నవాళ్లు రెండువైపులా సమంగాలాగితే అది ఒడుదుడుకులు లేకుండా నేరుగా పయనించి గమ్యస్థానం సురక్షితంగా చేరుతుంది. అందుకని లింకులంటూ ఇచ్చి మహారథాన్ని ఈడ్చినట్లు ఈ యోగాన్ని నడిపించినట్లు డైరీలవల్ల తెలుస్తుంది. (చూ.డైరి.పుట.43, 64, 70, 448)

సెలక్షన్ అని అడిగినారు కదా వినండి. సెలక్షన్ అంటే ఏది పనికివస్తుందో ఏది పనికిరాదో నిర్ణయించుకొని ఏరుకోవడం. ఈ యోగంలో చేరిన మీడియముల నందరినీ ఒకేమాదిరిగా కాకుండా వాళ్లు వాళ్లు పూర్వజన్మలలో పొందిన అభివృద్ధిని అనుసరించి చేర్చుకొని ఫలానావాడు ఫలానాకోర్సుకు పనికి వస్తాడు. వీడు పనికిరాడు, వీడిని ప్రొబేషనరుగా ఉంచి నేర్పితే పనికి వస్తాడు

అని దివ్యచక్షువుతో పరికించి, నిర్ణయించి చేర్చుకొన్నట్లు డైరీల ద్వారా తెలుస్తూంది. (చూ.డైరి.పుట 78, 79)

**21 వ ప్రశ్న :- సైట్సనీ, పాశ్వర్డనీ, ట్రాన్సులనీ, టెస్టులనీ డైరీలలో ఉన్నాయి. అవి ఎన్ని రకాలలో చెప్పండి వింటాము?**

అడిగినవారు :- శ్రీ టి.యస్. శివరావుగారు, బి.ఎస్.సి. బి.ఎల్. డిప్యూటిలీగల్ అడ్వైజర్, సి.బి.ఐ. మదరాసు.

సమాధానము :- ఈ యోగంలో చేరి అభివృద్ధి పొందిన వారికి 'సైట్' అంటే దివ్యచక్షువును ఇచ్చి ఈ ప్రపంచంలోను గ్రహగోళాలలోను, ఇతరత్రా ఈ యోగమాహాత్మ్యం వల్ల ఏమి జరుగుతూ ఉందో తెలుసుకోమని అన్నారు. దీనినే సైట్ అంటారు. ఇది తొమ్మిది రకాలు అన్నారు. (చూ.డైరి. పుట 364). ఆరింటిని మాత్రమే రికార్డు చేసియున్నారు. (చూ.డైరి.పుట.123)

మొదటిది - వర్సియాసైట్. దీనితో మనచూపు ఎంతవరకు సరిగా ఉన్నది పరీక్షించడము. మనముందున్న వస్తువులను పరీక్షించడము.

రెండవది - ఇగోస్టోన్‌సైట్. దీనితో వర్సియాసైట్ వల్ల సాధ్యం కాని వానిని పరీక్షించడము.

మూడవది - ఫిలోనియాసైట్. దీనితో మనముందున్న పక్షులనుగాని, జంతువులను గాని పరీక్షించడము. వాటి శరీరాంతర్భాగాలు ఎట్లా పనిచేస్తాయో గుర్తించడము.

నాల్గవది - విసిబ్లసైట్. ఇది మరలా నాలుగు రకాలు అందులో

4 (ఎ) నీళ్లలో నానపోసిన ధాన్యం ఆరుగంటల తరువాత ఎట్లా మొలక ఎత్తి పరిణామాన్ని పొందుతుందో గుర్తించడము

4 (బి) నానపోసిన ధాన్యంలో ఆస్ట్రల్ ఎలా పనిచేస్తుందో గుర్తించడం. ఇంకా మొలక భూమిలోపల నుండి శక్తిని ఎట్లా తీసుకొంటూందో గమనించడం.

4 (సి) ఆ తీసుకొన్న శక్తి మొలక పెరగడానికి ఎట్లా పనిచేస్తుందో గమనించడం, ఇంకా ఆకుల రంగు ఎట్లా మారు తుందో గమనించడము. ఈ ప్రక్రియలో కూడ ఆస్ట్రల్ ఎట్లా పనిచేస్తుందో బయటనుండి గమనించడము. ఈ మూడు మొలక భూమి మీదికి రావడానికి ముందటి పరిణామాలను తెలియజేసేవి.

4 (డి) మొలక భూమి మీదికి వచ్చిన తరువాత మొలక ఎట్లా పెరుగుతూ ఉందో తెలుసుకోవడము. ఇంకా ఎన్ని రకాలుగా మార్పు చెందుతూందో తెలుసుకోవడము.

ఐదవది - హెలివార్డ్సైట్ లేదా ఆస్ట్రల్ సపరేషన్ సైట్ ఇది రెండు రకాలు -

5 (ఎ) దూర ప్రదేశాలలోని విషయాలను దీనితో తెలుసు కోవడము. ఇంటిలో మనుష్యులు తిరగడాన్ని తెలుసుకోవడం. ముందురూములో ఉన్న మనిషిని గుర్తించడము మొదటి రకము.

5 (బి) సుదూర ప్రాంతాన్ని మనసులో ఎన్నుకొని దానిని చూచిరావడము.

ఇది మన ఆస్ట్రల్ ద్వారా జరిగే ప్రక్రియ.

ఆరవది - హింటింగ్ బోర్ సైట్. ఇది రెండు రకాలు -

6 (ఎ) దీనితో రహస్యంగా దాచి ఉంచిన వస్తువులను గుర్తించడము. ఒక కాగితముపై కొంత విషయాన్ని వ్రాసి ఆ కాగితాన్ని కవరులో పెట్టి మూసివేస్తే అందులోని విషయాన్ని చెప్పడం మొదటిది.

6 (బి) సంచిలో గాని, పెట్టెలోగాని, భూమిలో గాని దాచిన వస్తువు ఏది అని చెప్పడం రెండవది.

ఈ పై సైట్ల ద్వారా శరీరాంతర్భాగాలలో జరిగే మార్పులను గుర్తించి తప్పలు దిద్దుకొని పైపై అభివృద్ధిని పొందడము. (చూ.డైరి. పుట. 124).

పాశ్చర్సును గూర్చి అడిగినారు కదా అవి 25 రకాలుగా ఉంటాయి అన్నారు. ప్రార్థన చేసేటప్పడు కుండలినీ శక్తి ప్రారంభం కాగానే శరీరం ఎన్నో రకాలుగా వంగుతూ నాట్యకత్తె నాట్యంలో భంగిమలు చూపినట్లు భంగిమలు చూపుతుంది. విపరీతమైన ఆవలింతలు, తేనుపులు, కండ్లలో ముక్కులలో నీళ్లు కారడము, శరీరము తట్టుకోలేనంత సంచలనం ప్రారంభమవుతుంది. ఎట్లాగంటే సముద్రం దగ్గరకు వెళ్లినప్పడు భయంకరంగా అలలు, శబ్దాలు వస్తాయి. సముద్రం లోపలికి చాలా దూరం వెళ్లిన తరువాత అలలు శబ్దాలు ఉండవు. నిశ్శబ్దంగా ఉంటుంది. అట్లాగే ఈ శబ్దాలన్నీ తగ్గిన తరువాత ప్రశాంతమైన మనస్సుతో శరీరంలో జరిగే ప్రక్రియలను గమనిస్తే శరీరంలో జరిగే ఆక్షన్ తెలియవస్తుంది. ఇదంతా పూర్వజన్మకర్మ పోవడానికి జరిగే ప్రక్రియ అని డైరీలో చెప్పబడి ఉన్నది. ఇంకా ఒళ్లంతా నొప్పలు, ఎన్నో రకాలైన బాధలు శరీరంలో కనిపిస్తాయి అన్నారు (చూ.డైరి.పుట. 321, 412)

ట్రాన్సులనేవి మొత్తం 1899 ఉన్నాయనీ ప్రస్తుతము 7 మాత్రము పనిచేస్తున్నాయనీ చెప్పినారు. ఈ 1899లో ఒక్కొక్క మానవునికి ఒక్కొక్క రకమైన ట్రాన్సు పనిచేస్తుంది అని చెప్పినారు. అది మానవుడు చనిపోయే స్థితిలో ఉన్నప్పడు కనిపిస్తుంది అన్నారు (చూ.డైరి.పుట.298).

సైట్లు, టెస్టులు రెండూ దగ్గర దగ్గరగా ఒకటిగానే కనిపిస్తాయి. అయినా ఈ రెంటికీ చిన్న తేడా వున్నది.

సైట్ల ద్వారా అంటే ఆస్ట్రల్ ద్వారా మానవ శరీరానికి సంబంధించిన విషయాలూ; సంబంధము లేని విషయాలూ తెలుసుకోవచ్చు. పూర్వజన్మకు సంబంధించిన విషయాలు తెలుసుకోలేము.

టెస్టుల ద్వారా ఈ యోగంలో చేరడానికి ముందు మానవ శరీరంలో ఉన్న లోపాలను గుర్తించి వాటిని తొలగించడానికి అవసరమైన కోర్సులు, రెగ్యులేషన్సు ఇచ్చి శరీరములోని లోపాలు ఎంతవరకు తగ్గినాయో గుర్తించ వచ్చును. ఎంతవరకు అభివృద్ధి పొందినాయో గుర్తించడానికి ఉపయోగించినారు ఎమ్.టి.ఎ. ఈ రెండూ ఆస్ట్రల్ ద్వారానే జరుగుతూందన్నారు. (చూ. డైరి. పుటలు 25, 27, 51, 57, 119, 140).

**22 వ ప్రశ్న:- ఇనిసియేషన్‌కు వచ్చినవారిని మాస్టరుగారు కొన్ని వస్తువులు తెమ్మని చెప్పినారు కదా! ఎందుకని ఆ వస్తువులు తెమ్మన్నారో చెప్పగలరా?**

అడిగినవారు:- చి॥సౌ॥ ఏమ్. అన్నపూర్ణ, మ్యూజిక్ టీచర్, సెంట్రల్ స్కూళ్ళు, బెంగుళూరు.

సమాధానము:- ఈ క్రింది వస్తువులలో ఒక్కొక్క రకానికి ఒక్కటి వంతున వారికి తోచినది తెమ్మని చెప్పినట్లు డైరీలు చూస్తే తెలుస్తూంది. ఆ వస్తువులను ఆరు రకాలుగా విభజించినారు.

మొదటి రకములోనివి- టెంకాయ, వెలగ, దానిమ్మ, పనస, కిచ్చిలి. ఇందులో ఏదైనా ఒకటి.

రెండవ రకములోనివి- ప్రాణంతో ఉన్న పక్షులలో ఏ రంగుదైనా ఒకటి.

మూడవ రకము- రంగు రంగు పూలలో ఏదైనా ఒక రకములో ఒకటి.

నాలుగవ రకము- చిన్న మొక్కలలో మంచి రకము ఒకటి.

ఐదవ రకము- ఎన్నో రకాలైన గ్రుడ్లు ఉన్నాయి కదా! అందులో ఏ రకానిదైనా ఒకటి. చేపల రకాలలోకూడా ఏ రకము చేపైనా ఒకటి.

ఆరవ రకము- అనపగింజలు, గోధుమలు, వడ్లు, తెల్లటి ధాన్యము తినేవి, నాలుగు కాళ్ల జంతువు, తినే పండ్లు, కాయ గూరలు ఈ వస్తువులలో ధాన్యంలో ఒక రకము, జంతువులలో ఒక రకము, పండ్లలో ఒక రకము, కాయగూరలలో ఒక రకము (చూ డైరి పుట. 127). మీడియములు తెచ్చిన వస్తువుల ద్వారా ఆ తెచ్చిన వారి స్వరూప స్వభావాలు, మనోభావాలు, యోగానికి అర్హుడా, అనర్హుడా? ఇంతకు పూర్వపు జన్మలలోని ఇతని స్థితి వగైరాలు తెలుసుకోవడానికి తెప్పించినట్లు తెలుస్తూంది.

21-9-1919 వ తేదీన శ్రీ డి.కె. రామస్వామి అయ్యర్‌గారు మీడియం నెం.649 ఈ క్రింది వస్తువులు తెచ్చినారు.

1. రాగి మూడు ముక్కలు
2. వెండి రెండు అణాల బిళ్ల
3. మల్లెపూలు
4. అరటిపూవు
5. కొవ్వొత్తి (మైనపు వత్తి)
6. నేయి, టెంకాయ

ఇతనిని పరీక్షించి మార్క్సు లింక్ 5వ వీక్‌లో చేర్చినారు. మాస్టర్ సి.వి.వి. అనే బీజాక్షరాలతో ప్రార్థన చేయవలసిందని

తమ్ముళ్లను గూర్చి తెలిపినారు. అది ఇది-

"రామయ్య అతని తమ్ముళ్లు పూర్వజన్మలో హత్య చేసినారు. వాళ్లు పశువులకు ఆహారము పెట్టకపోవడంచేత అవి చనిపోయినాయి. అందువల్ల వారికి సంతానము లేదు. వారి కర్మ తొలగడానికి ప్రాణం తీసినారు కాబట్టి ఆ ప్రాణానికి సమానంగా అంటే బదులుగా ఒక డైమెండ్ (రవ పలచు) నెత్తురు శుభ్రము కావడానికి ఒక పగడము, నరాలకు బలము రావడానికి ఒక ముత్యము పెట్టాలి. ఇట్లా పన్నెండు రోజులు పెట్టాలి. కడపట ఒక ధోవతుల జత, చీర, రవిక నీకు ఇవ్వాలి. ఈ ప్రకారము చేస్తే వీళ్లు చేసిన హత్యాపావము తొలగిపోయి వీళ్లకు సంతానము కలుగుతుంది" అని. (చూ. డైరి. పుట 429).

వీటి నన్నింటిని చూస్తే మాస్టరుగారు ఏదో ఒక ఉద్దేశ్యముతోనే అన్ని పనులూ చేసినట్లు తెలుస్తూంది కదూ!.

**23 వ ప్రశ్న:- యోగ సూత్రాలకు భిన్నంగా శార్వరి, చంద్రశేఖర రాజు వగైరాలంతా డబ్బులు వసూలుచేసి వారి సొంత పేర్లమీద ఇండ్లు వాకిండ్లు కట్టుకొన్నారు. శార్వరి ఫీజులు వసూలు చేస్తున్నారు కదా! ఈ విషయంలో మహాత్మా ఎమ్.టి.ఎ. ద్వారా మాస్టరుకు ఏమి చెప్పినారో అదీ చెప్పండి మీ అభిప్రాయమూ చెప్పండి.**

అడిగినవారు:- చి॥ సి. వెంకటేశ్వర్లు, తిరుపతి.

సమాధానము:- ఈ విషయంలో యమ్.టి.ఎ. ద్వారా మాస్టరు గారికి ఏమి సూచనలు వచ్చినాయో వినండి.

"(1) పిల్లల పెండ్లిండ్లకు వగైరాలకు మీడియములు ఇచ్చే డబ్బు తీసుకోవద్దు.

(2) ఇనిసియేషనుకై వసూలుచేసే ఫీజు ప్రత్యేకముగా

లెక్క వ్రాయవద్దు.

(3) మేము పర్మిషన్ ఇస్తే దానిని మాత్రం ఉపయోగానికి తీసుకోవలసినది.

(4) ఇదే సూత్రాలు యోగా స్కూలు లాడ్జీకి కూడా వర్తిస్తాయి." అన్నారు. (చూ.డైరి. పుట. 232)

ఇంకొకచోట-

"(1) వసూలైన బాడుగలు మాత్రం కుటుంబ ఖర్చులకు ఉపయోగించాలి.

(2) ఇకమీదట ఎవరినుండీ సబ్‌స్క్రిప్షన్ వసూలు చేయరాదు, దీనిని తు.చ. తప్పక పాటించు.

(3) సొసైటీకి సంవత్సరానికి వేయి రూపాయలు కట్టించుకొని నీ కుటుంబానికి భోజనము పెట్టు.

(4) లాడ్జి ఏర్పాట్లు పూర్తిగా మీడియములు అనుభవించడము లేదు. ఎక్కువ భాగము నీ కుటుంబ సభ్యులూ పనివాళ్లూ తింటున్నారు.

(5) సొసైటి డబ్బు ఇంటికీ, లాడ్జికీ కలిపి ఖర్చు చేస్తున్నావు. చూస్తే మొత్తమే నీ కుటుంబానికే ఖర్చు చేస్తున్నట్లు కనిపిస్తుంది.

(6) ఈ లాడ్జి శాశ్వతంగా పనిచేయాలి. ఇట్లాగే ఉంటే అది అయ్యే పనిగాలేదు.

(7) లాడ్జి అన్నా హోటల్ అన్నా ఒకటే. ఇది జనరల్ కాల్సుకు వచ్చే మీడియములకు, కుటుంబానికి, ఇంకా చురుకుగా పనిచేసేవారికి మాత్రమే.

(8) పై రకంగా పనిచేసేవాళ్లకు మాత్రమే ఈ లాడ్జి అని ఖచ్చితముగా వ్యవహరించు" అని. (చూ. డైరి. పుట 311).

(9) ఇకమీదట నైనా ఈ సొసైటీని, ఇంటిని, లాడ్జిని, ఇంకా దేనినైనా ఇతరులు వేలెత్తి చూపి, పరిహాసము చేసే స్థితిలో ఉండకుండా చూడు, ఉదాత్తమైన భావాలను కలిగి ఉండాలి, ముందుచూపుతో భక్తి శ్రద్ధలతో ఉండాలి.

(10) డొనేషన్లు ఒక నిర్ణీత కార్యానికి అని వసూలు చేస్తే దానికే ఖర్చు పెట్టు.

(11) ఇన్‌సియేషన్ ఫీజు మాస్టరు సొంత ఖర్చులకు కాదు.

(12) సొసైటీకి అవసరమయ్యే అధిక ఖర్చులకు ఉపయోగించాలి.

(13) పెద్ద మొత్తములో డొనేషన్లు నీకు ఇచ్చి ఏమి లాభము? దాని ఉపయోగమేముంది? ఏ విధంగా ఖర్చు పెట్టాలి?

(14) నీకూ, నీ భార్యకూ ఖర్చుల క్రింద సంవత్సరానికి వేయి రూపాయలు చాలు. మిగిలిన డబ్బును బ్యాంకులో దాచి పెట్టడము నీ జీవనాంశానికా?

(15) డొనేషన్ మొత్తాన్ని దాత అతని ఇష్ట ప్రకారము నీ కుటుంబానికి ఇంత అని పంచరాదు. ఆ ఏర్పాట్లు చేయవలసింది నీవు" అన్నారు. (చూ. డైరి. పుట 312).

ఇంకొకచోట-

"ఈ సొసైటీలో యోగము ఉచితముగా నేర్పబడును. సబ్‌స్క్రిప్షన్లు వసూలు చేసేది సొసైటి నిర్వహించడానికి. సబ్‌స్క్రిప్షన్లు ఇవ్వవలెను అనే నిర్బంధము లేదు" అన్నారు. చూ.డైరి. పుట. 312). ఇట్లా ఎన్నో రకాలుగా మాస్టరుగారికి తెలిపి మందలించింది ఎమ్.టి.ఎ.

యోగ సూత్రాలకు, నియమ నిబంధనలకు వ్యతిరేకంగా

శ్రీ శార్వరి, పి. చంద్రశేఖర రాజులు డబ్బులు వసూలు చేసి కట్టడాలు కట్టి సొసైటి పేరు మీదకాక వారి స్వంతపేర్ల మీద పెట్టుకోవడం మాస్టరుగారికి, మాస్టరుగారి యోగానికి ద్రోహము చేయడమే. ఆత్మవంచన, పరవంచన చేసిన మహాపాతకము వీళ్లను చుట్టుకొంటుంది.

శార్వరి, చంద్రశేఖర రాజులు మాత్రమే చేసినారని మీరు తెలుసుకొన్నారు. ఇంకొక పెద్దమనిషి అనే ఆయన ఉన్నారు. అతనిని గూర్చి మీకు తెలిసినట్లు లేదు. ఆయనగారు మాస్టరుగారి సాక్షాత్తు మీడియము. గురుతుల్యులు శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలంగారు.

మా గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వారి వియ్యంకులు శ్రీ విస్సా అప్పారావుగారి ద్వారా డబ్బులు వసూలుచేసి శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలంగారికి పంపితే ఆయనగారు యోగఫ్రెండ్స్ సొసైటీ పేరు మీదకాకుండా తన పేరుమీద యోగ స్కూలు ఫ్రెండ్స్ సొసైటీని రిజిస్టరు చేయించు కొన్నారు. మాస్టరుగారి మీడియమ్మై ఉండి మాస్టరుగారికి, మాస్టరు యోగానికి ఎంత ద్రోహము చేసినారో చూడండి.

శ్రీ ఎన్.ఆర్.బి.వి. గారి కుమారుడు శ్రీ ఎన్.బి.వి. రామమూర్తి గారు శుద్ధ అబద్ధాలకోరు. తన తండ్రి గుఱ్ఱపు పందెంలో సంపాదించిన డబ్బుతో యోగా స్కూలు ఫ్రెండ్స్ సొసైటీని కొన్నాడని వ్రాసినారు.

మాస్టరుగారి డైరెక్టు మీడియములైన శ్రీ పోతరాజు నరసింహంగారు మీడియం నెం.123, ఆయన భార్య శ్రీమతి పి. సత్యవతమ్మగారలు మీడియము నెం.683 ఏ మన్నారో వినండి-

"ప్రభాకర శాస్త్రిగారు డబ్బులు వసూలుచేసి ఎన్.ఆర్.బి.

వెంకటాచలంగారికి ఇస్తే ఆయన తన పేరు మీద కొన్నాడు" అన్నారు.

ఈ విషయాన్ని శ్రీ పి.యస్.ఆర్. శర్మగారు శ్రీ మాస్టర్ సి.వి.వి. భృక్తరహిత తారకరాజయోగ సమాచార పత్రిక మే నెల 1994 పుట 24లో వ్రాసియున్నారు. నేనెరిగిన సుమారు ఇరవై అయిదు మంది మీడియములందరూ ఎన్.ఆర్.బి. వెంకటాచలంగారు యోగానికి మాస్టరుకు ద్రోహం చేసినారని చెప్పినారు.

ఇంకా శార్వరి అనే ఆయన చేసే ద్రోహం ఏమంటే ఆయన వద్ద ఎవరైనా యోగంలో చేరాలంటే ఆయన హిరణ్యాక్షవరాలు తీర్చాలి. ప్రవేశ రుసుము క్రింద రూ.500/-లు ఇవ్వాలి. ఆయన ప్రకటించే పుస్తకాలు పనికి మాలినవి వేయి రూపాయలకు పైగా ఉండేవి విధిగా కొనాలి. సంవత్సర చందా రూ.500/- ఇవ్వాలి. ఏదైనా వ్యాధికి ట్రీట్‌మెంట్ చేయాలంటే రూ.2500/-లు ఇవ్వాలి. శాశ్వత సభ్యత్వం కావాలంటే రూ.5000/-లు ఇవ్వాలి అని ఆయన ప్రకటించినారు. ఇది అబద్ధాల పుట్ట. మాస్టరుగారి సూత్రాలకు భిన్నముగా రచనలు గలది. ప్రామాణికమైనది కాదు. ఈయన గారి చర్య అమాయకులైన యోగమిత్రులను నిలువు దోపిడీ చేయడమే.

ఒకచోట ఎమ్.టి.ఎ.-

సరియైన మార్గంలో నడవండి లేదా తీవ్రమైన పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుంది అని (చూ 24-8-1911). మీడియములను ఆనాడే హెచ్చరించింది.

యోగమిత్రులైన మీరంతా పై విషయాలను తెలుసుకోండి. కల్లబొల్లి మాటలకు మోసపోకండి.

**24 వ ప్రశ్న:- ఒలిడియరనీ, మెరిడియననీ, ఈక్వనాక్సనీ ప్రేయర్లు అందరూ చేస్తున్నారు కదా? ఎవరిని ఈ ప్రేయర్లు చేయమని ఎమ్.టి.ఎ. చెప్పిందో చెప్పగలరా?**

అడిగినవారు:- శ్రీ విద్వాన్, ఎమ్. విశ్వనాథ శర్మగారు, తెలుగు పండితులు, మాసాయిపేట.

సమాధానము:- ఒలిడియర్ 3rd నేమ్ గూర్చి అడిగినారు కదా వినండి. 10-4-1921 వ తేదీన 14 వ జనరల్ కాల్ రెండవ రోజున సాయంకాలం 6గం॥ 45 నిమిషాలకు ప్రారంభించినారు. ఆ రోజు నుండే ఒలిడియర్ 3rd నేమ్ ఉదయము 6 గంటలకు సాయంత్రం 6 గంటలకు ప్రార్థన చేయాలని చెప్పినారు. 24-4-1921 వ తేది నుండి మాస్టరుగారు కుంభకోణంలో ఉండకుండా ఏవేవో గ్రామాలకు వెళ్లి వస్తూ వున్నట్లు డైరీల ద్వారా తెలుస్తూంది.

1-6-1921 వ తేదీన-

"ఒలిడియర్ ధనుర్లగ్నంలో పనిచేస్తూంది" అన్నారు. (చూ. డైరి. పుట. 433.)

14-7-1921 వ తేదీన-

ఇది బాగా పని చేస్తూంది. ఈ రెగ్యులేషన్ మెమోను చేరింది. ఇది మూడు రకాలుగా పనిచేస్తుంది.

1. ఉన్నతమైన స్థితికి కొనిపోవడము.
2. భూమికి రక్షణగా ఉండడము.
3. ఇది చేయవచ్చు, ఇది చేయరాదు అనేది తెలియడం.

ఇందులో ఉత్తమమైన మూడవ, దానివరకు ఈ రెగ్యులేషన్ చేరి పనిచేస్తూంది. ఈ మూడు కలిసి వరల్డుపిచ్యూటరీని చేరినాయి అని అన్నారు. (చూ. డైరి. పుట 437).

27-12-1921 నుండి 31-12-1921 వ తేది వరకు జనరల్ కాల్ జరిగింది. 5-1-1922 వ తేదీన అందరూ వెళ్లినారు. ముఖ్యముగా మీరు గమనించవలసింది ఏమంటే ఈ జనరల్ కాల్‌లో ఒబిడియర్ 3rd నేమ్ మాస్టరుగారు చేయలేదు. మీడియముల వద్దా చేయించలేదు. ఒబిడియర్ 4, 5, 6, 7, 8, 9 చేసినట్లు డైరీలు చూస్తే తెలుస్తుంది.

5-1-1922 వ తేదీన ఎమ్.టి.ఎ. ఈ విధంగా చెప్పింది-

"టౌన్ మీడియములకు సలహా:- కుంభకోణములోని మీడియములు రేపు ఉదయము నుండి మరు ఉత్తరువు వరకు ఒబిడియర్ 3rd నేమ్ చేస్తూ రావలసినది" అని. (చూ. డైరి. పుట 448).

మిగతావారు కూడా చేయవచ్చును అనే అభిప్రాయము ఎమ్.టి.ఎ. కు ఉండి ఉంటే టౌన్ మీడియములు అని చెప్పి ఉండరు. మీడియములు అందరు అని చెప్పి ఉండేవారు. ఎమ్.టి.ఎ. ఉద్దేశ్యములో టౌన్ అంటే కుంభకోణము మాత్రమే. మిగతా మదరాసు వగైరాలన్నీ మఫిషియల్ అని అన్నారు. కుంభకోణములో లేని మీడియములంతా మాస్టరుగారికి ఎమ్.టి.ఎ. ఇచ్చిన సూచనలను ధిక్కరించి ఒబిడియర్ 3rd నేమ్ చేసిన వాళ్లే. మాస్టరుగారి యోగానికి ద్రోహం చేసినవాళ్లే.

మీడియములే కుంభకోణం తప్పించి మరెక్కడా ఒబిడియర్ 3rd నేమ్ చేయరాదు అన్నప్పడు ఈనాడు మాస్టర్లు అని చెప్పకొనే వారికి అర్హత ఎట్లా కలుగుతుంది? అక్రమముగా అనధికారముగా చేస్తున్నారు, చేయిస్తున్నారు. పాపాన్ని మూటగట్టుకొంటున్నారు. దుష్ఫలితాలను అనుభవించినా బుద్ధి రావడము లేదు.

అర్హులు కాదు. అనే విషయాన్ని మీకు తెలుపుతున్నాను.

ఇక ఒలిడియరు ఆనాటి మీడియములకు ఇచ్చినారు. కడపట కుంభకోణము టౌనులోని మీడియములు మాత్రమే మరు ఉత్తరువు వరకు చేయవలసినది అని ఎమ్.టి.ఎ. చెప్పిన విషయముకూడా మీకు తెలిపినాను.

అజ్ఞానంతో మాస్టర్లము అని భ్రాంతి పడేవాళ్ల కొందరుచేస్తూ అందరిచేతా చేయిస్తున్నారు ఈ ఒలిడియర్ ప్రేయరు. ఎమ్.టి.ఎ. రూల్సు ప్రకారం ఇప్పటివాళ్లు ఎవళ్లూ ఒలిడియరు ప్రేయరు చేయడానికి అర్హులు కారు- అనర్హులు, అయోగ్యుల మాటలు నమ్మి మోసపోయి ఒలిడియరు చేయకండి.

**25 వ ప్రశ్న:- యోగము పూర్తి అయినప్పడు యోగఫలము అంటే ఎటర్నటి (శాశ్వతత్త్వము) యోగసాధకులకు మాత్రమేనా లేక ఇతరులకు కూడా లభిస్తుందా? అది ఎంతవరకు?**

అడిగినవారు :- శ్రీ విద్వాన్, మైనంపాటి వెంకట సుబ్రహ్మణ్యము గారు, రిటైర్డు, తెలుగు పండితులు, బుడగుంట పల్లె, కోడూరు.

సమాధానము:- అన్ని ప్రశ్నలకూ ఎమ్.టి.ఎ. చెప్పిన విషయాలు చెప్పినట్లు దీనికీ చెప్పతాను వినండి.

ఎమ్.టి.ఎ. ఒకప్పడు ఈ క్రింది వాళ్లు అనర్హులు అన్నారు-

"మాంసాహారులు, ధూమపాన ప్రియులు, (అంటే చుట్ట, బీడి, సిగరెట్టు వగైరాలు త్రాగేవారు) కల్లు, సారాయి, బ్రాంది, నల్ల మందు వగైరాలు ఉపయోగించేవారు; అహంకారులు, శీలములేని వాళ్లు, దొంగలు, దొంగతనాన్ని ప్రోత్సహించేవారు, వ్యభిచారము చేసే పురుషులు, వ్యభిచారము చేసే స్త్రీలు, శీలము లేనివారితో స్నేహము

చేసేవారు, స్థిరమైన బుద్ధిలేనివారు, మతిస్థిమితము లేనివారు, (ఎందుకంటే మనకు కనపడని భగవంతుడు ప్రపంచానికంతా ఒకడు ఉన్నాడు అని తెలియక పరిహాస పాత్రంగా మాట్లాడుతారు కాబట్టి) పనికిరారు. అయితే వీరినికూడా ఈ సొసైటీలో చేర్చుకొని రూల్సు, రెగ్యులేషన్సు చెప్పి, నయాన భయాన వారిని చక్కదిద్దడానికి ప్రయత్నించ వచ్చును. అప్పటికీ వాళ్లు బాగుపడకపోతే వాళ్లు తీవ్రమైన పరిణామాలను ఎదుర్కొంటారు. చక్కబడకపోతే వారిని వాళ్ల పాపాన పొమ్మని వదలివేయ వలసింది" అని. (చూ. ఎస్. ఎస్. సంపు 1 టి పుట. 94).

ఎమ్.టి.ఎ. ఇంకా ఏమన్నారో వినండి-

"ఈ ప్రార్థన వల్ల ఎంతో సాధించినాము- ఏదో జరిగింది అని నీకు నీవే తృప్తి పొందడము కాదు. ఈ ప్రార్థన వల్ల శాశ్వతత్వాన్ని పొందవచ్చును అని ప్రపంచానికి నిరూపించాలి. ఆ నిరూపించడం గంగానదిలోని నీళ్లు ఎట్లా పవిత్రమైనవో అట్లాగే పవిత్రమైన హృదయాలూ శరీరాలూగల బ్రాహ్మణుల వలననే సాధ్యము అవుతుంది. గొర్రెలు, మేకలులాగ ఎరుపు తెలుపుగల శరీరాలు ధరించిన వాళ్లకు- బ్రాహ్మణుల యెడల నిర్లక్ష్య భావంతో ఉండేవాళ్లకు శాశ్వతత్త్వము అంటే ఎటర్నటీ రాదు అని (చూ. ఎస్.ఎస్. సం1. పుట.81). ఇంకా యమ్.టి.ఎ. అయిన నేనూ ఆర్యావర్త బ్రాహ్మణుడనే. నా అన్న అయిన మహాత్మా కూడా బ్రాహ్మణుడే".

ఎర్రగొర్రెలూ తెల్లమేకలూ అని చెప్పడములో ఉద్దేశం మేకలు, గొర్రెలు అడవులలో తిరుగుతూ ఆ చెట్ల ఆకులూ, ఈ చెట్ల ఆకులూ తింటూ, పొట్టలు నింపుకొని శరీరాలు పెంచు

కొంటాయి. అట్లాగే మేడం బ్లావెట్‌స్కీ, కల్నల్ హెన్రిస్టీల్‌ఆల్కాట్ అనే వీళ్లు ఇద్దరూ కూడా ఆయాదేశాలు తిరిగి వాళ్లు చెప్పినవీ, వీళ్లు చెప్పినవీ వ్రాసుకొంటూ పోయినారేగాని వీరికి స్వయముగా ఏవిధమైన ఆత్మజ్ఞానమూ లేదు అని తెలియజేయడానికి గాను వ్రాసినట్లున్నారు. రష్యా మనిషి మేడం బ్లావెట్‌స్కీ ఎఱ్ఱని శరీరము గలది, ఆల్కాట్ ఇంగ్లండ్ మనిషి ఇతడు తెల్లని శరీరము కలవాడు.

స్వయం ప్రజ్ఞలేని వాళ్లూ, ఆత్మపరిశీలన లేనివాళ్లూ సాధించేది ఏమిలేదు అని దీనివలన తెలుస్తూంది. ఇంతకు ముందు యమ్.టి.ఎ. బ్లావెట్‌స్కీని పరిహాసము చేసినది చెప్పాను. మీకు జ్ఞాపకము ఉంది అనుకొంటాను.

ఈ యోగంలో ఎటర్నటి సంపాదించిన వారికి ఆకలి, దప్పి ఉండవు. నిద్ర అవసరము లేదు. ఇవేవీ లేకుండా జీవించ గలుగుతారు. ఈ యోగము చేయనివారి ఆయుర్దాయము (యోగం కాస్మాన్‌లో పనిచేయడము వలన) పెరుగుతూ వచ్చినా వాళ్లకు ఆహారము, నీళ్లు, నిద్ర, అవసరము అవుతాయి. మనలను చూచి మీరు ఎట్లా ఆహారాదులు లేకుండా జీవిస్తున్నారు? అని అడిగి తెలుసుకొని మనమూ ఈ యోగములో చేరితే మనమూ బాగుపడి ఆహారాదులు లేకుండా జీవించగలము అని క్రమంగా లోకంలోని మానవులంతా ఈ యోగంలో చేరి బాగుపడగలరు అని నా నమ్మకము.

ఎందుకంటే జాతి, మత, కుల భేదాలు లేకుండా ప్రపంచంలోని మానవులకు అందరికీ ఎటర్నటీ సంపాదించి పెట్టడమే ఈ యోగ లక్ష్యము కాబట్టి అందరికీ ఎటర్నటీ లభిస్తుంది.

మనకూ మిగతా వాళ్లకూ ఉన్న వ్యత్యాసము చెప్పాను. మీరూ

విన్నారు. తెలుసుకొన్నారు అనుకొంటాను.

**26 వ ప్రశ్నః- ఉదయము 6 గంటలకూ సాయంత్రము 6 గంటలకూ ప్రేయరు చేయాలి. ఆ సమయము తప్పితే ప్రార్థన చేయకూడదు అని చాలా మంది చెప్పతున్నారు మీరు ఏమంటారు తాతగారు?**

అడిగినవారు :- చి॥సౌ॥ పి. యోగప్రభ, తిరుపతి

సమాధానము :- ఈ ప్రార్థన ఉదయము స్నానము, పానము, జపము, అనుష్ఠానము అన్నీ (6 గం॥లకు లేచి 7 గం॥లోగా ముగించుకొని) 7 గంటల లోగా పూర్తి చేయాలి. మొహాన విభూతి ధరించు. ప్రార్థన ప్రారంభించు, ధాట్ పవర్ ఇచ్చినాను. నీవు తెలుసుకొని ఇతరులకు తెలుపు, (యస్.యస్. సంపు. పుట. 53). ఇంకొకచోట :- భక్తి శ్రద్ధలు అవసరము. 6 గం॥లకు నీవు నీ మీడియములు లేచి పండ్లు తోమి, స్నాన, పాన, జపాలు ముగించుకొని ప్రార్థనను ప్రారంభించి 8.30 ఎ.యమ్. వరకు అంతరాత్మ పరిశీలన ద్వారా పరిశీలించండి. (యస్.యస్. సంపు. పుట. 64). 8.30 ఎ.యమ్. కు గాని 8-45 ఎ.యమ్. కు గాని ప్రార్థనకు కూర్చో, నీవు మాత్రము ఒక రూములో కూర్చొని ప్రార్థన చేయాలి. ఇతరులు ఇంకొక రూములో కూర్చోవాలి, తోటలో ముగ్గురు కూర్చోవాలి. ప్రార్థన చేయాలి. (యస్.యస్.సంపు. పుట.72). తరువాత క్రమంగా 7-30 గంటలు 7 గా మారింది.

యమ్.టి.ఎ. ఉదయం 6 టికి సాయంత్రం 6 టికి ప్రార్థన చేయమన్నారు. కానీ వీలులేనప్పడు ఏ సమయంలో నిత్యం ప్రార్థన చేసుకొంటాము అని మీరు నిర్ణయించుకొంటారో ఆ సమయాన్ని మాస్టరుగారికి విన్నవించుకొని ఆ సమయంలో ప్రార్థన చేయ వచ్చును అని కూడా యమ్.టి.ఎ. చెప్పినారు.

యమ్.టి.ఎ. ఉదయము సాయంత్రము 6 టికే ప్రార్థన చేయమని చెప్పినారు కదా మాస్టరు గారికి. మరి మాస్టరు గారు వ్రాసిన డైరీలలోగాని, ఇతర సాహిత్యంలోగాని ఎక్కడా 6 టికే ప్రార్థన చేసినట్లు వ్రాయలేదు. ఆయనగారూ చేయలేదు, మీడియముల వద్దా చేయించలేదు. మీడియములూ చేసిన దాఖలాలు లేవు.

ఒలిడియర్ రెగ్యులేషన్ ప్రారంభించినప్పడు మాత్రము 6 టికి చేయమన్నారు, చేసినారు, చేయించినారు.

ఒలిడియర్ ఎవరు చేయాలో చెప్పినాను. ఇప్పటి వాళ్లకు అర్హత లేదు అనే విషయమూ చెప్పినాను.

సుమారు ఏడువందల నలభై ఎనిమిది మందికి మాస్టరు గారు ప్రార్థన చేయవలసిన విధానము తెలిపినారు. వీళ్లు అందరూ మాస్టరు సి.వి.వి. అని ప్రార్థన చేయాలి అన్నారు. అందరూ అట్లాగే చేసినారు, కానీ 6 టికి ప్రార్థన చేయలేదు.

అత్యంత భక్తి శ్రద్ధలతో, సంపూర్ణ విశ్వాసంతో, క్రమం తప్పకుండా ఉదయము 4 గం॥ల నుండి 8 గం॥లలోగా ఒక నియమితమైన సమయాన్ని ఎన్నుకొని మాస్టరుగారికి విన్నవించి రూల్సు రెగ్యులేషన్సు ప్రకారం స్వచ్ఛమైన హృదయముతో ప్రార్థన పది సంవత్సరాలు చేయాలి. అట్లాగే సాయంత్రం 6 నుండి 8 గం॥లలోగా ప్రార్థన చేయాలి. అట్లా ప్రార్థన చేస్తూ అంతరాత్మ పరిశీలన ద్వారా అభివృద్ధి పొందిన వారికి మాత్రమే ఎటర్నటి అంటే శాశ్వతత్త్వము లభిస్తుంది అని యమ్.టి.ఎ. చెప్పగా మాస్టరుగారు డైరీలలో వ్రాసినారు. డైరీలు చూస్తే మీకు తెలియగలదు.

**27వ ప్రశ్న:- ఆచార్యులుగారూ మీరు ఆరుగురు మీడియముల వద్ద వారి మాటలు టేప్ రికార్డు చేసినారు కదా? అందులోవారు ప్రార్థన ఎలా చేయాలి అని చెప్పినారో తెలుపగలరా?**

అడిగినవారు:- శ్రీ కె.సి.హెచ్. వెంకట్రాజుగారు మండల రెవిన్యూ ఆఫీసరు, తెనాలి, గుంటూరు జిల్లా.

సమాధానము :- 4-8-1980 వ తేదీన కుంభకోణములో మాస్టరుగారు ప్రార్థన చేసిన గదిలో మేము ప్రార్థన చేసే సమయములో కొన్ని పనులు చేయుమని మాస్టరుగారు ఆజ్ఞాపించినారు. వారి ఆజ్ఞను శిరసావహించి నిర్వర్తిస్తున్నాము. నిర్విఘ్నంగా జరిపిస్తున్నారు వారు తోప జేసిన కార్యాలను.

వాళ్లు ఆరుగురు ఏమన్నారో చూడండి-

1. గురుతుల్యులు శ్రీ ఎన్. రఘునాధయ్యర్ గారు మీడియము నెం.271, బెంగుళూరు.

"సి.వి.వి. నమస్కారమ్ అని చెప్పి ఇప్పటివాళ్లు ప్రార్థన చేయవలయును. ఇంక ఏమీ చేయనవసరము లేదు" అన్నారు (తమిళ భాష)

2. గురుతుల్యులు శ్రీ డాక్టర్ వేటూరి చంద్రశేఖర శాస్త్రిగారు మీడియం నెం. 406, విజయవాడ.

" మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్ అని ఇప్పటివాళ్లు ప్రార్థన చేయండి. ఇంకేమీ చేయకండి" అన్నారు.

3. గురుతుల్యురాలు శ్రీమతి కాజా శారదాంబ గారు మీడియము నెం.631 (శ్రీ గురుతుల్యులు కాజా, వెంకటశేషయ్య గారు మీడియము నెం.630) భార్య గారు బిలాసపూరు.

మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్ అని మాస్టరు మమ్మల్ని ప్రార్థన

చేయమన్నారు. అదే నేను చేస్తున్నాను. మీరూ చేయండి. ఇంకేమీ వద్దు. మన మీద మాస్టరుకు విశ్వాసం ఉంటే దానంతట అదే అభివృద్ధి కలుగుతుంది. అన్నారు.

4. గురుతుల్యురాలు శ్రీమతి రాచకొండ సీతారామలక్ష్మమ్మ గారు మీడియము నెం. 647 (గురుతుల్యులు శ్రీ రాచకొండ నారాయణ మూర్తిగారు మీడియము నెం. 562) భార్యగారు, విశాఖ పట్టణము.

" సి.వి.వి. నమస్కారమ్ అని నమస్కారము చేయమన్నారు. అదే మేము చేస్తున్నాము. మీరూ అదే చేయండి" అన్నారు.

5. గురుతుల్యులు శ్రీ వి. రుద్రపతి పిళ్లై గారు మీడియము నెం. 675, కారైక్కాల్.

"సి.వి.వి. పేరు చెప్పి ప్రార్థన చేస్తే ఆయన ఫోర్సు మొత్తం పనిచేస్తుంది. ఇంక ఏమి చేయవలసిన పనిలేదు. సి.వి.వి. పేరే చెప్పి ప్రార్థన చేయాలి. మిగతా వాళ్ల పేర్లు కలిపి చెప్పి ప్రార్థన చేయరాదు" అని తమిళభాషలో చెప్పిరి.

6. గురుతుల్యురాలు శ్రీమతి పోతరాజు సత్యవతమ్మగారు అనే సత్యనారాయణమ్మ మీడియము నెం.683. (గురుతుల్యులు శ్రీ పోతరాజు నరసింహం గారు మీడియము నెం.123) భార్య, మదరాసు.

"మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్. మా శరీరాన్ని శుద్ధం చేసి బ్రహ్మాన్ని తెలియజేయండి. మహాప్రభో అని నమస్కారం చేయండి. ఇంకా జనన మరణాదులు నశింపజేసి శాశ్వతంగా ఈ శరీరాన్ని నిలుపండి. త్వరగా మీరు తిరిగి రాండి. శీఘ్రంగా రాండి మహాప్రభో అని ప్రార్థన చేయండి" అన్నారు.

పై మీడియములందరూ- "ఇన్సియేషన్ అని చెప్పి ఇచ్చే అధికారము ఒక్క సి.వి.వి. కే కలదన్నారు. ఇంకెవరికీ అధికారం లేదు అన్నారు. బీజాక్షరములైన సి.వి.వి. అనే అక్షరాలు బిగ్గరగా ఉచ్చరించరాదు అన్నారు. ఇప్పటివాళ్లు కోర్సులు చేయవలసిన పనిలేదు. పుస్తకాలు చూచి చేయరాదు అన్నారు. పని పూర్తి అయింది పోయి తిరిగి వస్తాను అన్నారు సి.వి.వి.. సి.వి.వి. గారి వద్ద ఉపదేశం పొందిన వారికే మీడియము అనే పదము వర్తిస్తుంది అన్నారు. పూర్వజన్మలో చేసిన దానినిబట్టి సి.వి.వి. అభివృద్ధి కలిగిస్తారు అన్నారు. ఇన్నర్‌ను గమనించండి అన్నారు.

మాస్టరుగారి ఆజ్ఞప్రకారము ఆయా ప్రదేశాలకు నాతో కూడా యోగమిత్రులు శ్రీ ఎమ్. బలరామయ్య శెట్టి; శ్రీ పి. ఎరికలయ్య; శ్రీ ఇ. మునిరత్నం; శ్రీ యస్. గురుస్వామి; శ్రీ యస్. సుబ్రహ్మణ్యం; శ్రీ ఎమ్. పిచ్చయ్య; శ్రీ జి. గురుమూర్తి గారలు తిరుపతి. శ్రీ ఎమ్. గోపాలరెడ్డిగారు, కాకుపల్లె, నెల్లూరు జిల్లా; శ్రీ ఎమ్. వీరారెడ్డిగారు, గుడిపాడు, కడప జిల్లా; శ్రీ పి. కృష్ణమూర్తిగారు, సిద్దాయపల్లె, కడప జిల్లాలు వచ్చిరి. కుంభకోణము కారైక్కాల్ మడరాసులకు, విశాఖ పట్టణం, బెంగుళూరు, బిలాసపూరులకు.

**28 వ ప్రశ్న:- యోగము త్వరగా పూర్తి అయి ఎటర్నటి రావడానికి ఇప్పటివారలు అంటే సాధకులు చేయవలసిన పని ఏమో సెలవిస్తారా?**

అడిగినవారు:- చి॥సౌ॥ సుగుణా ప్రసాద్, మంగళగిరి.

సమాధానము:- ఎమ్.టి.ఎ. ఒకరోజు ఇలా అన్నారు-

"ఈ యోగం భక్తి శ్రద్ధలతో చేసేవాళ్లంతా అభివృద్ధి పొందాలనే- మనం సొసైటి అభివృద్ధికి పాటుపడితే మనకూ అభివృద్ధి కలుగుతుందనీ- పరిపూర్ణ ఉత్సాహంతో అత్యుత్సాహంతో-

అన్ని రకాలైన ఆలోచనలను వదలి ఉదయము సాయంత్రము అంతరాత్మ పరిశీలన చేస్తూ ప్రార్థించాలి". (చూ. డైరి. పుట. 14).

ఇంకొకరోజు ఎమ్.టి.ఎ. ఏమన్నారో వినండి-

"మీరు ఎంత భక్తి శ్రద్ధలతో ప్రార్థిస్తే త్వరత్వరగా మీకు అంతకు అంత అభివృద్ధి కనిపిస్తుంది. పరీక్షలో పాస్ అయ్యేదానికి కష్టపడి చదివితే ఎక్కువ మార్కులు వస్తాయి, అట్లాగే యోగంలో కూడా. ఉన్నట్లుండి ఒక్కసారిగా యోగసారాంశమంతా బుర్రకు ఎక్కాలన్నా అభివృద్ధిని పొందాలన్నా సాధ్యం కాదు. మీరు చేసే ప్రాక్టీసు మీద మీ అభివృద్ధి ఆధారపడి ఉంటుంది". (చూ. డై. పు. 327).

మరొకరోజు ఎమ్.టి.ఎ. క్రింది విధంగా చెప్పినారు-

మాస్టరు డెవలప్‌మెంట్ ఒక్కటే ముఖ్యమైన ధ్యేయంగా (అంటే మాస్టరుగారు సశరీరంగా డిసెండ్ అయి భూమి మీద వెలసి ఎటర్నటీని నెలకొల్పాలి) అనే సత్సంకల్పంతో విడువక ప్రార్థించాలి. సమయము దొరికినప్పుడంతా శరీరం లోపల జరిగే వర్కింగును అంటే యోగ ప్రక్రియను పరిశీలిస్తుండాలి. అప్పడే నీకు అభివృద్ధి కలుగుతుంది. పినామినా కనిపిస్తుంది. పూర్వజన్మను గూర్చిన జ్ఞానము అంటే ఏ ఏ జన్మలలో ఎట్లా ఉండినాము అనేది తెలుస్తుంది. చనిపోయిన నీ దగ్గర బంధువులు తరచూ కనిపిస్తారు. జ్వరము, ఒళ్లు నొప్పలు వస్తాయి. అయినా లెక్క చేయవద్దు. టెలిఫోనులో మాటలు వినిపించినట్లు చెవులలో మాటలు వినిపిస్తాయి. శ్రద్ధా భక్తులతో వినండి. ఒక్కొక్కప్పడు చెవులు వినిపించకపోవచ్చు అయినా భయపడకండి" అని అన్నారు. (చూ. డై. పు. 379-389).

ఇంకొకచోట ఎమ్.టి.ఎ. "మీకు ఎన్నో రకాలైన చీకాకులు,

చెడ్డ ఆలోచనలు వస్తాయి. ఈ యోగంవల్ల లాభమేమి? దీనిని వదలి వేస్తాము అనే ఆలోచనలు కూడా వస్తాయి. ధైర్యంగా నిశ్చలమైన మనస్సుతో ఈ ప్రార్థనను మీరు కొనసాగిస్తే అన్నీ మబ్బువిచ్చినట్లు తొలగిపోతాయి" అన్నారు. (చూ. డైరి పుట 381).

"మీ కండ్లకు నేను వచ్చి కనిపించి మాట్లాడినట్లు వినిపించినా, చెప్పినట్లు వినిపించినా, ఫినామినాలు, ఆటోరైటింగ్స్ (అంటే ఏదో సినిమా చూచినట్లు చూచినా, చేతులు వాటి అంతట అవిగా వ్రాసినా) వచ్చినా, అందులోని విషయాలు అమలు జరిగినప్పుడు మాత్రమే నాకు సంబంధించినవి, నేను తోపజేసినవి అని అనుకోండి. ఆ తోచినవి, వినిపించినవి, కనిపించినవి అమలు జరుగకపోతే మిమ్ములను మోసగించడానికై మాస్టరులాంటి రూపంలో కనిపించిన మాయా శక్తి మిమ్ములను బాగుపడకుండా చేయడానికీ తప్పదోవ పట్టించడానికీ తోపజేసినవి అని తెలుసుకోండి" అని అన్నారు. (చూ. డై. పు. 151).

మనమంతా మాస్టరుగారికీ యోగపరిపూర్తికీ చేయ వలసింది ఈ క్రింది విధంగా ప్రార్థించడమే. అందరూ సక్రమంగా రూల్సు, రెగ్యులేషన్సు ప్రకారము ప్రార్థిస్తే మాస్టరుగారు సశరీరంగా భూమిపై నిలిచి అందరికీ దర్శనమిచ్చి ఎటర్నటీని అంటే శాశ్వతత్వాన్ని నెలకొల్పగలరు. ఆ ఫలాన్ని మనమూ అనుభవించవచ్చును.

**ప్రార్థనా విధానము**

"మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్"

మన సంకల్పం ఇలా ఉండాలి "ప్రపంచమంతా క్షేమంగా ఉండాలి. మేమూ క్షేమంగా ఉండాలి. పూర్వజన్మలో చేసిన పాపము

నశించి పోవాలి. ఈ జన్మలో చేసిన పాపము నశించి పోవాలి. ఎటర్నటి సంపాదించడానికి అర్హత కలగాలి. నమస్కారము.

మాస్టరుగారూ మీరు సశరీరంగా డిసెండ్ అయి భూమిపై వెలసి ఎటర్నటి ఎస్టాబ్లిష్ చేయాలి. అందుకై భూమి నశించి పోయినా మేమంతా నశించిపోయినా పరవాలేదు. భూమిపై ఎటర్నటి ఎస్టాబ్లిష్ కావాలి. డెడ్‌రైసింగ్ (అంటే చనిపోయిన వానిని లేవమంటే లేచిరావడము మన లైనులో చిన్న విషయము అన్నారు మీరు. మీకు సమ్మతమైతే మమ్మల్ని రీకాల్ చేయండి. మీ యోగానికి సేవ చేస్తాము. మీకు సమ్మతము కాకపోతే మేము నశించి పోయినా భూమి నశించి పోయినా పరవాలేదు. మాకు కావలసింది మీరు తిరిగి రావడము, ఎటర్నటి రావడము మాత్రమే. నమస్కారము.

అన్నే సత్సంకల్పంతో పై వ్యాక్యాన్ని ఆర్ద్రార్ద్రమైన హృదయంతో మనసులో ఒక్కమారే స్మరించి, కనులు మూసుకొని ప్రార్థించి, శరీరాంతర్భాగాన జరిగే యోగ ప్రక్రియను సూక్ష్మంగా పరిశీలించ మని మిమ్మల్ని చేతులెత్తి నమస్కరించి సవినయంగా ప్రార్థిస్తున్నాను. బిగ్గరగా ఉచ్చరించకండి.

మాస్టర్ సి.వి.వి. గారు వారి మీడియమైన గురుతుల్యులు శ్రీ కప్పగంతుల సత్యనారాయణ గారికి (నెం.127) 24-2-1922 వ తేదీన వ్రాసిన ఉత్తరములో-

"మన ప్రార్థన నిశ్శబ్దముగా మనస్సులో స్మరించవలసినది' ' అని వ్రాసినారు. కాబట్టి ఎవరూ బిగ్గరగా ఉచ్చరించరాదు.

"పడుకోబోయేటప్పడు ప్రార్థించమన్నారు. దానిని క్రింది విధముగా చేయాలి. అందులో అంటే ఆ రాత్రి ప్రార్థనలో మనము

ఉదయము నుండి రాత్రి పడుకోబోయే వరకు చేసిన పనులను జ్ఞప్తికి తెచ్చుకొని సత్యానికీ, ధర్మానికీ వ్యతిరేకంగా మనము ఏదైనా తప్పలు చేసివుంటే దానిని మాస్టరుగారికి విన్నవించి రేపటి నుండి ఇటువంటి తప్పలు మరలా మరలా నేను చేయకుండా రక్షించండి మహాప్రభో అని విన్నవించి పడుకోవాలి". మరురోజు అటువంటి తప్ప చేయనీయకుండా మాస్టరుగారు రక్షిస్తారు. ఇట్లా ప్రతిదినము విన్నవించుకొని మనము పరిశుద్ధులమై డెవలెప్ కావాలి. అట్లా పరిశుభ్రత పొంది డెవలప్ అయితే త్వరలో ఎటర్నటి సంపాదించ వచ్చును.

**29 వ ప్రశ్న:- ఈ యోగంలో అభివృద్ధిని పొందినాడు అని అనడానికి మాస్టరుగారు ఏమైనా గుర్తులు చెప్పినారా?**

అడిగినవారు:- శ్రీ వి. భగవంతరావుగారు, ఎమ్.ఎ., రిటైర్డు, లెక్చరర్, తెనాలి.

సమాధానము:- ఎమ్.టి.ఎ. ఒకరోజు ఏమన్నారో చూడండి-

"ఈ యోగములో సాధకుడు ఉన్నతస్థితిని చేరుకొన్నాడు అనడానికి అతడు ఇచ్చే ట్రీట్‌మెంట్సు పూర్తిగా నెరవేరడము ద్వారా తెలుస్తుంది. అతను అధికార పూర్వకముగా చెప్పే వాక్యాలు ఫలితాన్ని ఇవ్వడం ద్వారా తెలుస్తుంది. అతను సంపాదించిన అపూర్వమైన యోగశక్తి అతన్ని విజయం సాధించేటట్లు చేయడము ద్వారా తెలుస్తుంది" అని. (చూ. ఎస్. ఎస్. సంపు.2 పుట 27).

ఇంకొకచోట ఎమ్.టి.ఎ.-

"సాధకుడు యోగముద్వారా ఏదైనా శక్తిని సంపాదించినాడు. అంటే అతడు చెప్పిన మాటలు జరిగి తీరుతాయి. అతనికి సరియైన ఆలోచనలు వస్తాయి. ముప్పై యేండ్ల వయస్సులో ఉన్నట్లు

ఉంటాడు" అని అన్నారు. (చూ. డైరి. పుట 452).

ఈ విషయాన్ని గూర్చి ఇంతకుముందే వివరంగా చెప్పినాను. జ్ఞాపకము ఉంది అనుకొంటాను.

**30 వ ప్రశ్న:- గ్రహాల ప్రభావము ఈ యోగము చేసేవారిపై ఎంతవరకు ఉంటుంది? దీనిని గూర్చి మాస్టరుగారు ఏమైనా చెప్పినారా?**

అడిగినవారు:- శ్రీ రామనాధం శివనాగేశ్వరరావు గారు, మెడికల్ స్టోర్సు, మంగళగిరి.

సమాధానము:- 20-8-1917 వ తేదీన వినిపించిన పిల్లర్ టెస్టులో మాస్టరుగారు ఏమన్నారో వినండి-

"శక్తివంతమైన గ్రహాల ప్రభావాన్నుండి ఎవరూ తప్పించుకోలేరు. గ్రహాలు హాని కలిగించేది ఈ మానవ శరీరానికే కాదు, ఈ మానవ శరీరాన్ని అంటిపెట్టుకొని వుండే ఈథరిక్ ప్లేనుకు (సూక్ష్మ శరీరానికి) దాన్ని అంటిపెట్టుకొని వుండే ఆస్ట్రల్ ప్లేనుకు (వెలుగైన శరీరానికి) వీటన్నింటికిపైన ఉండే మెంటల్ ప్లేన్‌కు (మనస్సంబంధమైన శరీరానికి). మెంటల్ ప్లేను అంటే ఏమిటో మనకు సరియైన అవగాహన లేదు" అని. (చూ. పిల్లర్ టెస్టు 20.8.1917).

అందుచేతనే మాస్టరుగారు గ్రహాలెగ్జ్యులేషన్సును చేసి ఆ గ్రహాలను స్వాధీనము చేసుకొన్నారు.

మన ప్రాచీన శాస్త్రాలలో కూడా "గ్రహాయత్తా లోకాః" అని వున్నది. (అంటే అన్ని లోకాలు ఈ గ్రహాలకు లోబడి ఉన్నాయి).

ప్రార్థన సక్రమంగా క్రమము తప్పకుండా చేస్తూ అంతరాత్మ పరిశీలన చేస్తూ ఉండేవారికి గ్రహాల బాధ పెద్దగా ఉండదు అని నా నమ్మకము. నా అనుభవముకూడా.

**31 వ ప్రశ్న:- తాతగారూ మీరు చాలా కోపము కలవాళ్లనీ, కోపము గలవాళ్లు ఈ యోగానికి అనర్హులనీ శార్వరి, చంద్రశేఖర రాజు వాళ్లు అందరికీ చెప్పతున్నారు కదా దానికి మీరు ఏమంటారు? చెప్పండి విందాము.**

అడిగినవారు:- చి॥సౌ॥ వి. పల్లవి, మంగళగిరి.

సమాధానము:- నిజమే. నేను చాలా కోపము కలవాడినే. ఎవరి ఎడలనంటే మాస్టరుగారి రూల్సునూ, రెగ్యులేషన్సునూ లెక్క చేయకుండా పిచ్చి పిచ్చి పనులు చేసేవాళ్లంటే నాకు మహా కోపము. వాళ్లను చీల్చి చెండాడుదాము అన్నంత ఆక్రోశం వస్తుంది. శార్వరికీ, చంద్రశేఖర రాజుకు వాళ్లను నేను విమర్శిస్తాను అని నాపై అసూయ. ఆ ఆగ్రహంతో ఏవేవో వాగుతారు, వాగనీయండి. ఒక పర్యాయము నా దగ్గరకు వచ్చిన వాళ్లు వాళ్లను లెక్క చేయరనీ, వాళ్ల దగ్గరకు రారనీ వాళ్ల బాధ. శార్వరికంటే చంద్రశేఖర రాజు ఒక ఆకు ఎక్కువగా చదివినవాడు కాబట్టి నేను ఈ యోగానికి అనర్హుడను అని అంటాడు. అననీయండి. వీళ్లను చూస్తే జాలివేస్తుంది. అమాయకులు అమాయకుల లాగా ప్రవర్తించరే అని. పాపం వీళ్లిద్దరికీ యోగాన్ని గూర్చి ఏమీ తెలియదు. ఎమ్.టి.ఎ. ఏమి చెప్పినాడో తెలియదు. ఎం.టి.ఎ. ఎంత కోపాన్నీ, ఆ గ్రహాన్నీ చూపినారో మీరు చూడండి-

"నీవు ఏదైతే నిర్ణయించుకొన్నావో ఆ మార్గములోనే ప్రస్తుతానికి నడుపు. అతడు నీవు దగ్గరలేని తనాన్ని తెలుసుకొని, తన తప్పిదాన్ని తెలుసుకొని నీ దగ్గరకు రానీ, నీ ఇష్ట ప్రకారము అతనికి కొంత చేసినాను. నీవూ నీ శక్తిని చూపించు. ఈ రెండింటిచేత అతనిలో కొంత మార్పురానీ. నీవు మన రహస్యాలను కొన్నింటిని చెప్పినావు. నేను చెప్పమని నీకు చెప్పలేదు. అయినా

చెప్పినావు. పోతేపోనీ. గొంతులు కోసేవాడూ, భిక్షగాడూ అయిన వీడికి ఏదైనా శిక్ష విధించాలి. ఇతనికి ఏదైనా జబ్బు చేయాలి- ఆ బాధ తట్టుకోలేక పోవాలి- డాక్టర్ల నందరినీ ఆశ్రయించాలి- వ్యాధి తగ్గక పోవాలి- అన్ని చోట్లా తిరిగి కడపటికి క్షమించమని మనమల్ని ఆశ్రయించాలి. నేను ఎవరు అని తెలియకుండా పనికిమాలిన మాటలు మాట్లాడినందుకు క్షమించమని నన్ను ప్రత్యేకంగా అడగాలి. అతడు చేసిన పని సామాన్యమైనది అని అనుకొంటున్నట్లు ఉన్నాడు.

ఏడిచే పిల్లవానికి తల్లి అరటిపండు ఇచ్చి ఓదార్చినట్లు ఏవో కుంటిసాకులు నాకు చెప్పి తప్పించుకోవడానికి చూస్తున్నాడు. నాకు ఇంత కోపము వచ్చి ఉండదు. ఎందుకు వచ్చింది అంటే వాడి ఆలోచనలు, భావాలు, నీచపు పనులు నాకు ఉద్రేకాన్ని కలిగించినాయి.

ఈ పాపిష్ఠపు బిచ్చగాడు వాడి ఇష్టప్రకాము చేయనీ, వాడిని ద్రాక్షతీగను బురదలో తొక్కేసినట్లు తొక్కి నామరూపాలు లేకుండా చేసేస్తాను". (చూ. ఎస్. ఎస్. సంపు. 2 పుట 20-21).

ఇంకొకచోట ఎమ్.టి.ఎ. ఇట్లా చెప్పినారు-

"ఆవిడకు గుణపాఠం నేర్పు. ఇది క్షమించరానిది అని చెప్పు. మన గౌరవ ప్రతిష్ఠలకు భంగము లేని విధముగా ప్రవర్తించు" అని. (చూ. ఎస్. ఎస్. సంపు. 2, పుట 21).

మరొకచోట ఎమ్.టి.ఎ.-

"నా అభిప్రాయాలకు భిన్నంగా ప్రవర్తిస్తున్నావు కాబట్టి తీవ్రమైన పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుంది" అని అన్నారు. చూ. ఎస్. ఎస్. సంపు 4 పుట 89).

ఎమ్.టి.ఎ., సి.వి.వి. వీళ్లిద్దరూ కూడా ఈ యోగానికి

అనర్హులు అని చెప్పాల్సిందే కదా వీరిద్దరి సిద్ధాంతం ప్రకారం. అట్లా చెప్పే బుద్ధిమంతులే శార్వరి; చంద్రశేఖర రాజూ.

**32 వ ప్రశ్న:- ఆచార్యులుగారూ యోగము పూర్తి అయ్యేలోగా మీడియములు చనిపోయే పరిస్థితి ఏర్పడితే అప్పుడు వారిస్థితి ఎట్లా ఉంటుంది? సామాన్యుడి స్థితి ఎట్లా ఉంటుంది? యోగ సాహిత్యంలో దీనిని గూర్చి ఏమైనా చెప్పినారా?**

అడిగినవారు:- శ్రీ బాదర్ల దేవదాసుగారు బి.కామ్., సి.ఎ., ప్రొప్రైటర్, మాస్టర్ ఆఫ్‌సెట్ ప్రింటర్సు, విజయవాడ.

మాస్టరుగారి యోగ సాహిత్యంలో దీన్ని గూర్చి క్రింది విధముగా చెప్పబడి ఉంది. వినండి-

"ప్రాణశక్తి అనేది కాలర్ బోనుకు హార్టుకు మధ్య ఆస్ట్రల్ ద్వారా పనిచేస్తుంది. ఎక్కడ నుండి ఆరంభమవుతుంది అని స్పష్టంగా చెప్పలేక పోవచ్చుగాని అది పనిచేస్తుండడాన్ని వైబ్రేషన్సు ద్వారా తెలుసుకోవచ్చును.

చనిపోయే సమయములో ఊపిరి నిలిచిపోయిన తరువాత రెండు నిమిషాలకు దీనిని గుర్తించ వచ్చును. ఇది మరుజన్మకు కావలసిన లెక్కను తెలియజేస్తుంది. ఆ తెలిపేదికూడ కొంత మందిలో మాత్రమే" అన్నారు. (చూ. డైరి. పుట. 130).

ఎమ్.టి.ఎ. ఇంకొకచోట ఇలా చెప్పారు-

"ప్రాణశక్తి శరీరాన్ని వదలిపోయేటప్పుడు శరీరమంతా మెలికలు తిరుగుతూ బాధపడడము, శ్వాస వదలడము కూడా కష్టమనిపించడము వగైరా డెబ్బైరెండు రకాలైన సూచనలు కనిపిస్తాయి" అని. (చూ. డైరి. పుట. 131).

మాస్టరుగారు ఇంకొకచోట ఏమన్నారో చూడండి-

మానవుని ప్రాణశక్తి హార్టులో ఉంటుంది. ఈ హార్టు అనేది రెండు లంగ్సుకు, శ్వాస నాళానికి, ఆహారనాళానికి మధ్య ఉంటుంది.

ఈ ప్రాణశక్తి అనేది మానవుని శరీరము పూర్తిగా కాలిపోయిన తరువాతనే శరీరాన్ని వదలి బయటికి వెళ్లుతుంది.

మానవుని శరీరంలో చురుకుగా పనిచేస్తూ వుండే కుండలినీ శక్తినే ఈథరిక్‌బాడి అంటారు. ఈ ఈథరిక్‌బాడి అన్ని భాగాలలోను పని చేస్తుంది కాబట్టి ఆ విధంగా చెప్పబడింది.

ఎప్పుడైతే కుండలినీ శక్తి పని చేయడము లేదో అప్పుడు ఈ యోగంలో మెంబర్లు కానివారి శక్తి గాలి రూపంలో బయటికి వెళ్లుతుంది. వెళ్లుతూ స్టెబిలిటీనికూడా తీసుకొని పోతుంది.

ఇనిసియేషన్ పొంది మెంబర్లు అయినవారు అయిదు సంవత్సరాలు సక్రమంగా ప్రార్ధన చేసిన తరువాత చనిపోవడము జరిగితే అతని ప్రాణశక్తీ; ఈథరిక్ శక్తీ ఈ రెండూ కూడా ఆ చనిపోయిన శరీరంలోనే ఉంటుంది. శవాన్ని కాల్చిన తరువాత ఈ రెండూ శవాన్ని వదలి వేరు అవుతాయి. అప్పడు ఈ ప్రాణశక్తికి పైన రక్తమాంసాదులలో కూడిన కవరింగ్ అంటే ఆచ్ఛాదన స్టెబిలిటీకి ఉండదు. ఆ తరువాత మిగిలేది "స్టెబిలిటీ ఈథరిక్ బాడీ" మాత్రమే.

ఇనిసియేషన్ పొందనివారు చనిపోయేటప్పుడు ఈథరిక్ బాడీలోని ప్రాణవాయువు ఒక స్ట్రింగ్‌లాగ పైకి లేచి గుండెలలోని మానవ శరీరపు ప్రాణవాయువును చేరుతుంది. అప్పడు మానవ శరీరములోని ప్రాణవాయువు ఈథరిక్ బాడి ప్రాణవాయువుకు లోబడి ఉంటుంది. అప్పడు క్రమంగా తగ్గుతూ స్టవ్ ఆరిపోయినట్లు మానవ శరీరపు ప్రాణవాయువు కూడా ఈ శరీరాన్ని వదలి వెళ్లుతుంది.

దీన్ని "కవర్డు స్టెబిలిటి ఈథరిక్" అంటారు. ఈథరిక్కు పని చేయడానికి ప్రాణశక్తి ఉండదు కాబట్టి దాన్ని స్వాధీనపరచు కోవడానికి వీలులేనంత త్వరగా తగ్గిపోతూ ఈ శరీరాన్ని వదలి వెళ్లిపోతుంది.

ఇనిసియేషన్ పొందినవారి స్టెబిలిటీకి ఈ కవరింగు జరగదు. స్టెబిలిటి అంటే ఈ మానవ శరీరాన్ని అంటిపెంటుకొని వున్న జ్ఞాపకశక్తి అని అర్థము. (చూ. నోట్సు. సంపు 2 పుట 69-70).

**33 వ ప్రశ్న:- చాలా వూళ్లల్లో ప్రేయరు రూములో ఏవో పాదుకలు పెట్టి ఈ పాదుకలు మాస్టరుగారివి అంటున్నారు. ఇది ఎంతవరకు నిజము అంటారు మీరు?**

అడిగినవారు:- శ్రీమాన్ పి.టి. లక్ష్మీ నరసింహం, బి.ఎ., బి.ఎల్., గారు అడ్వకేట్, పెనుగొండ.

సమాధానము:- మాస్టరుగారి శిష్యులైన మీడియములు ఆయనగారి దగ్గర చేరినా- ఆయనగారి రూల్సు, రెగ్యులేషన్సు చదివినా, చెవులారా విన్నా వారికి ప్రాచీన సంప్రదాయము మీద ఉన్న భక్తి విశ్వాసాలు, మూఢ నమ్మకాలు పూర్తిగా తొలగిపోలేదు. దీన్నే ఒకచోట ఎమ్.టి.ఎ. ఇలా చెప్పింది-

"ఇంకా మీకు పూర్వవాసనలు తొలగి పోలేదు" అని.

భగవంతుని పాదాలమాదిరి వెండితో శఠగోపం అనే పేరుతో తయారుచేసి దేవాలయాలలో ఉంచుతారు. ఆ పాదుకలను భక్తుల తలపై ఉంచుతారు. దానితో భక్తులు తరించి పోయినామని తృప్తి పొందుతున్నారు. ఆ ప్రాచీన సంప్రదాయాన్ని వదులుకోలేని మీడియములు దేవాలయాలలో మాదిరిగానే ప్రార్థన రూములలో

కూడా మాస్టరుగారివి అని ఎక్కడివో పాదుకలు తెచ్చిపెట్టుకొని ఇవి మాస్టరుగారి వని పూజిస్తున్నారు. దీన్ని చూస్తే మాస్టరుగారు చెప్పలంగడి పెట్టుకొని ఒక్కొక్క మీడియమునకు ఒక్కొక్క పాదుకల జత ఇచ్చినారా? లేక దినానికో నెలకో ఒక కొత్త పావుకోళ్ల జత చేయించుకొంటూ వచ్చినారా? అనే సందేహం కలుగుతూంది. ఇదంతా ప్రాచీన సంప్రదాయాన్ని వదలుకోలేని మీడియములు చేసిన పిచ్చిపని అని అంటాను నేను.

ఎందుకంటే మాస్టరుగారు ఒకచోట ఇలా అన్నారు-

"నా యోగంలో ఉండేవాళ్లు ఎవళ్లూ లోకానికి విడ్డూరంగా ప్రవర్తించరాదు. భార్యాబిడ్డలతో సంసారిగా ఉండాలి. సన్యాసి కారాదు" అని.

మరి కొయ్యపావుకోళ్లు, విత్తళితో తయారు చేసినవి ఒక్కొక్క చెప్ప సుమారు 4 కేజీల బరువు వుండేవి, కొయ్య చెప్పల పైభాగాన పదునైన ములిక చీలలు దట్టంగా కొట్టి దానిపై నిలిచి యోగా భ్యాసం చేసేది. ఇదంతా హఠయోగం వగైరాలు చేసేవాళ్లు ఉపయోగించేవి. పావుకోళ్లు సన్యాసులు ఉపయోగించేవి కదా! మరి మాస్టరుగారు సన్యాసి కాదు కదా! ఆయనగారు వ్రాసిన వాక్యానికి విరుద్ధంగా లోకానికి విడ్డూరంగా ఉండేపని చేసి ఉంటారు అని నేను అనుకోవడము లేదు. ఇదంతా ఇటీవలి వారు భ్రాంతితో ప్రవేశపెట్టినవే అని మనము నిశ్చయముగా ఊహించ వచ్చును.

ఈ రకమైన చెప్పలను మా గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు శ్రీ వెంకటేశ్వర మ్యూజియమునకు సేకరించి అందులో భద్రపరచినారు. ఇవి నేటికీ ఉన్నాయి. చూడదలచినవారు

తిరుపతి శ్రీ గోవిందరాజ స్వామి వారి గుడికి ఉత్తరపు భాగాన గల తిరుమల తిరుపతి దేవస్థానము వారి శ్రీ వెంకటేశ్వర మ్యూజియములో చూడవచ్చును.

**34 వ ప్రశ్నః- ప్రార్థన చేసే రూము ఎట్లా వుండాలని మాస్టరుగారు చెప్పినారో చెప్పగలరా?**

అడిగినవారుః- చి॥సౌ॥ యస్. శ్రీలక్ష్మి పాండిచ్చేరి.

సమాధానముః- ఎమ్.టి.ఎ. మాస్టరుగారికి క్రింది విధంగా చెప్పింది-

'ప్రార్థన చేయడానికి నిర్ణయించుకొన్న స్థలాన్ని ప్రార్థనకే ఉపయోగించాలి. ఉద్యానవనాన్నిగాని, రూమునుగాని ఎన్నుకోవాలి. అది చక్కగా ఉండాలి. సౌకర్యంగా ఉండాలి. సువాసనను వెదజల్లేదిగా ఉండాలి. ఉద్యానవనమని ప్రత్యేకంగా చెప్పినాను. ఈ రెండింటిలో మీకు ఏది సౌకర్యంగా ఉంటుందో దానిని ఎన్నుకోండి' (చూ. ఎస్. ఎస్. సంపు 1, పుట. 15).

మరొకచోట యమ్.టి.ఎ. ఏమన్నారంటే-

"ప్రార్థనా మందిరము వీలైనంత శుభ్రంగా ఉంచుకోవాలి. శుభ్రంగా ఉండడముచేత అందులో ఒక ఆరా అంటే దివ్యమైన శక్తి ఉంటుంది. ఆ శక్తి జీర్ణము కాని దానిని జీర్ణమయ్యేటట్లుగా చేస్తుంది. నూటికి నూరుపాళ్లు పైన చెప్పిన విధంగా ప్రార్థనా మందిరం ఉండేటట్లు చూడు" అని (చూ. ఎస్. ఎస్. సంపు 2, పుట. 50).

యమ్.టి.ఎ. గారి పై సూచనల ఆధారంగా మాస్టరుగారు వారి మీడియమైన గురుతుల్యులు శ్రీ కప్పగంతుల సత్యనారాయణ మూర్తి నెం. 627 గారికి 24-2-1922 వ తేదీన ఒక ఉత్తరము

వ్రాసినారు. అందులో ఏమి వ్రాసినారో చూడండి-

"ప్రతిరోజు ఉదయము సాయంత్రము దక్షిణ మదరాసులోని మీడియములంతా కలిసి ప్రార్థన చేయడానికి ఒక రూము మీ ఇంటిలో గాని, దగ్గరలో ఎక్కడైనా గాని ఏర్పాటు చేసుకొనేది, అటెండెన్సు రిజిష్టరు పెట్టేది. మీ ఇంటికి దగ్గరగా ఉన్న మీడియమ్సు లిస్టు నీకు పంపుతాను.

ప్రార్థన చేసేగది చాలా పవిత్రంగా ఉంచాలి. నిశ్శబ్దంగా ప్రార్థన చేయడానికే ఉపయోగించాలి. ప్రార్థన గదిలో పనికి మాలిన మాటలు మాట్లాడరాదు. వ్యక్తిగతమైన చర్చలుగాని, రాజకీయమైన విషయాలను గూర్చిన చర్చగాని, సాంఘికమైన విషయాలను గూర్చిన చర్చగాని ప్రార్థనామందిరంలో చేయరాదు.

నీకు అవసరమని తోస్తే నా ఫోటో పెట్టుకోవచ్చును. భజన చేయరాదు. వైదిక మార్గంతో పూజ వగైరాలు చేయరాదు. సత్యాన్ని తెలుసుకోవడానికి మన లైను ఏర్పడింది అని గుర్తుంచుకో.

థియోసాఫికల్ సొసైటీవారు పవిత్రంగా ఉపయోగించే ప్రార్థనా మందిరంలాగ మీరూ మీ ప్రార్థనా మందిరాన్ని పవిత్రంగా ఉపయోగించాలి. ఒకరిని ఒకరు అన్నదమ్ములలాగ ప్రేమించు కోవడం నేర్చుకోండి" అని.

దీనిని బట్టి ఇప్పటివాళ్ళు అంటే శ్రీ యమ్.ఎన్, ఎన్.ఆర్.బి.వి., టి.కె., శార్వరి వగైరాల శిష్య ప్రశిష్యులు చేసే ప్రార్థనా విధానమంతా మాస్టరుగారి రూల్సుకు, రెగ్యులేషన్సుకు, ఆయనగారి అభీష్టానికి విరుద్ధమైనది అని స్పష్టంగా తెలుస్తుంది. మాస్టరుగారి డైరీలు, నోట్సులు చూచిన తరువాత కూడా వీరు వీరి మార్గాన్ని వదలలేదు అంటే వీళ్ళు ఎంత మూర్ఖులో, ద్రోహులో మీరే ఆలోచించి

నిర్ణయించుకోండి.

**35వ ప్రశ్న:- మాస్టరుగారి యోగము వంశపారం పర్యముగా లభిస్తుందా? దీనిని గూర్చి మాస్టరుగారి రచనలలో ఏమైనా పేర్కొనబడి ఉన్నదా? తెలుపండి సార్.**

అడిగినవారు:- శ్రీ జి.వి.యస్. ప్రసాద్ గారు, మాస్టర్ ఎలక్ట్రికల్స్, తిరుపతి.

సమాధానము:- మాస్టరుగారి యోగమే కాదు ఏదీ వంశపారం పర్యంగా రాదు. నాకు తెలిసిన సుమారు ఇరవై అయిదు మంది మీడియముల సంతతిలో ఏ ఒక్కరూ మాస్టరుగారి రూల్సు, రెగ్యులేషన్సు ప్రకారం ప్రార్థన చేయడము లేదు, తెలియదు కూడా. మొక్కుబడిగా వాళ్లకు తోచిన విధంగా వాళ్లు చేస్తున్నారు. యమ్.టి.ఎ. గాని మాస్టరు సి.వి.వి. గారు గాని ఏమి చెప్పినారో వీళ్లకు ఎవళ్లకూ తెలియదు.

యమ్.టి.ఎ. ఒకచోట ఇలా చెప్పింది-

"ప్రపంచజ్ఞానాన్ని సంపాదించిన తరువాత దాని ఆధారంగా విల్ పవర్ డెవలప్ చేసుకోవాలి. ఆపై క్రమం తప్పకుండా ప్రాక్టీసు చేస్తూ ట్రైనింగ్ ప్రిన్సిపుల్సును పాటిస్తూ, ట్రైనింగ్ పొందినవారి సలహాలు తీసుకొంటూ అభివృద్ధిని పొందాలి.

మన కండ్లకు, ఊహలకు అందరాక ఎక్కడో దాగిఉన్న పూర్వజన్మ కర్మలను తెలుసుకోవడానికి మిలిటరి ప్రిన్సిపుల్సుతో "అదాగినది ఏదో తెలుసుకోవాలి" అనే దృఢ సంకల్పముతో థాట్ పవర్ ద్వారా ప్రయత్నించాలి.

తాను సంపాదించిన ఆస్తిని పిల్లలకు చనిపోయేటప్పుడు ఎట్లా మరణ శాసనము ద్వారా సంక్రమింపజేస్తున్నాడో అదే

విధంగానే తాను సంపాదించిన ఆత్మజ్ఞానాన్ని తాత ముత్తాతల నుండి స్త్రీ పురుషుల కలయిక వలన గలిగిన పుత్రపౌత్రాదులకు ఇంకా తన్ను ఆశ్రయించిన శిష్యులకు, తాను సాధించదలచుకొని సాధించలేకపోయిన దానిని మీరు సాధించండి అని తెలిపితే వాళ్లూ తమ తాత ముత్తాతలు సాధించలేని దానిని సాధించాలి అనే దృఢ నిర్ణయంతో బిలీఫ్ చేత కలిగే రిలీఫ్ ఆధారంగా డెల్యూడింగ్ ఒన్ ను అంటే మాయాశక్తిని జయించమని కోరుతాడు" (చూ.ఎస్.ఎస్. సం.1టి పుట. 101 తేది 2-7-1910)

అదే యమ్.టి.ఎ. 20-8-1917 వ తేదీన ఏమని బాధపడుతూ చెప్పినారో చూడండి-

"పరిశీలించగా చాలా మంది ఈ సొసైటీలో సందేహాస్పదమైన మనస్సులతో ఏదో సరదాగా కాలక్షేపం కోసరం చేరినట్లు నేను గుర్తించినాను. వీళ్లంతా ఎందుకు చేరినారు అంటే చాలామంది సభ్యులు ఉండడం మొదటిది, వారి బంధువులంతా ఈ సొసైటీలో ఉండడం రెండవది, లోకంలో విచిత్రంగా కనిపించే దివ్యదృష్టులు (సైట్సు) ఉండడం మూడవది, విచిత్రమైన పద్ధతిలో రోగాలను నయం చేయడం నాల్గవది, వీటినన్నింటిని సంపాదించుకొని వాళ్ల కుటుంబాలకు కావలసింది సంపాదించుకొని సుఖ సంతోషాలతో వర్ధిల్లాలనీ, అన్ని కోరికలూ తీర్చుకోవాలనీ మాత్రమే చేరినారు అని తెలుస్తోంది..........................................

ఎక్కువగా చదువుకొన్నవాళ్లకు యోగం మీద భక్తిశ్రద్ధా రెండూ తక్కువగా ఉన్నాయి. సామాన్యంగా చదివినవాళ్లు యోగాభివృద్ధిని పొందుతున్నారు" అని అన్నారు పిల్లర్‌టెస్టులో

"మనము ఇది సాధించాలి" అనే దృఢసంకల్పంతో ఈ

యోగంలో చేరి క్రమం తప్పకుండా భక్తిశ్రద్ధలతో, అత్యంత విశ్వాసంతో, వినయ విధేయతలతో ప్రార్థన చేయాలని 2-7-1910న యమ్.టి.ఎ. తెలిపినారు. మరలా అదే యమ్.టి.ఎ. 20-8-1917న అంటే ఏడు సంవత్సరాల ఒక నెల పద్దెనిమిది రోజులకు (7సం.-1నె.18రో) ఏమన్నారో చూడండి" ఎవరూ సక్రమంగాలే"రని దీనిని బట్టి మాస్టరుగారు జీవించి ఉండగానే సరిగా మీడియములే ప్రాక్టీసు చేయలేదు అని తెలిందికదా?

మీడియములే సరిగా ప్రాక్టీసు చేయనప్పడు వాళ్ల సంతతి వాళ్లు ఏమి చేస్తారు? ఏమి లేదు. నాటకాలు ఆడుతారు. బూటకపు మాటలు చెప్పతారు. అంతే వీళ్లకు తెలిసింది. ఇంకా ఇతరులను మోసగిస్తారు. వీళ్ల కేదో తెలుసునని మోసపోకండి.

**36వ ప్రశ్న:- మాస్టరు యోగాన్ని శంకరయ్యరు గారు తనకు దత్తం చేసినారని శార్వరి చెప్పతున్నారు. అది ఎంతవరకు సాధ్యము? ఆ విధంగా చేయడానికి వీలవుతుందా?**

అడిగినవారు :- శ్రీ యమ్. సుందరేశన్, బి.కామ్. గారు డిస్ట్రిక్టు ట్రషరీ ఆఫీసరు (రిటైర్డు) చిత్తూరు.

సమాధానము :- శ్రీ శార్వరి అనే ఆయన ఏమైనా చెప్పగలడు, ఏమైనా వ్రాయగలడు. అబద్ధాల పంచాంగానికి అరవై ఘడియలు త్యాజ్యం అన్న సూక్తి ఈయన ఎడల అక్షరాలా సత్యము. గొట్టిబొచ్చుతో తయారుచేసిన కంబళిలో అన్నం పోసుకొని వెంట్రుక లేకుండా అన్నం తినాలి అని ప్రయత్నించే ప్రయత్నం లాంటిదే ఈయన రచనలలో సత్యాన్ని వెదకడము. ఈయన రచనలలో సత్యాన్ని వెదికిపట్టడం ఆకాశంలో పూలను వెతికి తెచ్చినట్లే.

మాస్టరుగారికి యమ్.టి.ఎ. ఏమి చెప్పిందో చూడండి-

"ఇది మార్కెట్టులో కొనే వస్తువు కాదు. డబ్బుకు దొరికేది కాదు" అని చూ.ఎస్.ఎస్.సంపు.1 పుట70)

ఇంకొకచోట ఇలా వ్రాసి ఉంది చూడండి-

"ఇది ఎవరికివారే సాధించవలసిన యోగము, పరీక్ష పాసు కావడానికి ఎంత కష్టపడి చదవాలో అంత కష్టపడి ప్రార్థనలో అంతరాత్మ పరిశీలన చేసుకొంటూ పోతూ వుంటేనే నీకు అభివృద్ధి కలుగుతుంది. నీ శ్రద్ధను బట్టి నీకు అభివృద్ధి కలుగుతుంది".

అని మాస్టరుగారు నెత్తిన నోరు పెట్టుకొని చెప్పతుంటే గురుతుల్యులు శ్రీ టి.యస్. శంకరయ్యరు మీ. నెం. 350 గారికి అమావాస్య నాడు నూవుల నీళ్లతో దత్తం చేయడానికి ఇంత ప్రపంచంలో బ్రాహ్మణుడెవడూ దొరక్కపోతే ఈ సద్బ్రాహ్మణుణ్ణి వెతికి తెచ్చి దత్తం చేసినాడు అని మనం అనుకోవాలేమో. సిగ్గూ బిడియమూ రెండూ వదిలితే ఏమైనా చెప్పవచ్చు, ఏమైనా వ్రాయవచ్చు. మాస్టరు, యమ్.టి.ఎ. తెలివి తక్కువగా పై వాక్యాలు వ్రాసినారని ఇతని అభిప్రాయము కాబోలు.

శంకరయ్యరుగారు దత్తము చేసినారు అని ఆర్గ్యుమెంటు కోసరము అంగీకరిస్తాము. మరి శంకరయ్యరుగారే-

"ప్రార్థన మాస్టరు గారి పేరు చెప్పి ఇప్పటి వాళ్లు చేయాలి, ఒలిడియర్ 3వ పేరు చెప్పి మాస్టరుగారి వద్ద ఉపదేశము పొందని ఇప్పటి వాళ్లు ప్రార్థన చేయరాదు. కోర్సులు, రెగ్యులేషన్సు చేయకూడదు" అన్నారు.

ఇవన్నీ చూచిన, చెవులార విన్న శార్వరి మరి ఒలిడియర్ 3వ పేరు చెప్పి ప్రార్థన చేయించడము, కోర్సులు చేయించడము గురుద్రోహం చేసినట్లే కదా? ఈయనకు పాపభీతి ఉన్నట్లు లేదు.

గురుద్రోహం మహాపాతకము అని తెలిసీ కూడా చేయిస్తున్నాడంటే ఈయన్ను ఏమనాలో మీరే ఆలోచించండి.

మరి శార్వరే యోగ మార్గం 1984 అక్టోబరు నెల సంచిక పుట.21లో-

"మదరాసులో మా గురువర్యులు శ్రీ టి.యస్. శంకరయ్యర్ గారు, శ్రీ గాలి. బాల సుందరరావు గారు కోర్సులు అవసరము లేదని చెప్పారు. అయితే మేము అనుష్ఠించే మంత్రం వేరు" అన్నారు.

ఈ శార్వరే యోగమార్గం 1988 ఏప్రెల్ నెల సంచిక పుట 49 లో-

"మా గురువు గారిని నేను ఆదర్శంగా తీసుకోలేదు" అన్నారు

యమ్.టి.ఎ. ఒకచోట-

'గురువుగారి యోగ్యతను అలవాట్లను గూర్చి చర్చించవద్దు' అన్నారు. (చూ. ఎస్. ఎస్. సంపు.2 పుట 17).

దీనిని బట్టి ఈయన గురుద్రోహము చేయడానికి కూడా వెనకాడని మనిషి అని తేలింది కదా? ఈయన్ను మాత్రం ఎవరూ ఏమీ అనకూడదట! అంటే నన్ను వాళ్లన్నారు, వీళ్లన్నారు అని ఏడుస్తూ వ్రాస్తుంటాడు. ఏమి న్యాయమో చూడండి.

ఇంకా ఈయనగారే ప్రకటించిన ప్రేయర్సు, కోర్సస్, 1 వ భాగం పుస్తకంలో 9వ పుటలో, 6వ నిబంధనలో-

"సాధకుని ప్రవర్తన ఇతరులు వేలెత్తి చూపి ఇదేమిటి అని అడిగే పద్ధతిలో ఉండరాదు. ఇతరులు ప్రశ్నించే విధముగా నీ అలవాట్లు ఉండరాదు" అని ప్రకటించినారు.

ఈయన రూల్సు అని తెల్లకాగితంపైన నల్ల అక్షరాలతో అచ్చు వేసినారు. ఆ రూల్సు అచ్చు వరకే పరిమితము గాని ఆచరణలో

చూన్నం.

ఈయన 24 గంటలూ సిగరెట్లు కాలుస్తూ మాస్టరుగారికీ వచ్చిన వాళ్లకూ ఆ సిగరెట్ల పొగ ధూపం వేస్తుంటాడు. మాస్టరు గారున్నారన్న పాపభీతి ఇతనికి ఏ కోశానా లేదు. చిన్నా లేదు, పెద్దాలేదు. అందరి ఎదుట పొగత్రాగుతూ ఆ పొగ అందరిమొహాన ఊదుతుంటాడు. సిగ్గు, ఎగ్గు, మట్టు, మర్యాద తెలిసిన వాళ్లు ఎవళ్లూ ఇట్టి పనులు చేయరు. 'లజ్జ' అన్న రెండు అక్షరాలను వదిలితే మూడు లోకాలను జయించవచ్చును అనె సామెత వుంది. దాన్ని సార్థకం చేయాలనే దృఢసంకల్పంతో వున్నాడేమో ఈయన.

సిగరెట్లు తాగుతూవుంటే ఇతరులు చూచి "ఇతడేనా మాస్టరుగారి యోగం చేసేవాడు. ఈ యోగం కూడా ఇట్లాగే ఉంటుందేమో నని అనుకొంటారు" అనే ఇంగిత జ్ఞానం కూడా లేని వ్యక్తి ఇతడు అని చెప్పడానికి చింతిస్తున్నాను. ఇతన్ని గూర్చి కాదు నాకు చింత. ఇటువంటి **వారల వలన** మాస్టరుగారి యోగానికి అపఖ్యాతి వస్తుందే అన్నే చింతేనాకు. ఇతని వ్రాతలన్నీ మతి స్థిమితము లేకుండా వ్రాసే వ్రాతలని ఇంతకుముందే చెప్పినాను. జ్ఞాపకం ఉందనుకొంటాను. ఇక మీదనైనా సన్మార్గంలో నడుస్తారేమో చూద్దాం.

ఈ శార్వరే యోగమార్గం 1984 అక్టోబరు సంచిక పుట 21 లో -

"అసలు తిరుపతి కేంద్రంలో ప్రార్థన కూడా చేయరు కదా! నమస్కారమ్ చేసుకొని కూర్చోవడమే వారి పద్ధతి" అన్నారు.

ఇంతకు ముందే చెప్పినాను ఈయన అసలు ఈ యోగము చేయడానికే అనర్హుడని. ప్రార్థన అంటే కప్పల్లాగా అరవడమేనని

ఈయనకు తెలిసింది. అంతరాత్మ పరిశీలన లేని ప్రార్థన నిష్ప్రయోజనము అనే విషయము ఈయనకు తెలిసినట్లు లేదు.

ఇదిగో చూడండి మాస్టరుగారికి యమ్.టి.ఎ. ఏమి చెప్పారో-

"ప్రాక్టీసు చేయకుండా నమస్కారం చేసి మంత్రాన్ని అనుకొని సూచనలను వినవలసినది" అని (చూ.డైరి.పుట.318)

మొట్టమొదట మీడియములను చేర్చుకొనేటప్పడు వారికి ఇనిసియేషన్ కార్డు ఇచ్చేవారు. అందులో వారి పేరు, నెంబరు, ఇచ్చిన తేది వేసేవారు. అందులో ఇలా వుంది-

ప్రార్థన - మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్

అని ఇంగ్లీషు, తెలుగు, తమిళ భాషలలో అచ్చువేసి వున్నది. ఆ కార్డు నా వద్ద వున్నది. చూడండి. శార్వరి నమస్కారము కాకుండా భజన చేస్తున్నారేమో? మొదటి నమస్కారానికి చేతులు రెండూ శబ్దము లేకుండా దగ్గంకు చేర్చడము, రెండవది రెండు చేతులను చేర్చి తట్టడము, భజనే బాగుంది అనుకొన్నారేమో!

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యుడయిన నేను సుశిక్షితుడైన సైనికుడిలాగా మెలగడం నేర్చినవాడిని. ఈయనలాగా క్రమశిక్షణారాహిత్యంగా మెలిగే సైనికుణ్ణికాను, గురుద్రోహినీ కాదు. ఇతన్నీ ఇతని రచనలను గురించీ చెప్పాలంటే ఇంకా ఎంతో వుంది ఇప్పటికి చాలు.

**37వ ప్రశ్న:- సైంటిఫిక్ యోగ అన్నారు కదా సైంటిఫిక్ అనే దానికి మాస్టరుగారు చెప్పినవి ఏవైనా చెప్పండి తాతగారూ?**

అడిగినవారు :- చి॥ సౌ॥ యస్. యోగప్రభ, తిరుపతి.

సమాధానము:- ప్రశ్న చూస్తే చిన్నదిగానే ఉంది కానీ

చెప్పాలంటే చాలగానే ఉంటుంది. ఎందుకంటే ప్రతి-చిన్న విషయము కూడా గణితము, రసాయనశాస్త్రము, భౌతిక శాస్త్రము, వగైరాల ఆధారంగా రచించినవే. అవన్నీ మాస్టరుగారి నోట్సులు, డైరీలు చూస్తే తెలుస్తాయి. "సైంటిఫిక్ మరియు మెకానికల్ ప్రిన్సుపుల్సును అనుసరించి సూచనలు ఇస్తున్నాను" అన్నారు.

ఇంకొకచోట-

"ఫోటో తీసిన తరువాత ఫిల్మును రసాయన పదార్థాలలోవేస్తే ఆ ఫిల్ములో బొమ్మకానవస్తుంది. అట్లాగే నా ప్రాక్టీసు కూడ" అన్నారు మాస్టరుగారు (చూ.డైరి.పుట.133)

ఇంకొకచోట-

"రాకెట్టులాగ పూర్వజన్మకర్మ తొలగిపోతుంది" అన్నారు.

మాస్టరుగారు మరొకచోట-

"ప్రైమస్ స్టౌలాగ సన్నసన్నగా ప్రాణం పోతుంది" అన్నారు. (చూ.నోట్సు,వాల్యు2 పుట.70)

యమ్.టి.ఎ. ఒకచోట-

"నీసైంటిఫిక్ మెమరికి" అన్నారు (చూ.ఎస్.ఎస్.సం.2 పుట49) ఇంకా ఎస్. ఎస్.1 సంపుట 4, ఎస్.ఎస్. సం.3 పుట.68 వగైరా.

అంటూ ఎన్నో ఉదాహరణలు ఇచ్చియున్నారు.

మాస్టరుగారి కాలానికి "స్కానింగ్" అనేమాటే పుట్టలేదు. ఎవరూ ఎరగరు కూడ. అయితే మాస్టరుగారు-

"ఈ శరీరాన్ని స్కాన్ చేసి చూచినాను" అన్నారు.

ఇంకా వైద్యశాస్త్రానికి సంబంధించిన నేటికీ వైద్యుల చే గుర్తింపరాని ఎన్నో కొత్త కొత్త విషయాలు పేర్కొన్నారు - చూడండి-

"రెజిమెంట్ ఐ, బోల్తాకాషన్ మార్కు, నైనా బోలేహోలో ఐ, అనే కండ్ల జబ్బులకు బలాన్ని ఇస్తుంది" అన్నారు. (చూ. సంపు.1 టి పుట 12).

**38వ ప్రశ్న:- ఎటర్నటి సంపాదించిన ప్రాచీనుల పేర్లు ఇంతకు ముందు అడిగినాము, తరువాత చెప్పతాను అన్నారు ఇప్పుడు చెప్పండి సార్.**

అడిగినవారు :- శ్రీ ఆర్. మునికుమార్ గారే.

సమాధానము:- ఇంతకు పూర్వము ఎటర్నటి సంపాదించిన ప్రాచీనుల పేర్లు అడిగినప్పుడు తరువాత చెప్పతానన్నాను. ఇప్పుడు చెప్పతాను వినండి-

1. కశ్యపుడు - ఒక బ్రాహ్మణుడు. విష వైద్యము నేర్చినవాడు. తక్షకుడనే పాము చెట్టును కాటు వేయగానే ఆ చెట్టు, చెట్టుపైనున్న బ్రాహ్మణుడు బూడిదైపోయినారు. కశ్యపుడు తన మహాత్మ్యముతో బూడిదైన చెట్టును, బ్రాహ్మణుని తిరిగి బ్రతికించి ముందటి రూపమును కల్పించినాడు. (చూ. పూర్వగాధాలహరి. పుట 90-91 భార)

2. గౌతముడు - చనిపోయిన గోవుపై శివుని జటాజూటము నుండి తెచ్చిన వెంట్రుకలలోని పవిత్రజలాన్ని ఆగోవుపై చల్లి బ్రతికించినాడు. (చూ.పూ.గా.పుట. 144. ఉ.రా.)

3. శుక్రుడు :- ఇతడు మృత సంజీవని విద్య నేర్చినవాడు. బృహస్పతి పుత్రుడైన కచుని రాక్షసులు చంపి, భస్మము చేసి శుక్రునికే త్రాగడానికి ఇవ్వగా త్రాగినాడు. ఆ విషయాన్ని తెలుసుకొని తిరిగి కచుని బ్రతికించి మామూలు మనిషినిగా చేసినాడు. (చూ.పూ.గా.పుట 77, 460, భా.ర.)

4. కచుడు - ఇతడు తన.గురువైన శుక్రుని ద్వారా గర్భమున

నుండగానే మృత సంజీవని విద్యను నేర్చి చనిపోయిన తన గురువైన శుక్రుని బ్రతికించినాడు. (చూ.పూ.గా.పుట. 77, 460 భార)

5. రురుడు - ఇతడు పాము కరచి చనిపోయిన ప్రమద్వరను బ్రతికించినాడు. (చూ.పూ.గా.పు.289, 383, భా.ర.)

6. బలరామకృష్ణులు - సాందీపుని పుత్రుడు చనిపోగా వానిని బ్రతికించినారు. (చూ.పూ.గా. పు.297, 485, భాగ)

దేవకికి కలిగిన ఆరుగురు పుత్రులను కంసుడు వధించినాడు. దేవకి చనిపోయిన తన పుత్రులను చూడాలని కోరగా వారిని తెచ్చి సజీవముగా దేవకికి చూపినారు.(చూ.పూ.గా. పు.297 భాగ)

7. ఆయువు - సూర్యవంశపురాజైన పరీక్షిత్తు భార్య సుశోధన కొలనులో మునిగి కానరాకపోగా కప్పల రాజైన ఆయువు వృద్ధ బ్రాహ్మణ వేషములో వచ్చి సుశోధనను మరల సశరీరముగా రప్పించినాడు (చూ.పూ.గా. పు267 భార)

8. శ్రీ కృష్ణుడు - ఉత్తర గర్భమందున్న శిశువును అశ్వత్థామ బాణములతో కొట్టగా శిశువు విగత జీవుడయ్యెను. ఉత్తర ప్రార్థించగా శ్రీకృష్ణుడు కరుణచే ఉత్తర గర్భమందున్న శిశువును బ్రతికించెను. అతడే పరీక్షిత్తు (చూ.పూ.గా. పు.268 భా.ర)

9. నచికేతుడు - ఇతడు వాజశ్రవసుని కుమారుడు. ఇతడు నచికేతుని యమున కిచ్చినాడు. యముని ఇంట మూడు రోజులుండి తిరిగి భూమికి వచ్చినాడు. మూడురోజులు శవము నిల్వ వుండెను. (చూ.పూ.గా. పు.247) కఠోపనిషత్తు.

10. వామదేవుడు - ఇతడు బ్రాహ్మణుడు. దలుడను

రాజపుత్రుడు శాపముచే చనిపోగా వానిని అనుగ్రహించి తన శక్తిచే బ్రతికించినాడు. (చూ.పూ.గా. పు.403, భా.ర.)

11. ఋషభయోగి - సుమతి కుమారుడు చనిపోగా అతని శరీరమంతా విభూతి పూసి చనిపోయిన కుఱ్ఱవానిని ఇతడు బ్రతికించినాడు. (చూ.పూ.గా. పు.312, 506, బ్రహ్మాండపురాణము).

12. చిరుతొండనంబి - ఇతడు తన కుమారుడైన శిరియాళుని చంపినాడు. శివుని ప్రభావముచే తిరిగి బ్రతికించినాడు. (చూ.పూ.గా. పు.489, హర విలాసము).

13. బృహస్పతి - శివుని ప్రార్థించి భస్మమైన ఇంద్రుని బ్రతికించినాడు. (చూ.పూ.గా. పు.305, శివ పురాణము).

14. అనసూయ - అత్రి మహాముని భార్య. సుమతి భర్తయైన కౌశికుడు చనిపోగా ఈమె బ్రతికించింది. (చూ.పూ.గా. పు.19, మార్కం. పురా).

15. సావిత్రి - చనిపోయిన తన భర్తను సత్యవంతుని బ్రతికించింది. సత్యవంతుడు నిద్ర నుండి మేల్కొన్నట్లు లేచినాడు. (చూ.పూ.గా. పు.487, భార).

16. జ్యోతి రామలింగ స్వామి - అన్నిటికంటే విచిత్ర విషయాన్ని మీకు చెప్తాను, వినండి. ఈ విషయం ఇంతవరకు యోగమిత్రులెవరూ మీడియములతో సహా ఎరిగిన దాఖలాలు లేవు.

జ్యోతి రామలింగస్వామి అనే తిరు అరుళ్ ప్రకాశ వళ్లలార్ అనే ఆయన 5-10-1823 వ తేదీన దక్షిణ ఆర్కాట్ జిల్లా చిదంబరం తాలూకా మరుదూరులో పుట్టినారు. తల్లి చిన్నమ్మ, తండ్రి రామయ్య పిళ్లై, భార్య ధనకోటి అమ్మాళ్.

ఈయన 1825 నుండి 1858 వరకు మదరాసు లోను, 1858 నుండి 1867 వరకు కరుంగుళిలోను, 1867 నుండి 1870 వరకు వడలూరులోను 1870 నుండి 1874 వరకు మేట్టుకుప్పములోను నివసించినారు.

30-1-1874 శ్రీముఖనామ సంవత్సరం తైనెల 19వ తేది శుక్రవారము వడలూరులో జ్యోతి రూపములో సిద్ధిపొందినారు.

ఈయన ఏమన్నాడు అంటే -

"దేహాన్ని ధరించిన ప్రతిమానవుడు చావు, వ్యాధులు, ముసలితనము, కష్టాలు వగైరాలతో నలిగిపోతున్నాడు. వీటినన్నింటిని పారద్రోలి ఈ మానవ శరీరాన్నే ఎటర్నల్‌గా అంటే శాశ్వతంగా ఏకాలంలోగాని, ఏవిధంగాగాని, ఎవరిచేతగాని బాధింపబడకుండా పేరు ప్రసిద్ధులు కలిగి ఉండేటట్లు చేయాలి అన్నదే నాకు కలిగిన అతి తీవ్రమైన సంకల్పము. నన్ను దానికి తగిన వానినిగా తయారు చేయుము.

ధాతుజం, వృక్షజం, జంతుజం వగైరాలలో జన్మలు తీసుకొని కొన్ని లక్షల సంవత్సరాలు గడిపి ఈ మానవ శరీరము ధరించినాను. ఈ శరీరానికి చావు, వృద్ధాప్యము, వ్యాధులు అన్నీ తొలగిపోయి శాశ్వతత్త్వము ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తున్నాను.

చనిపోయినవారు ప్రాణంతో తిరిగి రావడము, ముసలివాని ముసలితనము పోయి యౌవ్వనుడు కావడము మొదలైన అద్భుతాలను మీరు చూడబోతున్నారు.

ఇవన్నీ మనకు సంపాదించి పెట్టడానికి రాబోయే మహా పురుషుడు ఎటువంటివాడు అంటే శాస్త్రాల్లో, పురాణాల్లో పేర్కొన్న వ్యక్తిగాని, మూర్తిగాని, దేవతగాని, భగవంతుడుగాని, భక్తుడు గాని,

యోగి గాని, జ్ఞాని గాని, వీళ్లల్లో ఏ ఒక్కడూ కాడు.

మరి ఆయన ఎవరంటే పైన చెప్పిన అందరు మూర్తులూ, అందరు దేవతలూ, అందరు దేవుళ్లూ, అందరు యోగులూ, అందరు జ్ఞానులూ వాళ్ల వాళ్ల అనుభవాలను అనుసరించి ఎప్పడో మనలను ఉద్ధరించడానికి ఒక మహాత్ముడు జన్మిస్తాడు అని వేయి కన్నులతో ఎదురుచూచే నాథుడు జన్మిస్తాడు. ఇతడొక ప్రత్యేకమైన వ్యక్తి, ఇది సత్యం, ఆమహాత్ముణ్ణి తెలుసుకోగలను! తెలుసుకొంటున్నాను!! ఆ తెలుసుకొన్నాను!!! నేనే కాదు నా తరువాతి వాళ్లు గూడా తెలుసుకో గలరు. తెలుసుకోగలరు, తెలుసుకొంటున్నారు. సందేహించకండి అని. ప్రజోత్పత్తి సంవత్సరము చిత్రిమాసము 1వ తేది 1871 న సిద్ధి విళాగము అనే గ్రామంలో చెప్పినారు. (11-4-1871 గురువారం - రోహిణి నక్షత్రం)"

ఈయన సమరస వేద పాఠశాల అనే దానిని ఏర్పాటు చేసినారు. అందులో చేరగోరే వారికి రూల్సు, రెగ్యులేషన్సు ఇచ్చినారు. మీరూ వినండి-

"పదహైదు సంవత్సరాలకు పైబడిన వయస్సు కలిగి ఉండాలి, తెలివైన వాడుగా ఉండాలి, భగవంతుని మీద భక్తి కలిగినవాడుగా ఉండాలి, ఆరోగ్యవంతుడవేగా ఉండాలి, ప్రజలంతా సుఖసంతోషాలతో వర్ధిల్లాలి అనే సత్సంకల్పము కలిగినవాడుగా ఉండాలి, త్రికరణశుద్ధి కలిగినవాడుగా ఉండాలి, (అంటే మనసులో ఏది తలుస్తాడో దానినే నోటితో చెప్పాలి, ఏది చెప్పతాడో అది ఆచరించాలి. ఇది త్రికరణ శుద్ధిఅంటే). సత్యము మీద విశ్వాసము కలిగినవాడుగా ఉండాలి. అబద్ధాలు చెప్పకుండా ఉండాలి, తోటి మానవులకు ఉపకారము చేయాలి అనే సత్సంకల్పం కలిగి ఉండాలి.

ఈ సద్గుణాలు అన్నీ కలిగినవాళ్లు ఈ శుద్ధ సన్మార్గ సంఘములో సభ్యులుగా ఉండడానికి అర్హులు.

చావు లేకుండా ఉండడాన్ని చూచినారు. మనము ఇప్పుడు ఈ శరీరముతో ఉన్నాము. ఇకపై అందరి శరీరాలలో దూరి చూస్తాము.

భగవంతుడు వున్నాడు అని నమ్మి పూజించే విషయంలో అడ్డం చెప్పరాదు. ద్వేషము, క్రోధము ఉండరాదు. ఒకవేళ ద్వేషము, క్రోధము కలిగినా వెంటనే జాగ్రత్త పడి పూర్తిగా ద్వేషాన్నీ, క్రోధాన్నీ పోగొట్టుకోవాలి. అట్లా ద్వేషాన్నీ, క్రోధాన్నీ పోగొట్టుకోనివారికి ఈ సంఘములో స్థానము లేదు. వెంటనే సంఘాన్ని వదలి వెళ్లండి. ద్వేషంతో, క్రోధంతో ఉండేవాళ్లు వెంటనే సంఘాన్ని వదలి వెళ్లకపోతే మిగిలిన సంఘ సభ్యులందరూ కలిసి వారిని బహిష్కరించి తరిమి వేయండి.

చనిపోయినవారిని పూడ్చిపెట్టాలి. కాల్చరాదు. చనిపోయినవారు తిరిగి జీవించి మనతో ఉండడాన్ని మనము చూస్తాము అనే పూర్తి నమ్మకంతో ఉండాలి- చలించకుండా ఉండాలి- ఏడవరాదు- భగవంతుడు ఇతనిని తిరిగి బ్రతికిస్తాడు అని ఉండాలి- పురుషుడు చనిపోతే భార్య తాళి తీసివేయవలసిన పనిలేదు- భార్య చనిపోతే భర్త రెండవ పెండ్లి చేసుకోరాదు- సంతానం ఉంటే చింతపడ నక్కరలేదు- కర్మకార్యాలు ఏవీ చేయవలసిన పనిలేదు- ముఖ్యులకు తెలియజేసి ఒకరోజు అన్నదానం చేసేది- ఈ పత్రిక వచ్చిన తరువాత చనిపోయిన వారు కూడా తిరిగి బ్రతికి సశరీరంతో వస్తారు.

చచ్చినవారు తిరిగి వస్తారు అని నమ్మి చేయండి. ఇది

సమరస వేద సన్మార్గ సంఘమూ, ధర్మశాలా ఈ రెండూ కలిసి ప్రకటించినది అని తెలుసుకోండి. నాకు ప్రీతిపాత్రులై చనిపోయిన నా అన్నదమ్ములూ, అక్కాచెల్లెళ్లూ లాంటివారు అందరూ పార్వతీ పురం సమరస సన్మార్గ సంఘ ధర్మశాలకు అతి సమీపకాలంలో సశరీరంగా తిరిగి వచ్చే రోజులు చాలా దగ్గరలో ఉన్నాయి. ఆ సమయంలో ఈ ధర్మశాలను నమ్ముకొని ఉన్నవాళ్లంతా తప్పక తిరిగి సజీవంగా సశరీరంగా వస్తారు. ఇది సత్యం. సత్యమ్.

ఇంకా గొప్ప సంతోషాన్ని త్వరలో పొందబోతున్నారు. ఈ సంఘంలో లేనివారికి ఈ జాబును చూపకండి" అని.

ఈ పత్రిక ప్రమోదూత సంవత్సరం పంగునిమాసం 18 వ తేది 1871 న ప్రకటింపబడింది. (30-3-1871 గురువారం। ఆశ్లేషా నక్షత్రం).

ఇంకా ఏమి చెప్పినారో చూడండి-

"కర్తార్లు అంటే క్షుద్ర దేవతలు, అనేక రూపాలలో ఉండే విష్ణుని గ్రహాలు, బ్రహ్మ, శివుడు వీళ్లంతా కొంతవరకే పనిచేస్తారు. అంతకుపైన వీళ్లకు శక్తిలేదు- పని చేయలేరు.

మీరు వేదాలమీద- ఆగమాల మీద- మత గ్రంథాల మీద విశ్వాసాన్ని పెట్టుకోకండి. వాటిమీద విశ్వాసం ఉంటే ఈ సమరస సన్మార్గ సంఘంలో మీకు అభివృద్ధి కలగదు. సంఘంలో సభ్యులు కాకపోతే మీరు సాధించేది ఏమీ లేదు. అవన్నీ వదలండి. అన్నీ ఇవ్వడానికి సమర్థుడైన ఆ ఒక్కనినే సత్యమైన వానినే ధ్యానించండి.

పరోపకారం, దయ కలిగి ఉండండి. పరోపకారం అనేది శరీరంచేత చేయవలసి వస్తే శరీరంచేత- మాట సహాయం చేత చేయవలసి వస్తే మాటలచేత- ఆర్థిక సహాయంచేత అయితే

ఆర్థికంగాను సహాయం చేయండి. దయయే సద్విచారమనేది. పురుషులయెడ స్త్రీలయెడ దయతో ఉండడం, భగవంతుడైన ఆ ఒక్కనిని పొగడడం, తన తప్పిదాలను ఆ ఒక్కనికి విన్నవించడం, వీటిచేతనే ఈ శరీరం పవిత్రమవుతుంది.

ఈ సులభమైన మార్గాన్ని వదలి ప్రాచీన మార్గాలను అవలంబించి యోగులు వనాలలో- పర్వతాలలో- గుహలలో- నూరు సంవత్సరాలు- వేల సంవత్సరాలు తపస్సు చేసినారు. శరీరానికి కష్టాన్ని కలిగించుకొన్నారు.

మనలను రక్షించేనాథుడూ ఆ ఒక్కడైనవాడూ వచ్చేది సత్యమే- మనవాళ్ల ఆశ తీరబోయేది సత్యమే- మీరంతా (ఎటర్నటీని) శాశ్వతత్వాన్ని పొందబోయేదీ సత్యమే.

మొదట నేను శైవమార్గంలో అత్యంత భక్తిశ్రద్ధలు కలవాడిని- ఈ విషయం పట్టణత్తారుకు, వేలాయుధ మొదలియారుకు ఇంకా కొంతమందికీ తెలుసు. అటువంటి నేనే అన్నీ వదలి ఒకడైన వాణ్ణి కొలుస్తున్నాను. దానిని వదిలిన తరువాత నేను ఎంతో అభివృద్ధిని పొందినాను. మీరూ అన్నీ వదలి రాండి. మీరూ నాలాగా అభివృద్ధిని పొందండి.

ఇంతకుముందు ప్రాచీన మార్గాలను అనుసరించడంచేత నేను అభివృద్ధిని పొందలేదు. దయ, కరుణ అనేవి రెండూ అలవడిన తరువాతనే నేను ఎదగ గలిగినాను. ఇవి రెండూ కలగడానికి ప్రేమ అవసరం. ప్రేమ అంటేనే దయ. దయ ఉంటేనే మనం పెరగగలం. ఇవన్నీ కలిగి వున్నాను కాబట్టే నా ఆత్మజ్ఞానం ఇప్పుడు అండాండాల హద్దులు దాటిపోయింది. ఆ శక్తి ప్రేమ చేతనే కలిగింది. మీరూ ప్రేమను పెంచుకోండి. నాపై ప్రేమ చూపని మూర్ఖునికి మంచి

మాటలు చెప్పి చూస్తాను, బెదిరించి చెప్తాను, దండం పెట్టి చెప్తాను, వాడికి కావలసిన సహాయంచేసి చెప్తాను, అప్పటికీ వాడి మూర్ఖత్వం తొలగిపోకపోతే ఒకడైన భగవంతునికి నమస్కరించి వాణ్ణి చక్కదిద్దమని ప్రార్థిస్తాను. ఎట్లాగైనా తప్పదారిలో నడిచేవానిని చక్కదిద్దడానికి ప్రయత్నిస్తాను. మీరందరూ అట్లాగే మూర్ఖులను చక్కదిద్దడానికి ప్రయత్నించండి. ప్రపంచంలోని జనాన్ని వదలి నేను ఒక్క క్షణంకూడా ఉండలేను. అందుకని ఎల్లప్పుడూ వీళ్లను బాగుపరచమని విన్నవిస్తుంటాను. ఎందుకంటే యోగసభ్యులు కావడంచేత, మానవులంతా నా అన్నతమ్ములనీ నా అక్కచెల్లెండ్రనీ తలుస్తూ వారి క్షేమాన్నే కోరుతూ ప్రార్థిస్తున్నాను" అని.

ఇంతదూరం ఎందుకు చెప్పినాను అంటే జ్యోతి రామలింగ స్వామి 1825 వ సంవత్సరమునుండి 1874 వ సంవత్సరం వరకు ఉన్నారు.

మాస్టరుగారు 4-8-1868లో పుట్టినారు. రామలింగస్వామి చనిపోయేటప్పటికి మాస్టరుగారి వయస్సు అయిదు సంవత్సరాల అయిదు నెలల ఇరవై ఆరు రోజులు. (5 సం. 5 నె. 26 రో).

రామలింగస్వామి 11-4-1871 వ సంవత్సరంలో శాశ్వతత్వాన్ని సాధించే వ్యక్తి పుట్టినాడు అన్నారు. ఆయన దివ్యచక్షువుతో చూచినాడు అన్నమాట. ఈ మాట రామలింగస్వామి చెప్పేటప్పటికి మాస్టరుగారికి రెండు సంవత్సరాల ఎనిమిది నెలల ఏడు రోజుల వయస్సు (2 సం. 8నె. 7రో). కాబట్టి జ్యోతి రామలింగ స్వామి చూచినాను అని చెప్పింది మాస్టరు సి.వి.వి. గారిని గురించే అయి వుండాలి అని నేను అనుకొంటున్నాను.

రామలింగస్వామి ఏర్పాటుచేసిన సమరసవేద పాఠశాల లేక

సమరస సన్మార్గ సంఘము, ధర్మశాల అనే వాటికి ఏర్పాటు చేసిన రూల్సు, రెగ్యులేషన్సు, ఆశయాలు అన్నీ మాస్టరుగారి మార్గంలో ఉండడంచేత ఇంత దూరం చెప్పినాను.

జ్యోతి రామలింగస్వామి సమరసవేద పాఠశాల అన్నదానికి, మాస్టర్ యోగాస్కూలు అన్నదానికి, రామలింగస్వామి సమరస సన్మార్గ సంఘము అన్నదానికి, మాస్టరుగారు యోగఫ్రెండ్సు సొసైటి అన్నదానికి, రామలింగస్వామి ధర్మశాల అన్నదానికి, మాస్టరుగారు లాడ్జి అన్నదానికి పోలికలు ఉన్నాయి.

ఇకపోతే రామలింగస్వామి చావును, ముసలితనాన్ని, వ్యాధులను, భయాన్ని, కష్టాలను తొలగించి, జాతి, మత కుల, విచక్షణ లేకుండా మానవుల నందరిని ఉద్ధరించాలి అన్నారు. మాస్టరు గారి ఆశయము కూడా అదే.

కాబట్టి యోగమిత్రులు శ్రద్ధతో రామలింగస్వామి రూల్సు, రెగ్యులేషన్సు, ఆశయాలు కంపేరుచేసి అంటే పోల్చి చూస్తే మీకు విషయం అర్థమౌతుంది. దానికై ప్రయత్నించండి.

రామలింగస్వామి కూడా ఎవరినో చావు నుండి తప్పించి నట్లు ఈయన చెప్పిన 'చావు లేకుండా ఉండడాన్ని చూచినాను' అన్న వాక్యం వల్ల తెలుస్తూంది. బ్రతికించిన వారి పేరు తెలియరా లేదు.

వీళ్లల్లో చాలా మంది బ్రాహ్మణ మహర్షులే. మహర్షులలో చాలా మంది వానప్రస్థాశ్రమము తీసుకొన్నవారే. ధర్మశాస్త్రాలలో వానప్రస్థాశ్రమము తీసుకొన్నవారు పుత్రపౌత్రాదులతో సంబంధం పెట్టుకోవచ్చును అని వుంది. భార్యతో అరణ్యవాసం చేయాలని వుంది. అట్లా చేసినవారే వీరంతా. వీళ్లంతా సన్యాసాశ్రమము

తీసుకొన్నవారు కాదు. ఋషులే కాదు ఋషిపత్నులు కూడా చనిపోయినవారిని బ్రతికించినట్లు పురాణాలు చెప్పినవి చూపినాను.

"డెబ్బై సంవత్సరాలు వచ్చిన తరువాత సన్యాసాశ్రమము తీసుకోవాలి. భార్యాపుత్రులతో సంబంధంగాని, వారిని గూర్చిన చింతగాని ఉండరాదు, గుండు చేయించుకోవాలి, కాషాయ వస్త్రం ధరించాలి, కమండలం ధరించాలి, త్రిదండం ధరించాలి, భిక్షా పాత్రం చేత పట్టాలి. కామక్రోధాదులను వదలాలి, గ్రామాలలో నివసించరాదు. ఒక ఊళ్లో ఒక రోజు కంటే ఎక్కువగా ఉండరాదు. ఆ ఉండేది కూడా ఊరి వెలుపల వుండే మఠంలో గాని, దేవాలయంలో గాని ఉండాలి. చాతుర్మాస్యమప్పడు మాత్రం నాలుగు నెలలు ఒకేచోట ఉండాలి. నిత్యాగ్నిహోత్రుడైన బ్రాహ్మణుని ఇంటిలో మాత్రమే భిక్ష స్వీకరించాలి. వాళ్ల ఇండ్లలో భోజనం చేయరాదు. నిత్యాగ్నిహోత్రుని ఇంట భిక్షకై ఆవుపాలను పిండడానికి ఎంత సమయం పట్టుతుందో అంతసేపు వేచి ఉండాలి. అంత సమయంలోగా భిక్ష పెట్టకపోతే దు:ఖపడకుండా వెళ్లాలి. భిక్షాకాలం కానప్పడు ఎవరి ఇంటికీ వెళ్లరాదు. భిక్షాన్నం నుండి సూర్యునికి కొంత, విష్ణువుకు కొంత, బ్రహ్మకు కొంత, మొట్టమొదట ఇవ్వాలి. ఆ తరువాత అన్ని భూతాలకు బలి అన్నాన్ని ఇవ్వాలి. మిగిలితే ప్రాణరక్షణకై ఎనిమిది ముద్దలు పిడికిలిలో పట్టినివి తినాలి, నిత్యాహ్నికాలు నిర్వర్తించాలి, ధ్యానంచేత పరమాత్ముని దర్శించాలి, ధర్మాన్ని అనుష్ఠించాలి, నారాయణుడే పరదైవమని ఆరాధించి జీవించాలి" అని ధర్మశాస్త్రాలు తెలుపుతున్నాయి. (చూ. శ్రీ. వైఖానస కల్పసూత్రం పు.141, 142)

ఇప్పటి సన్యాసులలో చాలామంది ధర్మసూత్రాలను ఉల్లంఘించినవారే, మత ప్రచారం చేస్తున్నవారే, విలాస జీవితాలను గడుపుతున్నవారే.

మాస్టరుగారు ఒకచోట-

"గృహస్థాశ్రమంలో ఉంటూనే యోగి కావాలి; సన్యాసి కానవసరము లేదు" అన్నారు (చూ. డైరి పుట. 327)

మరొకచోట-

భార్యా పిల్లలను వదలకుండా సంసార జీవితయాత్ర సాగిస్తూనే జ్ఞానాన్ని సంపాదించడానికి ఇక్కడ ఈ సంస్థ ఏర్పాటు చేయడం జరిగింది. అని అన్నారు (చూ. ఇండిపెండెన్సు డిక్లరేషన్ 1910).

ఇంకొకచోట - అంటే 20-8-1917 నాటి పిల్లర్ టిస్టులో కూడా చెప్పినారు. ఈ విషయం ముందే కొంత చెప్పినాను. చదవండి-

ఈ యోగంలో మీడియములుగా చేరగోరేవారి వయస్సు 21 సంవత్సరాల నుండి 55 సంవత్సరాల మధ్యకాలంలో ఉండాలి అనే నియమాన్ని ఏర్పాటుచేసినారు. ఎందుకంటే గృహస్థ ధర్మాన్ని అనుసరిస్తూ సృష్టి రహస్యాన్ని తెలుసుకోవాలి అని మాస్టరుగారి సంకల్పము. సృష్టి రహస్యాన్ని తెలుసుకోవడము ఒక్క సంసార జీవితంలోనే సాధ్యం కాబట్టి సన్యాసి కారాదు అన్నారు. శాస్త్రప్రకారం ఏర్పాటుచేసిన సన్యాసాశ్రమాన్ని ఆచరించడం చాలా కష్టంతో కూడినపని అని కూడా అన్నారు మాస్టరుగారు.

యమ్.టి.ఎ. ఒకచోట-

"బ్రాహ్మణులను చులకనగా చూచేవారికి ఎటర్నటీ రాదు"

అదే యమ్.టి.ఎ. మరొకచోట-

"నేను బ్రాహ్మణుణ్ణి, ఆర్యవేదాంతిని, ఒన్‌పాయింట్ నన్ను ఈ సంస్థను డెవలప్ చేయమని పంపింది" అన్నారు.

బ్రాహ్మణులు అని అన్నారని చాలామందికి కోపం రావచ్చు. శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలపతి, ఎన్.బి.వి. రామమూర్తి, శార్వరి, పాములపాటి సుబ్బయ్యగారలంతా అట్లా ఏడిచేవాళ్లే. ఎవళ్లు ఏడిస్తే ఏం లాభం.

భృక్తరహిత తారకరాజయోగాన్ని చేసినంత కాలం బ్రాహ్మణత్వాన్ని అంగీకరించి తీరాలసిందే లేదా ఈ యోగాన్ని వదలి వీళ్లంతా వీళ్లపేర్లతో వేరే యోగాన్ని ఆరంభించే దమ్ములుంటే ఆరంభించి చేసుకోవచ్చును.

"నా రూల్సు, రెగ్యులేషన్సు నా సూత్రాలు నచ్చకపోతే ఈ యోగాన్ని వదలి వెళ్లడం మంచిది" అని మాస్టరుగారికి యమ్.టి.ఎ. ఒక సందర్భంలో చెప్పింది. ఆ యమ్.టి.ఎ. వాక్యాన్ని అనుసరించి వీళ్లంతా ఈ యోగాన్ని వదిలివెళ్లడం అంతకంటే మంచిది.

**39వ ప్రశ్న:- మాస్టరుగారి ప్రార్థన చేసేవాళ్లు ఇతర దేవుళ్లను పూజించరాదనీ, బీజాక్షరాలు వగైరాలు జపించరాదనీ అంటారు కదా మీరు? అట్లా చేస్తే ఏమవుతుంది?**

అడిగినవారు :- శ్రీ పి. ఎరికలయ్య గారు, మాస్టర్సు బుక్ డిపో, తిరుపతి.

పై వాక్యాన్ని నేను చెప్పలేదు. యమ్.టి.ఎ. చెప్పిందే. ఈ విషయంలో యమ్.టి.ఎ. మాస్టరుగారికి ఏమి చెప్పిందో చెప్తాను వినండి.

యమ్.టి.ఎ. ఒకచోట-

"నా అనుభవాన్ని బట్టి చెప్పతున్నాను. ప్రపంచంలో మనుష్యులలో వ్యత్యాసం లేదు. అందరూ సమానమే. అయితే వారి ప్రవర్తనలోనే వ్యత్యాసము. కొంతమంది ఒకే రకమైన భావాలతో ఉంటారు. కొందరు ఇంకొక రకమైన భావంతో ఉంటారు. మామూలు కండ్లతో చూస్తే ఇదంతా విచిత్రంగా కనిపిస్తుంది. కొంతమంది చూడడానికి ఒక రకంగాను, లోపల మరొక రకంగాను ఉంటారు. ఈ విచిత్రాలన్నీ మీరే చూచి నిర్ణయించుకోండి. ఇటువంటి స్థితిలో మానవుడు ఏమిచేయాలి? గుడికిపోయి దేవుళ్లను పూజిస్తున్నాడు. ఎందుకు వారిట్లా చేస్తారో నాకు అర్థం కావడం లేదు. ఎన్ని రకాలుగా చెప్పినా, నిరూపించినా మరలా మరలా పూజలే చేస్తున్నారు. ఇందుకోసమేనా మిమ్మల్ని పుట్టించింది?

గుళ్లకు పోయి మీరు దేవుళ్లను పూజిస్తున్నారు. మరి మీకెందుకు కష్టాలు కలిగిస్తున్నాడు ఆ భగవంతుడు? ఎన్నో రకాలైన వేషాలు వేసుకొని పగలనక రాత్రనక మానవులకు అనేక రూపాలలో కనిపించే ఆ భగవంతుడు ఎందుకు కష్టాలు కలిగిస్తున్నాడు? ఏమిటిది? థీసాఫికల్ సొసైటివాళ్లు విగ్రహ రూపాలను ధరించిన దేవుళ్లను గూర్చి ఎన్నోరకాలుగా, ఎంత వివరించి చెప్పినా ప్రపంచంలోని జనం అర్థం చేసుకోలేకుండా ఉన్నారు. ఏది చేయాలి? ఏది చేయకూడదు. అని నిర్ణయించుకోలేక ఏదో గుడ్డి ఎద్దు చేనబడ్డట్లు చేస్తున్నారు. దీనికి నేను చింతిస్తున్నాను. వాళ్ల మతిమరపువల్ల ఇట్లా చేస్తున్నారు. దేవుళ్లు చదువురానివాళ్లు పూజించడానికి ఏర్పాటు అయినవారు" అని (చూ. ఎస్. ఎస్. సంపు.3 పుట.3-4)

ఇంకొకచోట యమ్.టి.ఎ. ఇట్లా చెప్పింది.

"యస్.పి. రామయ్యరు గణపతిని పూజించడం చేత అభివృద్ధి చెందలేక పోయినాడు. ఇతనికి ఇనిసియేషన్ ఇచ్చి ఇతనిని అభివృద్ధిపరచి సుఖ సంతోషాలతో వర్థిల్లేటట్లు చేస్తాను" (చూ. ఎస్. ఎస్. సంపు.4 పుట.50)

యమ్.టి.ఎ. మరొకచోట-

"నీవు అనుసరించే ప్రాచీన మార్గాలతో దీనిని పోల్చవద్దు. పాత మార్గాలను పూర్తిగా మరచిపో. నీ బుఱ్ఱను చెడగొట్టు కోవద్దు' అని అన్నారు. (చూ. ఎస్. ఎస్. సంపు.4 పుట.117-118)

యమ్.టి.ఎ. ఇంకా ఏమన్నారో వినండి-

"సంపూర్ణమైన విశ్వాసంతో ఈ లైన్ను అనుసరించాలి. మత సంబంధ విషయాలతో దీనిని ముడి పెట్టరాదు. ఇతర మంత్ర తంత్రాలను అనుష్ఠించరాదు. అట్లా ఎవరైనా అనుష్ఠిస్తే మీరు కోరే ఫలితం మీకు కలుగదు. పైగా దానికి విరుద్ధమైన ఫలితాలు కలుగుతాయి. ఉదాః ఇస్తాను, కుంభకర్ణుడు ఘోర తపస్సు చేసినాడు. బ్రహ్మ ప్రత్యక్షం కాగానే 'నిత్యత్వం' కావాలి అని అడగడానికి బదులుగా 'మిత్రత్వం' కావాలి అని అడిగినాడు. ఆ మాదిరి అయిపోతుంది మీగతి కూడా" (చూ. ఎస్. ఎస్. సంపు.4 పుట.122)

ఇంకొకచోట యమ్.టి.ఎ. ఇట్లా చెప్పినారు-

"మీరు ఎవరివద్దనైనా మంత్రోపదేశం పొందివుంటే ఆ మంత్రాల నన్నింటినీ వదలివేయండి. ఆ మంత్రాలన్నీ బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే త్రిమూర్తులకు లోబడినవే. ఆ మంత్రాలన్నీ ఈ నూతన యోగానికన్నా తక్కువైనవే. అందుచేత మాస్టరు చెప్పినట్లు చేస్తే మీకు మంచి కలుగుతుంది" (చూ. ఎస్. ఎస్. సంపు.4 పుట.125)

యమ్.టి.ఎ. చెప్పినారని మాస్టరుగారు ఇలా వ్రాసినారు-

"ప్రాణాయామము వగైరాలు చేయరాదు" (చూ. డైరి పుట.327)

మాస్టర్‌యోగం చేసేవాళ్లు ఇతర దేవతలను పూజించ రాదనీ, ఓంకారాన్ని చేయరాదనీ, చూ. క్రమశిక్షణారాహిత్యము సహించరానిది. బీజాక్షరాలు గల మంత్ర తంత్రాలు వల్లించ రాదనీ, యమ్.టి.ఎ. మాస్టరుగారికి చెప్పగా మాస్టరు వాటినన్నింటినీ వ్రాసి పెట్టినారు. తిరుపతి శ్రీ ప్రభాకర మిత్ర మండలివారు ఆ డైరీలు, నోట్సులు ప్రకటించినారు. అవి చూచిన తరువాత కూడా వీళ్లు పూజలు వగైరాలు చేస్తున్నారు అంటే వీళ్లను ఏమనాలనో తెలియడం లేదు. వీళ్లంతా గురుద్రోహులు అని మాత్రం చెప్పవచ్చును.

ఇక్కడ మాస్టరుగారు నిద్రత్వానికి బదులు కుంభకర్ణుడు మిత్రత్వాన్ని కోరినాడు అని చెప్పడంలోని ఉద్దేశ్యము రాముడు లంకపైకి యుద్ధానికి వచ్చినప్పడు రావణుడు కుంభకర్ణుని నిద్రలేపి రామునితో యుద్ధం చేయమంటే "రాముడు విష్ణువు, అతనితో యుద్ధం వద్దు, సంధి చేసుకో, మిత్రత్వం పాటించుము" అన్నాడు కుంభకర్ణుడు. దీనిని మనసులో ఉంచుకొని మాస్టరు గారు 'నిద్రత్వం' అన్న పదానిని వాడకుండా 'మిత్రత్వం అన్న పదాన్ని ఉపయోగించినారు అనుకొంటున్నాను.

**40వ ప్రశ్న:- నాకు నమస్కారం చేసిన వానిని నా అంత వానినిగా చేస్తాను అని మాస్టరు సి.వి.వి. గారు చెప్పినారు అని పి.యస్.ఆర్. శర్మ నడిపే మాస్టర్ సి.వి.వి. భృక్తరహిత తారక రాజయోగ జర్నల్లో ప్రకటిస్తున్నారు. ఆవిధంగా మాస్టరుగారు చెప్పినారా?**

అడిగినవారు :- శ్రీ కె. యస్. రవీంద్రశర్మ గారు, సూపరెండెన్‌టెంట్ ఎ.పి.యస్.ఆర్.టి.సి., పీలేరు.

సమాధానము:- "ప్రణత నిజ జనాన్ స్వాత్మ తుల్యాన్ కరోతి" అన్న వాక్యం మాస్టరుగారు చెప్పింది కాదు. ధ్రువనాడిలో మాస్టరుగారి జాతకాన్ని గూర్చి చెప్పే సందర్భంలో వచ్చింది.

ఈ ధ్రువనాడిని 11-3-1943న ఒంగోలు భృక్తరహిత తారక రాజయోగ మండలి (సత్యయోగ మండలి) వారు ప్రకటించినారు. అందులో క్రింది విధముగా వ్రాసినారు వారు-

"శ్రీ మాస్టరుగారు ఏనాడీ గ్రంథములను కేవలము నమ్మియుండ వద్దు అనియు, వారు మనకు చేయు వికాసము డెవలప్‌మెంట్ వారి ఇన్‌డిపెన్‌డెంట్ ఆక్షన్ అనియు, అది నాడీగ్రంథముల నుండి నిశ్చయింప వీలు లేదనియు చెప్పట వలన మిత్రులీ ప్రచురణమునకు ప్రత్యేకతను కలిగింప కుందురు గాక" అని.

మా గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు రచించిన ప్రజ్ఞా ప్రభాకరము పుట 150లో మాస్టరు గారు చెప్పినారని క్రింది విధముగా వ్రాసినారు-

"నాడీ గ్రంథములకు పరమ ప్రామాణ్యము కల్పించుకొని మీరు చదువరాదు" అని.

యమ్.టి.ఎ. ఒకచోట-

"ఆస్ట్రలాజికల్ ఆన్సర్సు అంటే జ్యోతిషంరీత్యా బదుళ్లు ఎట్టి పరిస్థితులలోను ఇవ్వరాదు" అని అన్నారు(చూ. ఎస్. ఎస్. సంపు.2 పుట.51)

యమ్.టి.ఎ. ఇంకొకచోట-

'జ్యోతిషానికి సంబంధించిన కట్ట ఒక శూద్రుని వద్ద ఉన్నది. అది నీ దగ్గరకు వస్తుంది. పూర్తిగా గాని, భాగాలుగా గాని వస్తుంది'

అని అన్నారు (చూ. ఎస్. ఎస్. సంపు.2 పుట.52)

యమ్.టి.ఎ. ఈ వాక్యం మాస్టరుగారికి చెప్పింది 29-10-1910లో. అప్పటికి గురుతుల్యులు శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలం గారికి సుమారు 27 సంవత్సరాలు వయస్సు. ఆనాటికి ఈయన ఈ యోగంలో చేరలేదు. యోగంలో చేరింది 23-9-1919న. అప్పటికి ఈయన వయస్సు 36 సంవత్సరాలు. ఈ యోగంలో చేరిన తరువాత మీడియముల జాతకాలు నాడీ గ్రంథం నుండి పఠిస్తూ ఆ ఆదాయంతో జీవితయాత్ర సాగించినారు. మొత్తం గ్రంథము, భాగాలు, భాగాలుగా మాస్టరుగారికి చేరింది. ఒకప్పుడు తప్పగా చదవడం చేత గ్రంథాన్ని అంతటిని తెచ్చి మాస్టరుగారి వద్ద ఇవ్వమన్నారు. అంతా తీసి అటకమీద పెట్టినారు మాస్టరుగారు. ఈ నాడీగ్రంథంలో చెప్పినవి ఏవీ జరగలేదు. అయినా శ్రీ ఎన్.ఆర్.బి. వెంకటాచలం గారు నాడీ గ్రంథాన్ని మాత్రం ఆయన నాడి పోయే వరకు వదలలేదు. మాస్టరుగారి దగ్గర చేరిన మీడియములే ఆయనగారు చెప్పిన దానికి విరుద్ధంగా నడిచినారంటే ఇక వీళ్లను ఏమనాలో మీరే ఆలోచించండి. (మాస్టరుగారి నిర్యాణానంతరం వెంకమ్మగారి వద్ద నుండి నాడీగ్రంథాన్ని మరల ఎన్.ఆర్.బి. గారు తెచ్చుకొన్నారట).

పి.యస్.ఆర్. శర్మకు మొదటి నుండి మాస్టరుగారి యోగం మీద పెద్దగా నమ్మకం లేదు. గురుతుల్యులు శ్రీ యమ్. నరసింహం సంతులుగారి వద్ద శర్మ బంధువులంతా ఈ యోగంలో చేరడంచేత ఏదో మొక్కుబడిగా నమస్కారం చేస్తున్నాడే కాని ఆయనకు ఈ యోగాన్ని గూర్చి ఏదో తెలిసికాదు.

ఈ కథ చెప్తాను వినండి. ఈయన కుమారుడు విపరీతమైన

జ్వరంతో కొన్ని రోజులుగా బాధపడుతుండినాడు. మేము మాస్టరుగారి నోట్సులకు అని వెళ్లినాము. ఎన్ని పర్యాయాలు వెళ్ళినా "ససేమిరా చూపను" అన్నాడు. ఒకసారి మేము వెళ్లేటప్పటికి మరలా జ్వరంతో బాధపడుతుండినాడు. ఆ అబ్బాయిని చూచి ఆ విషయాన్ని తెలుసుకొని "మాస్టరుగారికి నమస్కారం చెయ్యమన్నాము, జ్వరం తగ్గిపోతుంది అన్నాము". వెంటనే శర్మ "పెద్ద పెద్ద మందులకే తగ్గలేదు నమస్కారానికి తగ్గుతుందా? మంత్రాలకు మామిడికాయలు రాలుతాయా?" అన్నాడు. వెళ్లిన నేనూ శ్రీ యమ్. బలరామయ్యశెట్టి, శ్రీ ఎరికలయ్య శెట్టి గారలు నమస్కారం చేసినాము. మాస్టరు గారి దివ్యానుగ్రహం వల్ల వెంటనే పిల్లవాని జ్వరం తగ్గి ఒళ్లంతా చెమటలు పట్టింది. పిల్లవాని జ్వరమూ తగ్గింది. శర్మరోగమూ కుదిరింది. అప్పడు కూడా శర్మ "మళ్లీ జ్వరం రాదు అని నమ్మకము ఏముంది?" అన్నాడు "నీ మచ్చమాయ జ్వరాన్ని తగ్గించినందుకు మాస్టరుగారికి కృతజ్ఞతలు తెలుపకుండా మళ్లీ రాదా అంటావే, ఇకరాదు, రాదు, రాదు, అన్నాము" అంతే మళ్లీ జ్వరం వచ్చినట్లు శర్మ చెప్పలేదు.

ఆ తరువాతనే మాస్టరుగారి నోట్సులు, డైరీలు వగైరాలు శర్మ మా కంటికి చూపినారు. మా కిచ్చినారు. అవి వెలుగు ముఖం చూచినాయి. మాస్టరుగారి సిద్ధాంతాలు యోగసాధకుల కందరికీ తెలుస్తున్నాయి. దీనికి శర్మగారికి వ్యక్తిగతంగా నేనూ శ్రీ ప్రభాకర మిత్రమండలివారూ యోగమిత్రులూ చేతులెత్తి నమస్కరిస్తున్నాము. ఆ సాహిత్యాన్నే శ్రీ ప్రభాకర మిత్రమండలి, తిరుపతి వారు ప్రకటించినారు, ఇంకా ప్రకటిస్తారు కూడా, మిగిలినవానిని, యోగమిత్రుల సహాయ సహకారాలతో ప్రకటించగలము. దానికి

తగిన శక్తిని ఇమ్మని మాస్టరుగారిని ప్రార్థిస్తున్నాము.

శ్రీ ప్రభాకర మిత్రమండలి చేతికి వచ్చే వరకు మాస్టరుగారి యోగసాహిత్యం గతి ఎట్లా ఉండింది అంటే-కొన్ని కోట్ల రూపాయలు విలువ చేసే రత్నాన్ని ఏడుపడగల నాగరాజు పడగవిప్పి, పడగల క్రింద ఆ రత్నాన్ని ఉంచుకొని కాపాడుతుండగా- ఎవడూ సాహసించి సమీపించలేడు. దాన్ని తాకలేడు. ఆనాగరాజుకేమో ఆ రత్నం విలువ తెలియదు. అట్లా ఉండిపోయింది మాస్టరుగారి యోగసాహిత్యం శర్మ దగ్గర. పాములు పట్టేవాడు ప్రాణానికి తెగించో, తన దగ్గర ఉన్న విషహర మూలికల ధైర్యంతోనో ఆనాగరాజును సమీపించి బుఱ్ఱను ఊది ఆ నాగరాజును లొంగదీసుకొని దాన్ని సమీపించి ఆ రత్నాన్ని వెలికితీసి దాని విలువను అందరికీ తెలియజేస్తాడు. అట్లాగే మాస్టరుగారి సాహిత్యము అనే అమూల్యమైన రత్నాన్ని శర్మ అనే నాగరాజు ఏండ్ల తరబడి కాపాడుతుండినాడు. పాములవాడు బుఱ్ఱను వూదినట్లు మాస్టరుగారి "శక్తి" అనే బుఱ్ఱను ఊది శర్మ కుమారుని జ్వరాన్ని తగ్గించి, శర్మ మెడలువంచి మాస్టరుగారు వారి సాహిత్యాన్ని మాకు ఇప్పించినారు. అట్లా ఉంది శర్మ సంగతి. ఈ శర్మే "శ్రీనివాసాచార్యులు అడిగినప్పడు నోట్సులు, డైరీలు వగైరాలు నేను ఎందుకు ఇవ్వనన్నానో. ఇప్పడు ఎందుకు ఇచ్చినానో నాకే తెలియదు" అని వ్రాసినాడు.

1900 వ సంవత్సరం మాస్టరుగారికి కుంభకోణములోని రూములో యోగం లభించింది. ఆ రూములో మేము 4-8-1980న ప్రార్థన చేసిన తరువాత మాస్టరుగారు క్రింది విషయాలను సెలవిచ్చినారు.

1. నా సాహిత్యాన్నంతా ప్రకటించు.

2. నా మీడియముల "వాయిస్" అంటే వారి గొంతు ద్వారా వచ్చే మాటలు టేప్‌రికార్డు చేయుము.

3. శిథిలావస్థలో ఉండే నా ప్రార్థనా మందిరాన్ని పునర్నిర్మాణము చేయుము.

4. ఈ విషయాలలో ఎవరికీ భయపడవలసిన పనిలేదు. ఎంత కష్టం కలిగినా ముందుకు నడువు, నేను నా కార్యాన్ని నిర్వర్తించు కొంటాను. నేను చెప్పింది నీవు చేయుము. అని.

మాస్టరు గారు స్వయముగా తోప జేసినారు కాబట్టి ముష్కరుడైన పియస్.ఆర్. శర్మ కన్నులు కప్పి వారి సాహిత్యాన్నంతా మాకు ఇప్పించినారు. ఈ విషయాలూ, ఆనాడు యోగా స్కూల్లో జరిగిన విషయాలూ మాస్టరుగారి నోట్సులకు మేము వ్రాసిన ఉపోద్ఘాతంలో వివరంగా వ్రాసియున్నాము.

మాస్టరుగారి సంకల్పం తన సాహిత్యమంతా ప్రకటింపబడాల అన్నదే. దాన్ని మాస్టరుగారి డైరెక్టు మీడియమైన శ్రీ పోతరాజు. నరసింహం గారు కూడా సరిగా అర్థం చేసుకోలేదు సరికదా విపరీత వ్యాఖ్యానం చేసినారు, ఇదిగో వినండి-

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు 7-9-1949 న శ్రీ గురుతుల్యులు వావిలి కొలను. వెంకట రమణ రావు, (వి.వి. రావు) గారికి మీడియము నెం.686 ద్వారా శ్రీ పోతరాజు నరసింహం గారికి ఒక ఉత్తరం ద్వారా క్రింది విషయాన్ని వ్రాసినారు. అందులో-

"మాస్టరుగారి నోట్సులు వగైరాలు ఉన్నవి ఎప్పడు మదరాసు రమ్మంటారు" అని.

ఆ ఉత్తరానికి శ్రీ పి. నరసింహంగారు 9-9-1949న క్రింది విధంగా బదులు వ్రాసినారు-

"నా దగ్గర వారి డైరీలు, కోర్సుల పేర్లు వగైరాలు ఉన్నవిగాని వాటిని తిరిగి చదవవద్దని వారి ఆజ్ఞ. దానిబట్టి ఎవరికి నేను చూపలేదు. ఎందుకు నాచేతికి వచ్చినవో నాకు తెలియదు. జాగ్రత్తగా దాచి యుంచినాను" అని.

ఇది సరియైన వ్రాత కాదు. ఈయనగారు మాస్టరుగారి పిల్లర్ టెస్టును సరిగా అర్థం చేసుకొన్నట్లు లేదు. సరిగా అర్థం చేసుకొని వుంటే ఇట్లా వ్రాసి వుండరు లేదా పిల్లర్ టెస్టు సంగతి ఈయనకు తెలియనైనా తెలియక ఉండాలి.

మాస్టరుగారు 20-8-1917వ తేదీన చదివి వినిపించిన పిల్లర్ టెస్టులో-

"నేను అభివృద్ధి ఎట్లా సంపాదించినాను అనే విషయాలన్నీ స్వయంగా వ్రాసి ఉంచినాను. ఏ ఒక్కరికీ సరిగా ప్రాక్టీసు చేయడానికే టైమ్ లేదు అంటున్నారు. అటువంటి అప్పుడు నా రికార్డులను చూడడానికి మీరు ఎంత సమయాన్ని ఉపయోగించగలరు? అందులో నేను ఏమి వ్రాసినాను? అని తెలుసుకోగలరు" ? అని.

మాస్టరుగారి పై వాక్యాన్ని తప్పగా అర్థం చేసుకొని "తిరిగి చదువ వద్దని వారి ఆజ్ఞ" అని వ్రాసినారు శ్రీ పోతరాజు నరసింహంగారు.

మాస్టరుగారి ఉద్దేశ్యం అది కాదు. అందరూ చదవాలనీ, అందరూ అన్ని విషయాలూ తెలుసుకోవాలనీ, అభివృద్ధిపొందాలనీ, ఎటర్నటీ సంపాదించాలనీ మాత్రమే. మాస్టరుగారి సంకల్పం ప్రకారం యోగమిత్రులంతా డైరీలు, నోట్సులు వగైరాలు సరిగా చదివి,సరిగా అర్థం చేసుకోండి. మీ బుఱ్ఱల్లో ఇంతవరకు పేరుకొని పోయివున్న

పాత తప్పుడు భావాలను పూర్తిగా తుడిచి వేసుకొని, పరిశుభ్రమైన మనస్సుతో ఉండండి, బాగు పడండి అని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

ఆ పిల్లర్ టెస్టులోనే 20-8-1917న-

"నా యోగా స్కూల్లో కాలు పెట్టినంత మాత్రానగానీ, డిక్లరేషన్ ఫారాలలో సంతకాలు చేసినంత మాత్రానగానీ, మీకు ఒరిగేదేమీ లేదు. అత్యంత భక్తి శ్రద్ధలతో రూల్సు, రెగ్యులేషన్సు ప్రకారం పది సంవత్సరాలు క్రమం తప్పకుండా ఈ యోగంచేస్తే ఎటర్నటీని అంటే శాశ్వతత్వాన్ని ఇస్తాను" అని అన్నారే కాని తనంతటి వానినిగా చేస్తాను అని ఎక్కడా చెప్పలేదు.

ధ్రువనాడిలోని "ప్రణత నిజ జనాన్ స్వాత్మ తుల్యాన్ కరోతి' అన్న వాక్యాన్ని అందరూ చూచి చంకలు తట్టుకొంటున్నారే కాని దాని లోతుపాతులు చూచిన పాపాన మిడీయములుగాని ఇష్టటి సాధకులుగాని పోయిన పాపాన ఉన్నవాళ్లు ఎవళ్లూ లేరు.

ఇదంతా తప్పల తడక. అప్రామాణికమైనది. ఇదంతా పెద్దకథ తరువాత చెప్తాను.

ధ్రువనాడిలో ముఖ్యమైన తప్పిదాన్ని ఒకదాన్ని మీకు చెప్తాను. "మాస్టరుగారు ఎటర్నటీని సంపాదించడానికి అని ఈ యోగం ఆరంభించినారు." అన్న విషయం ఇందులో లేదు. మరెందుకీనాడి? ఏమి సాధించేందుకు? ఏమీ లేదు. అందరి బుఱ్ఱలూ చెడగొట్టి అందరినీ తప్పదారి పట్టించడమే ఇది చేసిన పని.

మాస్టరుగారు స్పష్టంగా క్రింది విధంగా చెప్పినారు-

"ఈ యోగం అన్ని రకాలైన జ్ఞానాన్ని ఇస్తుంది. అదెప్పుడంటే నీవు అభివృద్ధి పొందినప్పడు. ఆ అభివృద్ధి ఉన్నట్లుండి ఆకాశాన్నుండి ఊడిపడినట్లు నీ బుఱ్ఱ మీదికి రాదు. ఒక్కొక్క మెట్టుగా మెల్లమెల్లగా

నీకు లభిస్తుంది. అది నీవు భక్తి శ్రద్ధలతో చేసే ప్రాక్టీసును బట్టి కలుగుతుంది. ఎట్లాగంటే పరీక్ష పాస్ కావడానికి స్కూల్లోని విద్యార్థి రాత్రనక, పగలనక ఎట్లా కష్టపడి చదివి పాసవుతాడో అదే విధంగా నీవు కష్టపడి ప్రాక్టీసు చేస్తే ఆ శక్తి నీకు లభిస్తుంది." అని (చూ. డైరి పుట. 327)

పాపం పి.యస్.ఆర్. శర్మకు ఈ విషయాలన్నీ ఏమీ తెలియవు. ఏదో అందరూ చెప్పతున్నారు కాబట్టి ఈయనా ఆ వాక్యాన్ని వేస్తే మంచిది అనుకొని గుడ్డిగా వేస్తున్నారు అని అనుకొంటాను. తెలిసే వేస్తే మాస్టరుగారికి మహాపచారం చేసినట్లే.

"తనకు నమస్కరించిన వానిని తనంతటి వానినిగా చేస్తాను" అన్న వాక్యం ప్రామాణికమైనది కాదు. అప్రామాణికమైనది. ఇది సత్యమని నమ్మి ఎవరూ మోసపోవద్దని మనవి చేస్తున్నాను.

ఎ.వి. శ్రీనివాసాచార్యులు

(సీ.సీ)

శ్రీ నిరంతరానంద నిశ్రేయసార్థ
సాధకము, సర్వకిల్బిష బాధకము, స
మగ్ర విజ్ఞానదము, మహామహిమ ఘనము
శరణ మగు మాకు సద్గురు చరణయుగము.

దుర్వ్యాధిఖిన్నే శరణం ప్రపన్నే
మయి ప్రసాదా దయి మాస్మ భైషీః
త్రాతా హ మస్మీతి దదా వభీతిం
య స్తం గురుం మస్తకతో నమామి.

యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్.
లోచనాభ్యాం విహీనస్య దర్పణం కిం కరిష్యతి.

నానుధ్యాయా నహూన్ ఛబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్
విహాయ శాస్త్రజాలాని య త్సత్యం త దుపాస్యతామ్.
వేదశాస్త్ర పురాణాని పదపాంసు మివ త్యజేత్.

సీ.వీ.వీ. కరుణాకటాక్షములు రక్షించున్ సదా తన్మయం
బై వర్ధిల్లెడు భక్తియున్నయెడ నిత్యానంద మారోగ్య మా
హా పుట్టించెడు ప్రజ్ఞ ఈ త్రయము లభ్యం బౌను తార్కాణ నే
నే వేయేటికి? మీర లిందఱును దీనిం జక్క గుర్తింపరో!

నన్నున్ వర్ణన సేయగా వలవ దన్నా! కన్నయందాక మీ
ద న్నీ వర్ణన మెందు కిందులకు గొందాకం బ్రతీక్షింపు మం
చు న్న న్నూర్చిన యుష్మదాజ్ఞకు నెదుర్చూపై గృహద్వార మం
దు న్నాడం గనరాగదే కనుట కర్హున్ నన్ను జేయంగదే!

కవితాశిల్పము సల్పగా దొలుత వేడ్కల్ రేగె నాకున్, గృతుల్
చివురొత్తెన్, వెస మోము మొత్తె, నిక నాచే జెల్ల వీ కల్ల బొ
ల్లి వినోదంబు, లివే జరామరణముల్, చీడల్ హతం బార్చి, పు
ట్టువు చెట్టున్ సఫలీకరించుకొని యంటుల్ గట్టెదన్ మాలినై.

త్రికరణ శుద్ధిగా భవదధీనుడనై యితర ప్రవృత్తి వీ
డికొని పరార్థలాభ మొకటే గమనించుచు నుందు, నింక మా
యికము ధనాదికమ్ము గణియింపను, సత్యదయోపకార సా
ర్థక మగు నాత్మచింతనపథంబును దప్పి చరింప నీశ్వరా!

సర్వకర్తయౌ నీశ్వరేశ్వరుని దివ్య
తేజము వరేణ్యమును, వినుతింతు మెపుడు
ఇది గదా లోననుండి మాకెపుడు మంచి
మంచి యుద్బోధముల నొదవించుచుండు.

నారలు కట్టుచీర లశనంబులు కాయ గసుళ్లు కొండలున్
కారడవుల్ నివాసములుగా దపియించి మహర్షు లెవ్వరిన్
జేరుకొనం దలంచి రల చిన్మయ తత్త్వము సర్వమానవో
ద్ధారము గోరికొన్న యవతారము మద్గురుమూర్తి గొల్చెదన్.

పాండిత్యాభి నివేశమును, గవన తాత్పర్యంబు, విత్తార్జనో
ఛ్చండారంభమునుం గ్రమక్రమముగా సన్నంబు లౌచుండె నో
తండ్రీ! విశ్వవిభూ! సుఖం పడెద నీతంటాలు నాకేల నీ
యండ న్నిల్చెద ద్రిల్చెదన్ బృహదవిద్యాదోషపాషాణముల్.

పెండిలినాడె నన్ను వెలపించెను బంచత; లోకరీతిచే
గొండొక యౌవనంబు జవిగో నవిగో ననగా జరామృతుల్
గండుపులుల్ గనంబడె పొకాలితి వ్రాలితి వజ్రపంజరం
బుండెడు కోణమందు సుఖముంటి నికన్ బులిజంట గెంటెదన్

వర్తింతున్ మతదేశజాతి కృతముల్ వైవిధ్యముల్ వీడి, ని
ర్వర్తింతున్ బరిచర్యనార్తులకు యావత్ప్రజ్ఞ నర్పించి, యా
వర్తింతున్ గురుదేవ సూక్తములు భావస్ఫూర్తి, నట్లయ్యు, నే
ధూర్తుం డౌదు నొకొక్కచో, నడపు మీ తుందుడ్కు నాత్మేశ్వరా!

ఆసల్రేపగ నంతరంగపు టరణ్యం బంధకారమ్మునన్
దాసోహమ్మని చొచ్చితిన్ వెదక నంతర్యామి నాలో నెదో
భాసిల్లెన్ జిఱువెల్గు చేర జన దావమ్మయ్యె నా యగ్నిలో
నే సోహమ్మయి నిల్చితిన్ బిదప నేదీ నాతనం బయ్యెడన్.

దూరం బేల పరంబు నీ విహమునందున్ భక్తరక్షార్థ మ
ర్త్యారూపంబు ధరించియుంటి వన నిచ్చల్ నిన్నె లోకన్ను చె
న్నారం గాంచెద దేహదేవకుల మూలాధార మం దాసహ
స్రారంబున్ సుఖ సత్య చిత్కలిత దీపారాధనల్ సేయుచున్.

ఇతరుల నవమానించెడు
మతి మాన్పుమి, పరులచెడ్డ మాటల సైపన్
ధృతి గూర్పుమి, సంతోషా
మృతరసమిడి సేదదేర్పుమీ నాస్వామీ!

అందక పొందక విడివడి
చిందులు ద్రొక్కెడి మనస్సు జేకొని సరిగా
నందముగా నడవంగల
చందమునన్ దిద్దుకొనవె సద్గురుమూర్తీ!

తలపులు విశుద్ధములుగా
దలపింపుము పలుకు లమృత ధారలనంగా
బలికింపుము కార్యంబులు
సలిపింపుము పరహిత ప్రశస్తంబులుగాన్.

పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేరరాదు నా
విరచనలందు, డెందము పవిత్రముగా విలసిల్లి సత్యసుం
దరము పదార్థయుక్తమగు తత్త్వమునే వెలయింపగా వలెన్
గురుచరణార వింధములకుం బ్రణమిల్లెద నట్టినేర్మికై.

ధనసంపాదన తత్పరత్వమున వంతల్ సెంద; నుద్యోగపుం
బెనుపుల్ పొందగ వందుఱన్, సుకవితా విద్యావిశేషమ్ములన్
ఘనతం గోరి తపింప; నీపయి జగత్కల్యాణమై పొల్చు నీ
యనవద్య స్థిర సత్యపాగరిమయే యర్థింతు నాత్మేశ్వరా!

పాప సంకల్పముల నెల్ల భస్మపఱచి
శుభసమృద్ధి గల్పించి, విశుద్ధమైన
పదము పయి కోర్కె నెదలోన గుదురుకొలిపి
నన్ను గాపాడుమో గురునాథమూర్తి!

పరమాణువునకు లోపలదాగు సూక్ష్మాత్మ
దయసేయవే సూక్ష్మదర్శనంబు
బ్రహ్మాండమునకు బైపడి వెల్గు పరమాత్మ
దయసేయవే పరదర్శనంబు
అఖిలంబు నం దభివ్యాపించు విశ్వాత్మ
దయసేయవే విశ్వదర్శనంబు
ఏకమయ్యు ననేకమై వెల్గు నేకాత్మ
దయసేయవే యైక్య దర్శనంబు

గ్రుడ్డియెద్దు చేనబడ్డట్టు లిటునట్టు
కానలేక ఎట్టొ కడచుచుంటి
ఆదుకోవె! సచ్చిదానందపద మీవె
నాథ! నన్ను నిన్నొనర్చుకోవె!

అద్దమువలె దేహంబిది- యమలినముగ జేసికొని
నిద్దపు నీతేజము జగ- దుద్దీప్తము జేయగదే!
స్వామీ యంతరనిలయా- స్వయం వ్యక్తమై వెలయ
నా యజ్ఞానావరణము- నలిగులి చేయుము తండ్రీ!

దివ్యద్దివ్య భవత్కృపాగరిమచే దేదీప్య మానంబుగా
నవ్యంబైనటువంటి దివ్యపథమున్ నానాట యోగీశసం
సేవ్యం బైనది తారకం బనబడున్ సద్యోగమార్గంబు మ
మ్మేవ్యాధుల్ జెనకంగ నీక నిలుపున్ ఏకార్థ సంధాయియై.

ఆకు జిల్కలు ఱెక్కలల్లార్చి యాడుచో
బువ్వుల్ గుబాళించి నవ్వుచోట
పక్షులతో వృక్షపటలి వెల్విరియుచో
జంపతుల్ వాహ్యాళి సల్పుచోట
జలజల సెలయేళ్లు జాల్వారి దొరలుచో
నదులు సంద్రములతో గదియుచోట
ఏకాగ్రవృత్తి యోగీశ్వరుల్ వెలయుచో
నద్రి శృంగములు మిన్నందుచోట

పుడమికి గుడారుగా మిన్ను పొలుచుచోట
నాకసము భూమి యంటిసలాడుచోట
నీ మహత్త్వంబు దిలకించి నా మనస్సు
చొచ్చు లోలోని కెచ్చటో చొక్కు దక్కు.

పండ్రెండేండ్లిటు వంటి సంశయములే బాధింపగా నెన్నియే
న్కండ్రాటంబులు గాంచితిన్ దొరకె నమ్మందగ్గ సన్మార్గ మో
తండ్రుల్, సర్వము నీశ్వరేచ్ఛ నడపున్ దత్కృత్యముల్ గూఢముల్
కండ్రుంగానరు మానవుల్ తమ కహంకారంబు పైకొంటచేన్.

నాచిత్తంబు పరీక్ష చేసుకొనుచున్నాడన్ యథార్థంబుగా
బోచంతైనను దుష్టవర్తనము దుర్బోధం బెరుంగన్ బవి
త్రాచారంబున బ్రహ్మతత్త్వ పరమార్థానందముం గూర్చి యా
లోచింతుం బలవింతు జింతింతు నేలో నన్ను వంచించుటల్.

స్వామీ అంతరనిలయా స్వయం వ్యక్తమై వెలయు
నా యజ్ఞానావరణము నాశము జేయు మహాత్మా
నే నను నా యధమాధమ నిర్వాహము తొలగించి
నీలో నను గలుపుకొని నెగడగదే పరమాత్మా.
నాలోగల వని యెఱుగక నానా బాధల పడితిని
త్రో వెఱిగితి నిప్పటికి దుఃఖము తొలగెను దేవా
దేవర నా కీ దేహము దేవళమై వెలసినది
చక్కగ నెలకొని విశ్వస్వామిత్వము నెఱపగదే!
అద్దము వలె దేహం బిది యమలినముగ జేసికొని
నిద్దపు నీతేజము జగదుద్దీప్తము చేయగదే!
అనుక్షణము త్వన్మయతాహ్లాదము హెచ్చెడు విధమున
క్షణక్షణము మన్మయమై జ్వలియింపగదే దేవా!
అహంకార మమకారము లడగార్చి క్రమక్రమముగ
కరగ జేసుకొని నీలో కన్నతండ్రి! కడతేర్చుము
నా చాటున దాగియె దోబూచు లాడుచున్నావా?
చూచితి నిక నే నేమఱ నీచాటున దాగెదను
వెనుకడుగిడ నిక నాథా! కల్యాణం బికనాథా!

ఈశ్వరు డొక్కరుండు కలడే యని యొప్పినయప్ప డాతడున్
నశ్వరు డౌనె: యజ్ఞుడగు నావలె: గాక యనంత శక్తియున్
శాశ్వతు డేని తత్కృతియు శాశ్వతమై విలసిల్ల కేటికీ
విశ్వము నశ్వరం బయి యవిజ్ఞతతో వెతలందగా వలెన్.

గురుచరణార విందములకున్ బ్రణమిల్లి తదీయ సత్కృపా
భరపరిసంస్కృతంబులగు భావములన్ వెలయించి తత్త్వవి
స్ఫురణము లోకమందు బరిపూర్ణము కాగల దన్న వేడ్క పొం
పిరిగొన జెప్పెదన్ నిజము పెంచి సమంచితమైన సత్కృతిన్.

క్షణక్షణము సత్యజ్ఞాన సంతోష సంపత్సంగతిన్ బొంగుచుండన్
చణమయి విలసిల్లెన్ స్వాంతమున్ దిద్దుకొమ్మా
ప్రణుతిపరత దప్పం బాయగా నేరనన్నా
అణువణువున నాలో నైక్యముం జెందు తండ్రీ.

ఆధులచే వ్యాధులచే- బాధలు పడుచున్న నన్ను బాగుపఱచి స
ర్వాధారమైన నీ తే- జోధారకు బాత్ర మొనరుచుకొనవే దేవా!

కర్మము కర్మమం చొకటి కల్పనచేసెద రేమి కర్మ మీ
కర్మము? దీనికిం భ్రమకారణ మే దది యొక్కటేకదా!
మీ ర్మతి మీరు మీరు నిటు మేల్పడుచుండగ వారు వారు వార్
పేర్మి సుఖింపనేల? పలు భేదము లెట్టుదయించె జెప్పడా!
"శాస్త్రవిరుద్ధ మీ పలుకుచంద" మటంచును నవ్వి రందులో
శాస్త్రులు గొంద, ఱింక మొగచాటయి "యుక్తికి దూర మీవచో
విస్తృతి" యంచు గొందఱు వివేకులు పల్కిరి; నిర్వికల్పుడై
నిస్త్రపుడై యతండు తన నిశ్చయమే పలికెం బదింబదిన్.

బాల్యమునుండియుం గడు ప్రపన్నుడు నీశ్వరతత్త్వభావనా
తౌల్యమునం జెలంగు నకలంకుడు నాతడు సచ్చిదర్థ సా
కల్యము దెల్పి యవ్యయ సుఖం బొడగూర్చు గురుం గుఱించి చా
పల్యమునన్ జరించె నట భారత వర్షము పెక్కు వర్షముల్.

అద్వైతమతము సాక్షాద్విరుద్ధము దీని
కిది విశిష్టాద్వైతు లిష్టపడరు
ద్వైతు లిట్లు వచింతు, రీతీరు బాదరా
యణసూత్ర ఫక్కికి నన్వయింప
దుపనిషదర్థ మిట్లు పరిస్ఫురించు; వి
ద్యారణ్యు లిట్లు భాష్యము రచించి
రిందు మా గురు లర్థ మిట్లు కల్పించిరి
పలువురు దీన దప్పలు గడించి
రంచు బెదపెద్ద పండితుల్ స్వానుభవము
లేని చదువులు వినుపింప బూని రెందు
నెందు గాంచిన నతనికి సందియంబు
డిందు పడదయ్యె హెచ్చయ్యె గొందలంబు.

పలు మతములు బలు దగవులు
బలు సిద్ధాంతములు బూర్వపక్షము లింకం
బలు సందేహమ్ములు గల
పలువుర గని యతడు మిగుల పరితాపించెన్.

కటకటా! జగమెల్ల గటికి చీకటిలోన
జీకాకుపడుట కేమో కతంబు?
పట్టుచిక్కకపోవు టెట్టొకో యిద్దాని
యాదికారణ మెట్టి దానొ కాని?
ఇదమిత్థమని నిశ్చయింపగా సత్యప్ర
కాశ మించుకయేని కానరాదె?
ఈశ్వరుం డొక్కరుం డెసగుచున్నా డందు
రిది యేమి యన్నృతమా! హా! మతేమి?

పుట్టు పూర్వమేమొ? గిట్టిన పరమేమొ?
నడిమి మూడునాళ్ల నటన మేమొ?
దేశకాలముల స్థితిగతులు నేమొ? నే
నేమొ? యింక సర్వమేమొ? యేమొ?

వెన్నుం గానగలేని కన్నులివి యీ విశ్వప్రపంచార్థ పుం
దెన్నుం గానగ నేర్చునే? కటకటా దేవాధిదేవుం డొకం
డున్నా డన్నిటి కాదిమూల మత డేదో కార్యమూహించి యీ
యన్నింటిన్ సృజియించె నందు రది యట్లైయుండు టెట్లోగదా!

తలప దలంపగా మది వితాకు జనించు జగమ్ము లీ గతిన్
గలుగుట కేమి కారణమొ? కల్గు ఫలమ్మది యేమొ? దీనికిం
దొలుతటియున్కి యెట్టిదియొ? తుట్టతుదం గనునో? యనేక రీ
తులు తులకింప హేతువు నెదో? యెది యెట్టిదొ? యేమి కర్మమో?

బ్రదికినచో లభియించెడి
ముదమేమో? చచ్చినంత బోయెడి దేమో?
తుద యేమో? మొదలేమో?
యెది యేమో తెలియలేక యేకరుటయ్యెన్.

మోహ మిది తొలగకుండిన
చో హానికి వెఱవ నేల? సుఖపడ నేలా?
దేహాభిమాన మేలా?
ఆహారం బేల? ఏ ప్రయత్నం బేలా?

శీర్షంబు తగ బిగించిన యట్లు గనుపట్టె
ఫాలభాగమునందు బరువు దోచె
భ్రూమధ్యమున నెదో మోపెట్టి నట్లయ్యె
నెదుర గన్పడె వెల్గు చెదరి చెదరి;
సుళ్లువాఱుచు జతుష్కోణమ్మగుచు మెర్గు
దీవ లిట్టటు గొంత దిరుగ జొచ్చె
నిశ్చలంబయి యంత నిల్చె దెల్లని పట్టు
తెరగట్టినట్టు జ్యోతిస్థలంబు;
అందు బంగారు రాపొడి బొందుపఱచి
నట్టు దివ్యాక్షరములు గన్పట్టె; దళత్త
ఈ ద్యుతులు గన్నులకు సురాళమ్ము గొలుప.

ఓ! విశ్వేశ్వర! యో పరాత్పరతరా! యో సర్వనిర్వాహకా!
దేవా! నా పరిదేవితంబులకు నేదీ తగ్గ ప్రత్యుత్తరం?
బూవిల్లూర్చితి వాస గొల్పితివి; యేమో యేమొ యత్యద్భుత
శ్రీ విస్ఫూర్తులు తోప జేసితివి తత్సిద్ధిన్ విడంబింతునా?

"క్షిప్రత లోకశోక మడగింతును మిమ్ము సముద్ధరింతు" నం
చప్రతిమ ద్యుతిస్ఫురణ నక్షర రూపమునన్ నసున్ ప్రబో
ధ ప్రతిపన్ను జేసి పరితాపము వాపి యిదేమి మోసపుం
గొప్రము వెట్టి తిప్ప తలకుం గడకుం జగదేక నాయకా?

నా సంకల్పము లేను గన్గొనినవింతల్ సుంతయేన్ దోషమా
యా సంసర్గము లేనివేయగుట తథ్యం బంటకున్ మన్మనో
వ్యాసంగంబును పుణ్యసాధ్వి మతి యయ్యెచోటులున్ సాక్షు లిం
దే సందేహము కల్గజేసితివి యింకే మందు నో ఈశ్వరా!

దుస్సంకల్పముచేత నీ కన్యత మేదో చూపగాబోలు ర
క్షస్సో యింక మఱేదో యంచు నెవరేన్ సందేహమందన్ మనం
బుస్సూరంచు దపించెడున్ గటకటా! యొండేమి బెండైనదే
నిస్సామాన్య మహానుభావు డగు నీ నిర్వాహమో యీశ్వరా!

"నీ వేమో తలపోయుచుంటి వదియే నీ కన్నులం దోచె భ్రాం
త్యా విష్టుండవు గుత్తెరుంగ" నను పల్కంగీకరింపం దగున్
నా వైక్లబ్యముచేత గల్గిన దటే నా తండ్రి! యానాడు ధ్యా
నావిర్భూతము దివ్యదర్శనము! మిథ్యార్థంబు లట్టుండునే?

ఆశ్చర్యంబుగ దోచె విద్యుతులు చెర్లాడెన్ విచిత్రంబుగా
నైశ్చల్య మ్మొదవెన్ ద్యుతిస్థలికి స్వర్ణచ్ఛాయముల్ దాన న
త్యాశ్చర్యంబుగ నక్షరంబులును నయ్యైస్థానముల్ కన్పడెన్
పశ్చాద్దృష్టము లిందుకున్ సరిపడెన్; భ్రాంతత్వ మింకేదియో?

కలడు కలండు సృష్టికినిగర్త మహాద్భుత శక్తిమంతుడన్
దలపున నింతదాక బరితాపము జెందుచునుంటి నయ్యయో!
కలడు కలం డనంబడెడు కర్త యొకండు కలండో లేడో! హో
తలచిన హృత్పుటంబు శతధాపగులున్ దుద కెంత మోసమో!

"కానన్ రాదనె దామె నీ యెదుర సాక్షాత్కారమై నిల్చినన్
గానంగాదగు శక్తి యున్న దటె నీ కందోయికి న్యాయనా!
ఈనాడింకను జాముదే యరుగలేదే? నీకు జేకూరు న
య్యానందమ్ము నిజమ్ము భోజనము చేయన్ లెమ్మునన్ నమ్ము" మీ!

వాయికి వచ్చినట్టుగ నవాకులు పల్కితి దొల్త నన్న దే
దోయది "వందనం" బనెడిదుండగ; దుండగమే సమస్తమున్
మాయ మొనర్చె నన్ను దియమాటల దియ్యని పిండివంటలన్;
హేయము నా యకార్య; మిపు డెక్కడ రోయుదు నేమి సేయుదున్.

"తలక్రింద బెట్టుకొను మని-
తలగడ యొకటిచ్చె" ననుచు దానిం దెచ్చెన్
వెలుగున జూడగ నందుం-
గల దొక తాటాకు పుస్తకము గుప్తంబై.
అచ్చెరువడి యద్దానన్- విచ్చి కనుంగొనిరి వర్ణవిన్యాసము లో
నచ్చొత్తినట్టు కనులకు- ముచ్చట గల్పించె జదువ మొదలిడి రంతన్.

ఎఱుగ న్నేరర కాని యీశ్వరుడు తా నేమేమి కావించు న
త్తెఱగెల్లన్; మునుమున్న సూచనలచే దెల్పించు; విజ్ఞాత్మకుల్
గుఱుతింపందగు నట్లె ఱుంగుదును; గైకోవన్న! నా యన్న! యీ
చిఱుదిండ్లన్ నెలనాళ్లదాక; నటపై జేకూరు నీ కామ్యముల్.

చక్షుర్గోచరమైన యీ జగతికిం జాటై యనేకాద్భుత
ప్రేక్షాలక్షిత మెంతయేన్ గలదు, తద్విజ్ఞాన సర్వస్వమున్
లక్షింపం దగు శక్తి మర్త్యులకు గల్గన్ లేదు; యద్దాన; బ్ర
త్యక్షంబైనది నీ కొకింత; యట మాటై యింక నేమున్నదో

కరుణామూర్తి; జగత్కుటుంబి; యత డిక్కట్లన్ ననున్ ముంచునన్
వెఱ నాకింతయు లేదు; తన్మయత నే వేళం బ్రవర్తిల్లుదున్.
మరణం బిప్పుడు తప్ప దేనదియు సంప్రాప్తించు; లేకున్నచో
దొరకున్; నా పరితోషహేతు విట మీ ర్దుఃఖింపగా నేటికిన్.

## ఒకమాట

అస్మద్గురు దేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వికృతినామ సంవత్సర శ్రావణ బహుళ విదియ మంగళవారము (29-8-1950) మధ్యాహ్నం 12 గం. 30 నిమిషాలకు నిర్యాణము చెందారు. సాయంకాలం 6 గం.కు సంస్కారాలు పూర్తి అయి స్నానాదులు మగించుకొని మిత్రులంతా వస్తూ వుండగా మిత్రులు శ్రీ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగారు-

"ఎంతోమంది శిష్యులున్నారు - శ్రీ శాస్త్రిగారు రచించిన రచనలు ఎన్నో వున్నాయి. అవన్నీ ప్రకటింపబడేటట్లు చూడండి. వారు అనుసరించిన యోగమార్గాన్ని కొనసాగించండి. ఇవి నా కోరికలు" అన్నారు. ఆనాడే వారి సంకల్ప బలంవల్ల "యోగ మిత్రమండలి" అనేది ఏర్పడింది. అందులో సభ్యులుగా కొందరు చేరారు. మరికొందరు మాకు యోగంతో సంబంధం లేదుకదా! మరి మేమేం చేయాలన్నారు. అప్పుడే యోగంతో పరిచయం కలవారికై "యోగ మిత్రమండలి" అనీ- శ్రీ శాస్త్రిగారితో పరిచయం కలవారికై "శ్రీ ప్రభాకర మిత్రమండలి" అనీ- శ్రీ శాస్త్రి రచనలయెడ ఆదరాభిమానాలు కలవారికై "శ్రీ ప్రభాకర పరిశోధకమండలి" అనీ స్థాపించాము. అన్నీ శ్రీ శాస్త్రి గారికి సంబంధించినవే.

"మిత్రమండలి" అనే పేరు ఎందుకు పెట్టామంటే శ్రీ మాస్టర్ సి. వి. వి. గారు "యోగ ఫ్రెండ్సు సొసైటి" అని పేరు పెట్టారు. అందు కనుగుణంగా మా గురుదేవులు వారివద్ద చేరినవారి నందరినీ మిత్రులనే పిలిచేవారు - చెప్పేవారు ఆ భావాన్నే ప్రజ్ఞాప్రభాకరం మొదట్లో కూడా వ్రాశారు చూడండి.

మిత్రగోష్ఠిలో విన్నవించుకొనుట కొఱకే నా యీ గ్రంథరచన ప్రయత్నము.

శ్రీ శాస్త్రిగారు రచించిన ప్రజ్ఞాప్రభాకరాన్ని మొదటిసారిగా శ్రీకంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగారు యోగమిత్రమండలి పేర 1951 వ సం॥రం. ప్రకటించినారు. అందుకయ్యే వ్యయమంతా వారే భరించినారు. ఆ పుస్తకాలు ఎప్పుడో అయిపోయాయి. కాని ఆనాటినుండి ఎన్నో ప్రయత్నాలు చేశాము. కాని కాలం కలిసిరాలేదు. పుస్తకం మరల అచ్చుకాలేదు.

మిత్రమండలుల పేరనే శ్రీ గురుదేవుల రచనలు అయిదారు ప్రకటింపబడి ప్రసిద్ధినీ ప్రాచుర్యాన్నీ చూరగొన్నాము.

ఈ మధ్య ఒకరోజు ప్రార్థన సమావేశంలో ప్రజ్ఞాప్రభాకరము చదువుతూ ఉండగా మిత్రులంతా తమకు పుస్తకాలు కావాలని అడగడం ప్రారంభించారు. పుస్తకాలు లేవన్నాము. యోగమునందు ప్రగాఢవిశ్వాసము-శ్రీ శాస్త్రిగారి ఎడ భక్తి ప్రపత్తులు చూపడానికై "యోగప్రభా పబ్లికేషన్సు" అను పేరుతో ఒక సంస్థను స్థాపించి-ప్రథమ కుసుమంగా ఈ ప్రజ్ఞాప్రభాకరం ద్వితీయ ముద్రణం చేయడానికి శ్రీ పబ్బతి ఎరుకలయ్యగారు తలపెట్టినారు. (లాభ నష్టాలతో పనిలేకుండా) పుస్తకానికి ఎంత ఖర్చు అవుతుందో అంత పెట్టుబడి పెట్టి - పెట్టుబడి తిరిగి రాబట్టుకోవాలి గానీ లాభం దృష్టితో అచ్చువేయరాదని నిర్ణయించి - ప్రారంభించాం.

మిగిలి ఉన్న శ్రీ గురుదేవుల రచనలన్నీ మిత్రుల సహాయ సహకారాలతో ఇదే విధంగా త్వరలో వెలువరింపబడగలవని ఆశిస్తున్నాను.

మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "చాటు పద్య మణిమంజరి" పీఠిక (1952 ప్రచురణ - 2వ భాగం)లో -

"పూజ్యులు శ్రీ ప్రభాకర శాస్త్రిగారి యితర రచనలను గూడ యధోచిత రీతిని గ్రంథరూపమున ప్రకటించి పుణ్యము కట్టుకొందురు గాక యని ఈ మిత్రమండలివారిని కోరుచున్నాను" అన్నారు.

గురుదేవులు శ్రీ శాస్త్రిగారి రచనలు మిత్రమండలి వారు ప్రకటించాలనీ - ప్రకటిస్తారనీ ఆశిస్తున్న విద్యల్లోకమునకు ఆశాభంగం కలగకుండా చూడవలసిన బాధ్యత మిత్రమండలిపై ఉన్నదని మనవి చేస్తున్నాము.

సకాలంలో ససిగా సర్వాంగ సుందరంగా ప్రజ్ఞాప్రభాకరాన్ని అచ్చువేసి మా కందించిన శ్రీ క్రాంతి ప్రెస్ ప్రొప్రయిటరు శ్రీ ధనికొండ హనుమంతరావుగారికి ధన్యవాదా లర్పిస్తున్నాము.

ప్రజ్ఞాప్రభాకరము ద్వితీయ ముద్రణము సర్వాంగ సుందరముగా అచ్చువేసి ఇచ్చిన మాస్టర్ ఆఫ్‌సెట్ ప్రింటర్సు ప్రొప్రెయిటరు శ్రీ బాదర్ల దేవదాసు గారికి మా ధన్యవాదాలు అర్పిస్తున్నాము.

శ్రీ మాస్టరు సి.వి.వి.గారు తమ రచనలను శ్రీ ప్రభాకర మిత్రమండలివారు ప్రకటించవలసినది అని ఆదేశించినారు. వారి ఆదేశము సరియైనది కాబట్టి సి.వి.వి.గారి నోట్సులు, డైరీలు ఆంగ్లంలో 1982 నుండి ముద్రింపబడుతున్నాయి. యోగమిత్రుల సహాయ సహకారాలతో మిగిలిన మాస్టరుగారి సాహిత్యాన్నంతా (తమిళంలో ఉన్నదానితోసహా) త్వరలో శ్రీ ప్రభాకర మిత్రమండలి

వారు ప్రకటించగలరు అని సవినయంగా మనివి చేస్తున్నాను.

శ్రీ మాస్టరుగారి సాహిత్యం వెలువడిన తరువాతనే యోగమిత్రులు కొందరు సత్యాన్ని గ్రహించి బాగుపడుతున్నారు. అంతా సాహిత్యం వెలువడితే కల్తీలేని సి.వి.వి. గారి సిద్ధాంతం యోగమిత్రులకు తెలియగలదు.

ఎ.వి. శ్రీనివాసాచార్యులు (సీ.సా)

# HELENA PETROVNA BLAVATSKY

The greatest occultist in the history of Western civilization, a direct agent of the Trans-Himâlayan Brotherhood of Adepts.

Born 12 August (31 July old Russian style) 1831, at Ekaterinoslav, Ukraine, Russia. Daughter of Col. Peter Alexeyevich von Hahn, and Helena Andreyevna, *née* de Fadeyev, renowned novelist who died young. Grand-daughter on maternal side of Privy Councillor Andrey Mihailovich de Fadeyev, and Princess Helena Pavlovna Dolgorukov, who supervised her education at Saratov and Tiflis, Caucasus. At an early age, travelled with her father in Western Europe. Endowed from childhood with remarkable psychic sensitivity. Married, 1849, Nikifor Vassilyevich Blavatsky, a State official, very much her senior. Left him and travelled in Turkey, Greece, Egypt, France, 1849-50. Met her Master in London, 1851. Embarked for Canada later in the year; went to New Orleans, Mexico, South America, West Indies; thence via the Cape and Ceylon to India, 1852. Attempted but failed to enter Tibet. Returned to England via Java, 1853. Went to America again, Summer 1854, crossing the Rockies with caravan of emigrants. May have visited South America again. Left for India, late 1855, via Japan and the Straits. Travelled throughout India, Kashmir, Ladakh, parts of Tibet, Burma, 1856-57. Returned to Europe,

via Java, 1858, staying in France and Germany. Then returned to Russia, reaching Pskov on Christmas night, 1858. Left for the Caucasus, early 1860, where she travelled among the native tribes, remaining there until 1864 or 1865. Experienced severe physical and psychic crisis, acquiring complete control over her occult powers. Left Russia again, and travelled extensively in Balkans, Egypt, Syria, Italy, 1866-67. Returned to Italy, 1867, and paid a short visit to Southern Russia. Was present at the battle of Mentana, 3 November 1867, and was wounded. Went to India and Tibet late 1868. Returned to Greece, 1870. Embarked for Egypt and was shipwrecked near the Island of Spetsai, 4 July 1871. Settled in Cairo, 1871-72, where she tried to form a Société Spirite which soon failed. Travelled in Syria, Palestine, the Lebanon, 1872, returning for a short time to Odessa. After brief travels in Eastern Europe, went to Paris, Spring 1873. Left for New York, landing 7 July. Met Col. Henry Steel Olcott at the Eddy farmhouse, Chittenden, Vt., 14 October 1874. Started her literary career, late 1874, by writing in defence of genuine spiritualistic manifestations.

Founded The Theosophical Society, together with Col. Olcott and others, 8 September 1875, (Inaugural Address of Col. Olcott delivered 17 Nov. 1875). Published her first great work, *Isis Unveiled*, Autumn of 1877. Became American citizen, 8 July 1878. Left for India, with Col. Olcott, 17 December 1878, settling at

Bombay. Launched her first magazine, *The Theosophist*, October 1879, which resulted in rapid growth of theosophical work in India during 1879-83. Transferred Headquarters to Adyar, Madras, January 1883. Left for Europe, 20 February 1884, accompanied by Olcott and others. After visiting Nice, settled for a while in Paris to work on *The Secret Doctrine*. Briefly visited London. Moved to Elberfeld, Germany, Autumn of 1884, at which time the Coulomb conspiracy broke out at Adyar. Went to London, October 1884, and soon after sailed for India, reaching Adyar 21 December 1884. Gravely ill, February 1885, but restored by her Master. Sailed for Naples, 31 March 1885, leaving India for good. After a brief stay at Torre del Greco, settled at Würzburg, Germany, where she wrote a large portion of *The Secret Doctrine*. Moved to Ostend, July 1886, visiting Elberfeld on the way. Continued her literary task. Transferred her residence to London, May 1887, where the Blavatsky Lodge was established, and her second magazine, *Lucifer*, launched, September 1887. Published *The Secret Doctrine* late Autumn 1888. Published *The Key to Theosophy* and *The Voice of the Silence*, 1889. Established, 1890, European Headquarters of The Theosophical Society, at 19 Avenue Road, London, where she died in the midst of arduous labors, 8 May 1891. Cremated at Woking Crematorium, Surrey.

# మాస్టర్ యోగాశ్రమం

మాస్టర్ యోగాన్ని మన యోగాశ్రమం ద్వారా నేర్చుకుని సాధన చేయదలిచిన వారు ముందుగా మన ప్రచురణలు చదివి పూర్తిగా యిష్టమైతేనే యోగంలో చేరాలి. 'యోగమార్గం' పత్రిక చదవాలి. యోగాశ్రమ పద్ధతులు నచ్చితే, నియమాలు మీకు అనుకూలం అయితే తప్పక చేరవచ్చు. అనేక జబ్బులకు ట్రీట్‌మెంట్ కోసం వచ్చేవారు కూడా యోగం చేయవలసి వుంటుంది. డాక్టర్ల వద్దకు వెళ్లి మందు తీసుకోవడం వంటిది కాదు యోగ చికిత్స. పూర్తిగా యోగంపైన విశ్వాసం వుండాలి. గురువుపైన నమ్మకం వుండాలి. యోగచికిత్సపైన 'గురి' వుండాలి. అన్నింటినీ మించి పూర్తి విశ్వాసం వుండాలి. అప్పుడు యోగ సాధన ఫలిస్తుంది. రోగాలకు పూర్తి చికిత్స జరుగుతుంది.

| | |
|---|---|
| సాధకులకు ప్రవేశరుసుము | రూ 500/- |
| సంవత్సర చందా | రూ 500/- |
| ట్రీట్‌మెంట్ ఫీజు | రూ 2000/- |
| శాశ్వత సభ్యత్వం | రూ 5000/- |

## యోగమార్గం పత్రిక

| | |
|---|---|
| రెండు సంవత్సరాలకు | రూ 100/- |
| జీవితచందా | రూ 500/- |

యోగసభ్యులు తప్పకుండా పత్రికకు చందాదారులు కావాలి
మన ప్రచురణలు తెప్పించుకుని చదవాలి

శ్రీ శాక్తగత గారి సీ

time join any other rival School and will not abuse or work against the interests of this School.

With the above declaration I affix my signature hereunder.

*Date.* Jan 11 17

*Signature*........ Elizabeth Sharpe

*Name*........ E. Sharpe.

*Address*........ Limbdi - Kathiawar

THE INDIA PRINTING WORKS, MADRAS.

**Back Cover**

MASTER C.V.V YOGA CENTRE PUBLICATIONS
(Sri Prabhakara Mitra Mandali)

1. Masters Notes Volume 1 - Rs. 25-00
2. Masters Notes Volume 2 - Rs. 25-00
3. Masters Notes Volume 3 - Rs. 25-00
4. Masters Notes Volume 4 - Rs. 40-00
5. Planetary Leading Notes - Rs. 25-00
6. Masters Diary - Rs.150-00
(1/4 Demmy, 480 Pages)

Sri Prabhakara Sastrijis Writings
about Yoga in Telugu

1. Pragna Prabhakaramu - Rs. 20-00
2. Pravachanalu - Rs. 10-00

--------------------------------

Bhruktha Rahita Taraka Rajayogamu
Prasnalu - Samadanalu - Rs. 50-00

C.V.V Rachanala Adaranga by
A.V.Srinivasa Charyulu.

----

For Copies:

A.V.SRINIVASA CHARYULU,
NO.12, RAMULAVARI UTTARA MADA VEEDHI,
TIRUPATI - 517 507.
PHONE - 28814.

ALL CORRESPONDENCE SHOULD SENT TO
TIRUPATI ONLY.